BOMBAY'S

# Kwality
## ICE CREAM




క్వాలిటీ ఐస్‌క్రీమ్ మన దేశ వాసులకే కాక సుదూర దేశాలలోని షార్జా, జెడ్డా మరియు ఉత్తర యెమెన్ ప్రజలకు కూడ ఆహ్లాదకరమైనది, అత్యంత ప్రీతికరమైనది

ఇప్పుడు అత్యాధునికమైన విదేశీ యంత్ర సహాయముతో విజయవాడలో తయారు చేయబడిన క్వాలిటీ ఐస్‌క్రీమ్ మీ రుచికే కొత్తదనం తెస్తుంది మీ మధురమైన కలలను నిజం చేస్తుంది.

ప్రత్యేకంగా మీ కోసం తయారు చేసిన నోరూరించే రుచులు, రకాలు ఎన్నో! పిల్లలకు 'మినీబాల్' కోరినవి కావలసిన వారికి 'స్వింగర్లు' . తొందరలో వున్నవారికి 'ఐస్‌క్రీమ్ శాండ్ విచెస్'. ఇవి కాక 'టోపోకోన్' - భారత దేశపు ప్రప్రథమ ప్రీ ప్యాక్‌డ్ ఐస్‌క్రీమ్ - రెండు మధురాతి మధురమైన రుచులలో లభిస్తుంది.

మీరు కోరుకునే ప్రత్యేకమైన రుచుల కొరకు పై గుర్తు కోసం చూడండి.

# క్వాలిటీ ఐస్‌క్రీమ్

మీరు ప్రేమించే మధురమైన మీ కలల క్రీమ్

## విబిసి ఫుడ్స్ ప్రైవేట్ లిమిటెడ్

తాడిగడప - 521 137 విజయవాడ

ఆంధ్రప్రదేశ్‌లో క్వాలిటీ ఐస్‌క్రీమ్ ట్రేడ్ మార్కును ఉపయోగించుటకు లైసెన్స్ పొందిన ఏకైక సంస్థ.

Kwality ICE CREAM a dream with cream

ఫోన్లు: హైదరాబాదు: 231773, విజయవాడ: 58351, విశాఖపట్టణము: 69397, గుంటూరు: 30765, తిరుపతి: 2501, నెల్లూరు: 4519,
రాజమండ్రి: 3303 P.P, భీమవరం: 2210, మచిలీపట్నం: 468 P.P. ఏలూరు: 22449, తాడేపల్లిగూడెం: 2149 P.P.
కాకినాడ: 6525, ఒంగోలు: 3171, ఖమ్మం: 3096, Res: 8738 P.P.

LAA.

## ముఖచిత్రం

ఏగురాకులలో చిట్టి చేమంతిలా చిరునవ్వుల చంద్రికలు చిలికించేను చిలిపి అల్లరి రాధ!

ఆ ఓరచూపుల మల్లెల తూపుల ధాటికి నాపై కురిసేను మధుర సుధ!

ఆ కలికి చెక్కిళ్ళపై చిరుసిగ్గునై చిగురంత ఎఱుపునై మెఱుయాలని నాలోని భావుకత పడుతోంది వ్యధ

ఆ సుందరి అందాలకు మైమఱచి ఆంధ్రదేశమంతటా ఆమె అనురాగమే పులకించి, ఒలికిస్తోంది అభిమానాల వరద!

వెన్నెల దొన్నెలంటి విశాలనయనాలూ మదుబాండాలంటి సిందూరాధరాలూ– మురిపెంపు నాసికాముద్దుగొల్ప

ఆ జవ్వనిని గాంచినంతనే అనిపించెను 'ఈమె అవునేమొ అలనాటి బృందావనిలోని అభిసారిక రాధ!

వెనువెంటనే నాలో కదిలింది కమనీయమైన భావగాథ!

ఇంతటి ఆనందాన్ని కలుగజేసినందుకు మా పత్రిక కు నిండు మనసుతో కృతజ్ఞత లర్పించెద!

ఆ నీలవేణి కంటికాటుకనైనా కాకూడదా ?!'

అని కలలలో తేలిపోవుచూ పత్రికలో నా భావపరంపరకై కనులు కాయలు కాచేలా నిరీక్షించుచుండెద!

వేముల వాణి, అల్లూరు(నెల్లూరు)

★ ★ ★

బ్యూటీ క్వీన్ రాధ ముఖచిత్రము చూడ ముచ్చటగా, ఎంతో ఆకర్షణీయంగా ఉంది

–నరసింహ కుమార్ దాసు, ఇచ్ఛాపురం

★ ★ ★

అందాల ముద్దుగుమ్మ రాధ ముఖచిత్రం బాగుంది

–ఆర్ రమాదేవి, అనకాపల్లి




## సీరియల్స్

"ఒడిలో చెలిమోహన రాగం", ఒకటి ఒకటీ మూడు' సీరియల్స్ బాగున్నాయి. క్రొత్త సీరియల్ 'ఆశయం మమ్మల్ని వాటి వలెనే ఆకట్టు కోగలదని ఆశిస్తాము రచయిత(త్రు)లకు మా ధన్యవాదాలు

–పి రఘురామ్, నాగపూర్

★ ★ ★

రాధ ముఖ చిత్రము చాల ఆకర్షణీయముగా ఉంది "ఒకటి ఒకటీ మూడు" సీరియల్ రసవత్తరముగా సాగుతూంది

–దూదల రమేష్, జనగామ

★ ★ ★

'ఆరోహణ' సీరియల్ శైలకుమార్ గారి రచనా నైపుణ్యానికో మచ్చుతునక శైలి చాలా బావుంది సినీ ఇండస్ట్రీ గురించి వివరంగా తెలుపుతున్నారు రచయితకు అభినందనలు

–కొండమూరి శ్యామ, గుత్తెనదీవి

★ ★ ★

"బ్యూటీ క్వీన్ రాధ ముఖ చిత్రం ఆకర్షణీయంగా ఉంది తేజోవతి గారి "ఒకటి ఒకటీ మూడు' సీరియల్ చాలా బాగుంది రచయిత్రికి అభినందనలు

–ఆచంటి శ్రీవల్లీ దేవి, పొందూరు

( 74 వ పేజీ చూడండి)




# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం . 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు (1938-1972)

27 ఫిబ్రవరి-5 మార్చి'87

శ్రీ అక్షయ నామ సం మాఘ బ. చతుర్దశి

సంపుటము 79 : సంచిక 26

ముఖ్య సంపాదకుడు .

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు .

మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు. 80 60 |
| పోస్టులో 12నెలల చందా | రు 161 20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం,విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం .

నటి విజయశాంతి

(ఫొటో ప్రసాద్)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# కొత్తవారి నుంచి తెలుసుకోవటం అంటే....?

భారత ప్రధానిని కలుసుకుని, ఇంటర్వ్యూ చేసే అవకాశం కోసం నేను కొన్ని సంవత్సరాలుగా ప్రయత్నిస్తూనే ఉన్నాను ఇందులో నేను విజయం సాధించలేదు ఈ గొప్ప అవకాశం ఫిన్‌లాండ్‌లోని పిల్లల పత్రిక ఒకదానికీ, ఎడిలైడ్‌లో స్త్రీల వారపత్రిక ఒకదానికీ ప్రస్తుతం లభించింది ప్రధాన మంత్రి కార్యాలయంలోని కంప్యూటర్లలో నా పేరు – మృదువుగా చెప్పాలంటే – బురద కాని ఈ మధ్యనే నా మిత్రులొకరు ప్రస్తుతం మనకు బహిరంగ ప్రభుత్వం ఉన్నది గనుక, బహిరంగ ప్రధానమంత్రి కూడా ఉన్నారు గనుక, సవ్యమైన మార్గాల్లో వెళితే ఆ మహానుభావుణ్ని కలవక పోవటమన్న సమస్యే లేదని సలహా ఇచ్చారు

"సవ్యమైన మార్గాలంటే ఏమిటి?' అని నేనడిగాను.

'ఓ అభ్యర్థన వ్రాసి మూడు కాపీలు తీయించు అంటూ ఒక ప్రతిని అండమాన్ దీవుల్లో రేవుల కెప్టెన్‌కు పంపమని సలహా ఇచ్చాడు

'అండమాన్స్‌కు ఎందుకు?' అని ప్రశ్నిస్తూ అమితాబ్ బచ్చన్ ఆహ్వానించినా సరే, అండమాన్సకు వెళ్ళే ఉద్దేశం నాకులేదు అన్నాను

"నీ అభ్యర్థన చేరే సరికి ఓ ఏడాది పట్టవచ్చు. అప్పుడిక నువ్వు ప్రధానమంత్రిని అండమాన్సలో నే కలుసుకోవలసి వస్తుంది'

సలహా ప్రకారమే నేను అభ్యర్థన పత్రం మూడు కాపీలు తయారు చేశాను నా పుట్టిన తేదీ, పాస్‌పోర్టు నెంబరు, నా బాంక్ ఖాతాలో నిలువ వంటి వివరాలు కూడా రాశాను ఇలాంటి వివరాలు కంప్యూటర్లను మెప్పిస్తాయని నేను విన్నాను కంప్యూటర్లు మరలు దేవుడి మరల లాగనే ఆలస్యంగా తిరుగుతాయి, కాని బాగా మరపడతాయి

ఓ రోజు ఉదయం నా వద్దకి ఒక మనిషి రావటం జరిగింది ఆయన ప్రధాన మంత్రి భద్రతా ఏర్పాట్లు చూసే వ్యక్తి అని తెలిసింది "ప్రధానమంత్రిని మీరెందుకు కలవాలనుకుంటున్నారు?" అని ఆయన ప్రశ్నించారు అది మంచి ప్రశ్నే అని అనుకున్నాను.

ఇలాంటి ప్రశ్నలు అడిగే వాళ్ళవరితో నేయినా చెప్పినట్టు గానే ఆయనతో కూడా నేను ప్రధానమంత్రితో దేశానికి సంబంధించిన సమస్యలు చర్చించదలచుకున్నానని చెప్పాను

'ప్రధానమంత్రి అలాంటి ప్రశ్నలకు సమాధానమిచ్చే స్థితిలో లేరు అన్నాడావ్యక్తి ఇది చాల విచిత్రంగా ఉందని నాలో నేను అనుకున్నాను దేశానికి సంబంధించిన విషయాలు ప్రధాన మంత్రితో చర్చించడం సాధ్యం కాకపోతే ఇక మరెవరితో చర్చించాలి?

రెండు నెలల తర్వాత కంప్యూటర్‌లో అచ్చయిన ఉత్తరం లాంటిది ఒకటి నాకు అందింది ఫలాన రోజున ప్రధానమంత్రి కార్యాలయంలో నన్ను నేను హాజరు పెట్టుకోవాలని – దాంట్లో సరిగ్గా అట్లాగే రాశారు– ఉత్తరంలో ఉంది నేను నా టేప్ రికార్డర్‌లో కొత్త బ్యాటరీలు పెట్టుకుని, గొంతు సరిచేసుకుని రేస్ కోర్స్ రోడ్ను వైపు నడిచాను

నన్ను ఓ విశాలమైన కార్యాలయంలోకి పంపించారు గాని అక్కడ బల్ల ముందు కూచున్నాయన ప్రధాన మంత్రి లాగ కనిపించ లేదు కాని ఆ ముఖం చాలా పరిచితమైనదే అది మీరు టి వి తెర మీద చూసే ముఖం లాంటిదే, ముఖ్యంగా ప్రధానమంత్రి తన పరివారంతో సహా జల్పాయిగురి, దండకారణ్య బస్తీలలో విసుగూ విరామం లేకుండా తిరుగు తున్నప్పుడు వెంట ఉండేటటువంటి ముఖం అది

మి ఇష్టం వచ్చిన ప్రశ్నలేవైనా నన్ను అడగవచ్చు అన్నాడా వ్యక్తి 'అప్నా ఉత్సవ్ నుండి అంతర్జాతీయ ద్రవ్యనిధి అప్పు దాకా ప్రతి విషయం మీదా ప్రధాన మంత్రికి సమాచారం అందించేది నేనే నేను ఆయనకు చెప్పని విషయమేదీ ఆయన మీకు చెప్పలేరు'

నాకు అప్నా ఉత్సవ్ పట్ల ఆసక్తిలేదు– అసలు అది ఉత్సవమే కాదను కోండి– అంతర్జాతీయ ద్రవ్యనిధి అప్పుపట్ల ఆసక్తి లేదు ఎందుకంటే నాకు అవసరం అయ్యే చిన్న అప్పులకోసం నేను దాని దగ్గరికి వెళ్ళను నేను ప్రధానమంత్రిని అడగ దలచుకున్న ప్రశ్నలు ప్రత్యేకమయినటు వంటి వనీ, వాటికీ అప్నా ఉత్సవ్‌కూ సంబంధం లేదనీ నేను ఆయనకు చెప్పాను

"మీరు ఆయనను అరుణ్ నెహ్రూ గురించి అడగ దలచుకున్నా రనుకుంటాను కదూ అన్నాడాయన తనకు తానే సంతోష పడుతూ

కాదు, కాదు, వెంకటేశ్వరన్ గురించి కూడా కాదు' అన్నాను

ఆయన ఆశ్చర్య పోయాడు 'వెంకటేశ్వరన్ గురించి కూడా కాదా? ఆయన గురించి ప్రధాన మంత్రి చెప్పే దానికన్న నేను ఎక్కువ చెప్పగలను అసలే మయిందంటే

"ఆగండాగండి వెంకటేశ్వరన్ వ్యవహారం నాకు కుతూహలం కలిగించదు అది ముగిసి పోయిందీ, గడిచి పోయిందీ ఇంతకూ, నేను తెలుసుకోదలచుకున్నదేమంటే "

మనం పాకిస్తాన్‌లో ఎప్పుడు ప్రవేశించ బోతున్నామో తెలుసుకోవాలను కుంటున్నారు, గదూ తనలోంచి తానే పక్కకొచ్చినట్టు అన్నాడు ఆయన

ఇది నాకు కొత్త విషయం మనం పాకిస్తాన్‌లో ప్రవేశించ బోతున్నామని నాకు తట్టనే లేదు నేను ఏ అభిప్రాయంతో ఉన్నానంటే, పంజాబ్‌లో పరిస్థితులు ఘోరంగా ఉన్నాయి భారత ప్రభుత్వం బర్నాలా ప్రభుత్వంతో, బర్నాలా ప్రభుత్వం



## ఆంధ్రపత్రిక పాఠకులకు చక్కటి అవకాశం!



# కళ్యాణవేదిక
## ఉచిత సమాచారం



జీవితానికి వివాహం ఒక మలుపు. 'ఒకరి కొకరు రాసిపెట్టడం' విధి చేతిలోనిదనే నానుడి అందరెరిగినదే. అయితే రాసిపెట్టినవారు చేరువయ్యే క్షణం అంత సులభం కాదు. మానవప్రయత్నం కూడా కావాలి. ఇందుకు ఎంతో శ్రమ, త్రిప్పట, వ్యయం అవుతోంది.

సమాజంలో నెలకొనియున్న ఈ సమస్యకు పరిష్కార మార్గంగా ఆంధ్రపత్రికలో కొంతకాలంగా "కళ్యాణ వేదిక" శీర్షికన తగ్గింపు రేట్లపై ప్రకటనలు వేయడం జరుగుతోంది.

ఈ శీర్షికను మరింతగా ప్రజలకు వుపయోగపడేందుకు వీలుగా విస్తృతపర్చి ప్రతి బుధవారం "కళ్యాణ వేదిక ఉచిత సమాచారం" శీర్షికగా ఆంధ్రపత్రిక దినపత్రికలో ప్రకటించాలనుకుంటున్నాము.

వధూవరులవివరాల వుచిత సమాచారము కోరువారు/యిచ్చేవారు పూర్తివివరములను అంటే వరుడు/వధువుకు సంబంధించిన వయసు, చదువు, ఇతర అర్హతలు సుమారు 150 అక్షరాలకు మించనట్లు తెలుగులోనే స్పష్టంగా వ్రాసి, ఈ దిగువ కూపనును జతపర్చి మీ వూరిలోని ఆంధ్రపత్రిక ఏజెంటు ద్వారా పంపాలి. చిరునామా పిన్‌కోడ్‌తోబాటు సమగ్రంగా ఉండాలని మనవి.

ఆ విధంగా మాకు అందిన వధూవరుల సమాచారమును వుచితంగా వారమునకు ఒకసారి ప్రతి బుధవారం వీలువెంబడి ప్రకటిస్తాము.

### ఉచిత వధూవరుల సమాచారము యివ్వ దలచినవారు ఈ దిగువ నిబంధనలు పాటించాలి.

- ★ వధువు/వరునికి సంబంధించిన వివరాలు సమగ్రంగా, అచ్చులో 150 అక్షరాలకు మించనట్లుగా తెలుగులోనే స్పష్టంగా వ్రాసి పంపాలి.
- ★ వధువు/వరుల తల్లిదండ్రులు, సంరక్షకులు తాము యిచ్చే సమాచారము వాస్తవమని, ఎవరినీ కించపర్చే విషయము అందులో లేదని హామీ ఇవ్వాలి.
- ★ సమాచారం పంపేవారి పేర్లు వగైరా రహస్యంగానే వుంచబడతాయి. ప్రతి ప్రకటనకు ఒక బాక్సు నెంబరు కేటాయించి, వచ్చిన జవాబులు ఉచితంగానే వాటికి సంబంధించినవారికి నెల రోజులలోపు పంపడం జరుగుతుంది.
- ★ ఈ శీర్షికను కుల మత వర్గ భేదాలు లేకుండా అందరూ వుపయోగించుకోవచ్చును.
- ★ అందిన సమాచారము ప్రతి బుధవారం మాత్రమే, అవి అందిన వరుస క్రమంలో ప్రకటించబడతాయి. వీటిని త్రిప్పి పంపే ప్రసక్తి లేదు. కావున స్వంత అడ్రసుగల కవర్లు, లేదా స్టాంపులు జతపర్చకూడదు.
- ★ ప్రకటనకు ఏదైన అనర్హమైనదిగా తోచినపుడు వాటిని వెయ్యకుండా ఆపుచేసే హక్కు పత్రికకు వుంటుంది.
- ★ ఇతర విధములైన వుత్తరప్రత్యుత్తరములకు అవకాశం లేదు. ఫోటోలు పంపకూడదు.

**కళ్యాణ వేదిక ఉచిత సమాచార కూపను**

పేరు ______________________________

చిరునామా ______________________________

______________________________ పిన్ కోడ్ ______________

స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటు సంతకం ______________________

## న్యూఢిల్లీ లేఖ

రిబెయిరోతో, రిబెయిరో టెర్రరిస్టులతో పోరాడుతున్నారు. కాని పాకిస్తాన్‌తో యుద్ధానికి తలపడడం అనేది పూర్తిగా కొత్త విషయం నాలోని జర్నలిస్టుకు కొత్త సంచలనాత్మక వార్త దొరకబోతున్నదని చురుకు పుట్టింది

మనం ఎప్పుడు యుద్ధాన్ని ప్రారంభించబోతున్నాం అని అడిగాను

ఆగండి వెంటనే నిర్ధారణలకు రాకండి మనం నిజంగా పాకిస్తాన్‌లో ప్రవేశించనున్నామని నేను అనలేదు

మనం ఒక దేశంలో ప్రవేశించకుండా ఆ దేశంతో యుద్ధం ఎట్లా చెయ్యగలమో నాకు అర్థం కావడం లేదు పోలెండ్ మీద యుద్ధం ప్రారంభించడానికి ముందు హిట్లర్ ఆ దేశాన్ని ఆక్రమించవలసి వచ్చింది కాకపోతే, పాకిస్తానే మనమీద యుద్ధం ప్రారంభిస్తే వేరనుకోండి

అదిగో – మీరు మళ్ళీ అసలు ఏదీ ఒప్పితంగా చెప్పలేం మీరు నా పేరు చెప్పి నన్ను ఉటంకించవద్దు గాని యుద్ధం తప్పనిసరి అని, మన సేనలు జియామీద విరుచుకు పడడానికి మోజు పడుతున్నాయని మాత్రం చెప్పగలను కాని మనకేమో ఇప్పుడు ఈ రిపబ్లిక్‌డే పెరేడ్ వంటి వ్యవహారాలు చేతిలో ఉన్నాయి చేతిలో పనులన్నీ అయిపోగానే

సంచలనాత్మక వార్త గురించి సందేహమేమీ లేదు సరిగ్గా అప్పుడే ఆ గదిలోకి ఒక వ్యక్తి వచ్చి మర్నాడు ప్రధానమంత్రి పత్రికా సమావేశం ఏర్పాటు చేస్తున్నారని చెప్పాడు నేను అనుమానించిన విషయాన్ని ఇది దాదాపుగా నిర్ధారించింది నేనింక ఆ ప్రధాని సహచరుడితో, ప్రధానితో ఇంటర్వ్యూ కాకపోయినా కనీసం పత్రికా సమావేశానికయినా హాజరవుతానన్నాను

ఆ సమావేశంలో నా ఉత్సాహాన్ని ఆపుకోవడం చాలా కష్టమయింది గాని ఆపుకోగలిగాను సమావేశం ముగియడానికి ఇంకా నాలుగు నిమిషాలుందనగా మన సేనలు పశ్చిమ సరిహద్దు ప్రాంతంలో ఎవరికీ చెందని భూభాగంలోకి ప్రవేశించబోతున్నాయన్న వార్త నిజమేనా అని అడిగాను

ఆ విషయం మీ కెవరు చెప్పారు? అని అడిగారు ప్రధానమంత్రి

ప్రధానమంత్రి కార్యాలయంలో నాకు వార్తలందించే ఏకైక వ్యక్తి అయిన నా మిత్రుడి పేరు నేను చెప్పలేను అందుకని అప్పటికప్పుడు ఏదో ఒక కొత్త మార్గాన్ని ఆలోచించ వలసి వచ్చింది రక్షణ శాఖ మంత్రి పేరు గొణిగాను

మీరు త్వరలోనే కొత్త రక్షణ శాఖ మంత్రి నుంచి ఏ విషయం తెలుసుకోగలుగుతారు అంటూ వెళ్ళిపోయారు ప్రధానమంత్రి నా మిత్రుడు ఆయనను వెన్నంటే వెళ్ళిపోయాడు

ఆ విధంగా విశ్వనాథ ప్రతాప్ సింగ్ గారు రక్షణ శాఖ మంత్రిగా తన ఉద్యోగం పోగొట్టుకున్నారు □

●●ఇదుగో వచ్చింది! కొత్త వీల్
ఆకుపచ్చ బిళ్ల-
శక్తిగల డిటర్జంట్●●




కొత్త

# వీల్

ఇక మీదట, ఎవరికొక్కావాలి సబ్బు? కొత్త వీల్ డిటర్జంట్ వచ్చిందిగా. వీల్! ఎక్కువ బట్టల్ని ఉతుకుతుంది. సబ్బు కన్నా ఎక్కువ శక్తివంతంగా ఉతుకుతుంది. అయినా, వీల్ ధర సబ్బు కంటె తక్కువ!

**శుభ్రపరిచే శక్తి ఎక్కువ...**
**కాని ధర ఎక్కువ కాదు.**

LINTAS WL 16 2317 TL

కేవలం రూ. 1·75
స్థానిక పన్నులు అదనం.

ఎన్నిక చేసిన కొన్ని పట్టణాల్లోనే దొరుకుతుంది. హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.




(గత సంచిక తరువాయి)

చిరు చీకట్లు ముసురుకుంటూ ఉండగా మెలకువ వచ్చింది ప్రణీత్‌కి

కొంచెంసేపు తనెక్కడున్నాడో అర్థం కాలేదు

"మంజూ!" అన్నాడు బద్ధకంగా

"ఏం కావాలి? కాఫీతేనా?"

"ఎవరిదా కంఠం? మంజూదికాదు, అమ్మది కూడా కాదు నిద్రా మెలకువకాని స్థితిలో పెనుగులాడుతున్నాడు ప్రణీత్ ఎదురుగా ఉన్న సూర్యకళను చూడగానే అతని మత్తు కొంత విడివడింది

కళ్ళమీద రుద్దుకుని, మనసు నదుపు చేసుకుని లేచి నిలబడ్డాడు ప్రణీత్

"చెప్పు! నిన్నీ పని కెవరు పురమాయించారు? సూర్యకళ జబ్బను గుచ్చి పట్టుకుని అడిగాడు

"తనను మోసగించటం ఇంత తేలికా" అనే భావన అతనికి పిచ్చెక్కిస్తోంది

"ఏ పనికి?" నిర్లక్ష్యంగా అన్నది సూర్యకళ

నామీద మత్తుమందు ప్రయోగించే పనికి ఈ కాస్త వ్యవధిలో ఏం చెయ్యాలని ప్లానేశారు?

'ముందు చెయ్యి వదలండి'

"చెప్పేదాకా వదలను"

వదలకపోతే అలాగే ఇంకా గట్టిగా కావలించుకోండి

స్టేషన్‌కి పద

"నేను రాను

నిన్ను అరెస్టు చేస్తున్నాను

'వారంటేదీ?'

'ఓహో! అది కూడా తెలుసా? అనుమానంమీద ఎవర్నయినా స్టేషన్‌కు లాక్కెళ్ళి ప్రశ్నించే [illegible] ఉంది నడు అంటూ ఆమెను ముందుకు నెట్టాడు ప్రణీత్

ఉన్నట్లుండి కెవ్వున అరిచింది సూర్యకళ అలా ఆపకుండా కేకలు పెడుతూనే జడ ముడి విడదీసుకుని ఏడవసాగింది

బయట రెడీగా ఉన్న మనుషులు ఏమిటేమిటంటూ లోపలి కొచ్చారు

ఈయన నన్ను బలవంతం చేస్తున్నాడు నేను ఎదురు తిరిగేసరికి కొట్టి స్టేషన్‌కి పదమని బెదిరిస్తున్నాడు" అంది సూర్యకళ

పగిలిన గాజుల తాలూకు రక్తపు బిందువు లామె మోచేతి దిగువ ఎర్రగా మెరుస్తున్నాయి

బొట్టు తడిసి పైట చెదిరి జుట్టు రేగి ఉన్న సూర్యకళను సానుభూతిగా చూస్తూ రక రకాల వ్యాఖ్యానాలు ప్రారంభించా రక్కడ గుమిగూడిన జనం

అందులో పాపారావు మనుషులే ఎక్కువ మంది ఉన్నారు

'అంతే! కాకీబట్ట లేసుకుంటే ఏం చేసినా చెల్లుతుంది పోలీసాఫీసర్లే ఇలాంటి వెదవ పనులకి పాల్పడుతుంటే ఇహ ప్రజలకు రక్షణ ఏముంటుంది?

రక రకాల వ్యాఖ్యానాలు వినవస్తున్నాయి

నీ చీప్ ట్రిక్కులు నా దగ్గర కాదు నీ చేత నిజం ఎలా కక్కించాలో నాకు బాగా తెలుసు నిన్ను ఇలా వదిలేస్తానని మాత్రం అనుకోకు అంటూ అక్కడినుంచి వచ్చేసి, రాజకుమార్‌కి ఫోన్ చేశాడు ప్రణీత్

ఇదంతా బాబూరావు, పాపారావుల ఎత్తుగడే అయి ఉంటుంది ప్రజలలో నీకున్న ఇమేజ్‌ని దెబ్బ తియ్యటానికి వేసిన మొదటి ఎత్తు ఇది' అన్నాడు రాజకుమార్

ఇలాంటి చవకబారు ఎత్తుగడలకి దెబ్బ తినేంత ఓటిది కాదులే నా ఇమేజ్ చూస్తుండు సూర్యకళచేత నిజం ఎలా కక్కిస్తానో' అన్నాడు ప్రణీత్

ఇంటి కొచ్చాక కామేశ్వరి చెప్పింది విని, నిర్ఘాంతపోయాడు ప్రణీత్

తనతో చెప్పకుండా మంజు ఇలాంటి పని చేసిందా!

బట్టలన్నీ పంపమని కబురేమిటి?

బహుశా ఈ కబురు ఆమెకు తెలీకుండా బాబూరావు పంపి ఉంటాడు

బాబూరావింటికి ఫోన్ చేశాడు ప్రణీత్

"మంజు నీతో మాట్లాడనంటోంది' అన్నాడు బాబూరావు

'ఆ సంగతి ఆమెనే చెప్పమనండి అన్నాడు ప్రణీత్

**జరిగిన కథ–16:** బాబూరావు తనను ఎదిరించి వివాహం చేసుకున్న మంజీర, ప్రణీత్‌ల పట్ల ద్వేషం పెంచుకుంటాడు ఆ ద్వేషాగ్నిని ఎగసన దోస్తుంటాడు పాపారావు భార్యను హత్యచేసిన పాపారావు కేసును దర్యాప్తు చేశాడని ప్రణీత్‌మీద వాళ్ళకోపం మరింత పెరుగుతుంది హైకోర్టులో శిక్ష కొట్టేయించుకొని వచ్చిన పాపారావు ప్రణీత్‌మీద కసి తీర్చుకోవడానికి ప్రయత్నిస్తుంటాడు సూర్యకళతో ఫోన్ చేయించి, ప్రణీత్‌ను ఆమె ఇంటికి పిలిపిస్తాడు. అక్కడ ప్రణీత్‌కు మత్తుమందు ఇచ్చి సూర్యకళతో పడకమీద ఉండగా ఆ దృశ్యం మంజీర చూసేలా చేస్తాడు అది చూసిన కోపంతో మంజీర తండ్రి దగ్గరికి వెళ్ళిపోతుంది.

"ఆమెకు ఒంట్లో బాగోలేదు.'

"ఏమయింది?' ప్రణీత్ కంఠంలో ఆదుర్దా

ఫోన్ టక్కున పెట్టేసిన శబ్దం.

తన మీద ఏదో కుట్ర జరుగుతోంది తనను సూర్యకళ ఇంట్లో మత్తులో పడేసి ఇక్కడనుంచి మంజును తీసికెళ్ళిపోయారు'

తమను విడదియ్యటానికి వేసిన ఎత్తు ఇది ఆమెకేం చెప్పారో!

ఏడిశారు వీళ్ళతరం కాదు తను ఇప్పుడే అక్కడికెళ్ళి మంజును తెచ్చేసుకుంటాడు .

గబగబా చెప్పు లేసుకోబోతున్న ప్రణీత్‌ని వారిస్తూ, 'నీరసంగా నలిగినట్లున్నావు స్నానం చేసి, భోంచేసి వెళ్ళు నాన్నా" అన్నది కామేశ్వరి

"ఇప్పుడే వచ్చేస్తాను మంజును తీసుకొస్తాను" అని చరచరా వెళ్ళిపొయ్యాడతను

"వాడు వాళ్ళింటి కెడుతున్నాడు ఒంటరివాడిని చేసి ఆ బాబూరావు ఏమన్నా అఘాయిత్యం చేస్తాడేమో ఇద్దరు కానిస్టేబుల్స్‌ని వెంటపెట్టుకుని మీరూ వెళ్ళండీ!" అన్నది కామేశ్వరి

ఇంకా నయం వాడు ఇనస్పెక్టరేమిటి నేను పోలీసుల్ని వెంటేసు కెళ్ళటమేమిటి వాడి అంతరంగిక వ్యవహారంలోకి వాడి అనుమతి లేకుండా ఇతరుల్ని లాక్కెళ్ళటం వాడి కిష్టముండక పోవచ్చు అందుకే తనొక్కడే వెళ్ళాడు

ఎంత చెడ్డా వాడాయన అల్లుడు

అయినా ప్రణీత్ అరగంట లోపున రాకపోతే రాజకుమార్‌ను తీసుకుని నేను వెడతాన్లే"

భర్త మాటలు కామేశ్వరికి ఓదార్పు నివ్వలేదు బాబూరావు అంత సాత్వికుడంటే ఆమెకు నమ్మబుద్ధి కావటం లేదు. ఇంట్లోకీ బయటకీ అశాంతిగా తిరుగుతోందామె. క్షణక్షణానికీ ఆమెలో టెన్షన్ అధికమవసాగింది

ఇహ భరించలేక హైమను పిలిచి, జరిగిందంతా చెప్పి, అక్కడేం జరుగుతోందో చూసి రమ్మని ఆమె భర్తను పంపే దాకా నిలవలేకపోయింది కామేశ్వరి

★ ★ ★ ★

బాబూరావు వాకిట్లోనే ఎదురయ్యాడు ప్రణీత్‌కి .

"ఏం కావాలి?" అన్నాడాయన

ఆయన్ను పట్టించుకోకుండా లోపలికి చూస్తూ 'తాతగారూ!' అని పిలిచాడు ప్రణీత్

ఆగ్రహంగా చూశాడు బాబూరావు అప్పటికే ప్రణీత్ గొంతు విని గుమ్మంలో కొచ్చారు తాతగారు లోపలికి రమ్మని అతన్నాహ్వానించారు

"నువ్వు నా ఇంట్లో అడుగు పెట్టటానికి వీల్లేదు అన్నాడు బాబూరావు

ప్రణీత్ దీన్ని ముందే ఊహించాడు గానీ తాతగారు మాత్రం నిర్ఘాంతపోయారు

ఇదేమిటిలా జరుగుతోంది?

అయితే . మంజీరను ప్రణీత్ అనుమతితో తీసుకురాలేదా?'

తన కొడుకు వాళ్ళిద్దర్నీ విడదియ్యటానికి నాటకమాడుతున్నాడా? అతనే కావాలని అంత తెగింపుగ వెళ్ళిపోయిన మంజూ తిరిగి అతన్ని కాదని తండ్రి వెంట ఎలా వచ్చింది?

మంజీర ప్రవర్తన తాతగారికి నచ్చలేదు కనీసం అతన్ని అడిగి రావలసింది.

సమర్థుడూ, యోగ్యుడూ అయిన భర్తనలా నిర్లక్ష్యం చేసి, మంజీర తండ్రి వెంట పుట్టింటి కొచ్చెయ్యటం ఆయనకు సమర్థనీయంగా అనిపించటం లేదు..

చాటుగా వింటున్న శార్వాణి కూడా తెల్లబోయింది మంజీర వచ్చేసిందనే సంతోషం ఆమెలో ఇంకి పోయింది

"మంజూ ను నాతో పంపండి' స్థిరంగా అన్నాడు ప్రణీత్

"ఆమె రాదు" అంత కన్నా స్థిరంగా అన్నాడు బాబూరావు.

ఈ లోపున తాతగారు, శార్వాణి మంజీర దగ్గర కెళ్ళి ఎందుకిలా చేశావని నిలదీస్తున్నారు...



## ఒడలో వెలి మోహనరాగం

"మీకు తెలీదు ఆయనుట్టి మోసగాడు " రోషంగా అన్నది మంజీర

అలా అని మీ నాన్న చెప్పాడా? హేళనగా అడిగారు తాతగారు

నాకళ్ళతో నేను చూశాను '

'ఏమిటి చూసింది? ఒక్కోసారి మన కళ్ళే మనని మోసం చేస్తాయి

'నువ్వు ఆ అబ్బాయితో వెళ్ళిపో అతను పిలుస్తున్నాడు అన్నది శార్వాణి

"నే వెళ్ళను '

బలవంతంగా పంపిస్తాం '

'పంపండి చూద్దాం నాన్నరమ్మంటే వచ్చాను నేను అన్నది మంజీర

"ఇది మొండిది కొన్ని విషయాల్లో దీనికి తండ్రి మూర్ఖత్వమే వచ్చింది ఎవరైతే దీని మనసునిలా విరిచేశారో తిరిగి వాళ్ళే దీన్ని మార్చగలగాలి అంతవరకూ ఇంతే నిస్పృహగా అన్నది శార్వాణి తాతగారితో

అలా జరగటం అసాధ్యం ఈపని చేసింది సాక్షాత్తూ దాని తండ్రే. ఇప్పుడు వాడు విజేత వాడు వీళ్ళ నెందుకు కలుపుతాడు?' అన్నారు తాతగారు

అప్పుడు తన భర్త ప్రణీత్‌ని అవమానించినా మంజూ అతని పక్క నుంది గనక కొంత నయం

కానీ ఇప్పుడా పిల్లని లో పలుంచుకుని అతన్నవమానించటం

దీనికంతకూ కారకురాలైన మంజీర ఏమీ ఎరగని దానిలా ఇంట్లో కూర్చోటం

ఇదంతా చికాగ్గా ఉంది శార్వాణికి

ఇంత నిలకడ లేని మనిషి 'ప్రేమ పేమంటూ" అతన్ని రెచ్చగొట్టి, వెంట వెళ్ళి పెళ్ళి చేసుకుని, అతన్ని కూడా ఈ రొచ్చులోకి ఈడవటమెందుకు?

ఆ ఉధృతం తగ్గాక తను కూడా పుట్టింటి వాళ్ళతో కలిసి అతన్నవమానించటానికా?

తాతగారు కూడా మంజీర అవివేకాన్ని క్షమించలేక పోతున్నారు

కానీ తన పెద్దరికం ఇప్పుడీ ఇంట సాగదు ఆ పిల్లకు బాబూరావు మద్దతుఉంది దాని మొండి తనాన్ని వాడు జాగ్రత్తగా కాపాడుకుంటాడు

మీరు ఏదేదో చెప్పి దాని మనసు విరవటానికి ప్రయత్నించకండి . ఒక ఆర్డర్ పాస్ చేసి పారేస్తాడింక దాన్ని తాము చచ్చినట్లు అమలు జరపాలి .

"ఆ మాట మంజూనే వచ్చి చెప్ప మనండి. మీరు పెద్దవారు ఇలా భార్యాభర్తల్ని బలవంతాన విడదియ్యటం మీకు తగదు ' అన్నాడు ప్రణీత్

'నువ్వు దాన్ని నా అనుమతి లేకుండా ఈ ఇంట్లోనుంచి దొంగతనంగా తీసికెళ్ళి పెళ్ళి చేసుకున్న రోజే నా పెద్దరికం మంట గలిసింది

అది నీదగ్గరకు రాను అంటుంటే ఇలా ప్రాధేయపడటం నీకు సిగ్గనిపించటం లేదా?




ఇక్కడ జరిగే బాగోతం దానికి వినపడ్డం లేదను కున్నావా? అయినా అది బయటకు రావటల్లేదంటే ఇంకా నీకు అర్థం కావటల్లేదా?

తను చేసిన అపాత్ర దానం గురించి ఇప్పుడది పశ్చాత్తాపపడుతోంది అదిహ జన్మలో నీ మొహం చూడదు.' అన్నాడు బాబూరావు

ప్రణీత్ ఆయన్ను కేర్ చెయ్యకుండా 'మంజూ', అని పిలిచాడు

ఆమె బయటకు రాలేదు

"మంజూ, ఇలా రామ్మా!" అన్నాడు బాబూరావు

బయటి కొచ్చి, ప్రణీత్ వేపు మొహం తిప్పకుండా "ఏం నాన్నా?' అన్నది మంజీర

'ఇతను నువ్వు చెపితే గానీ వెళ్ళడట . వెటకారంగా అన్నాడు బాబూరావు

మీరు చెప్పారుగా?"

"మంజూ! ఏమిటిది! ఏమయింది నీకు? నాతో ఒక్క మాటయినా చెప్పకుండా ఇలా వచ్చేశావేమిటి? రా! మనింటికెళ్ళిపోదాం నువ్వులేకపోతే నాకా ఇంట్లో అడుగు పెట్ట బుద్ధి కావటం లేదు రామంజూ! ఏం జరిగిందో నాకు చెప్పు ఆమె చెయ్యి పట్టుకుంటూ ఉద్వేగంగా అన్నాడు ప్రణీత్

మాట్లాడకుండా చెయ్యి విడిపించుకుందామె.

ఆమె ప్రవర్తన పజిల్‌గా ఉందతనికి. ఇందులో బాబూరావు హస్తముందని తెలుస్తూనే ఉంది కానీ . ఎలా గెలవగలిగాడాయన?

ఆమె కళ్ళలో తన పట్ల కనపడుతున్న నిర్లక్ష్యం అతనికి ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది

'మంజూ! ఏదయినా ఉంటే మనిద్దరం చర్చించుకుందాం అయినా మన మధ్య ఏం పొరపొచ్చాలున్నాయని? ఒక వేళ . ఎక్కడైనా నా ప్రవర్తన నీకు నచ్చలేదా?

ఎక్కడ ఎప్పుడు . ఏ సందర్భంలో?

చెపితే నేను సరిదిద్దుకుంటానుగా? ఉదయం మామూలుగానే ఉన్నావు ఉదయం నుంచి ఇప్పటి లోగా మన మధ్య ఏం అనివార్య సంఘటనలు జరిగాయి?' అన్నాడు ప్రణీత్ అతనికి చాలా నీరసంగా ఉంది తూలిపడబోయి ఆపుకుంటున్నాడు మంజీర మూర్ఖత్వం భరింప రానిదిగా ఉన్నా.. బలవంతాన . శాంతంగా ప్రవర్తించటానికి ప్రయత్నిస్తున్నాడు

'తెలియని వాళ్ళకయితే చెప్పొచ్చు తెలియనట్లు నటించే వాళ్ళకేం చెపుతాం?' విసురుగా అంది మంజీర

'ఏమిటా సంగతి? నీకు తెలిసింది. నేను తెలియనట్లు నటించేది ఏమిటది?"

"మంజూ! నువ్వు లోపలికెళ్ళమ్మా' తండ్రి హెచ్చరిక వినగానే గబగబా లోపలికెళ్ళి పోయిందామె

ప్రణీత్‌ని చూస్తుంటే కోపం పొర్లుకొస్తోందామెకు తండ్రి వారించకపోతే అతన్నక్కడే నిలబెట్టి దులిపి పారేసేది

ఆ అందమైన ముఖం వెనుక ఎంత నయవంచన?!

ఊరుమ్మడి ఆస్తిలాంటి సూర్యకళతో సంబంధం పెట్టుకుని తన స్త్రీత్వాన్ని అవమానిస్తాడా!

'అవసరానికో ఆడది' అనుకునే దశలో అతనున్నప్పుడు.. తనింక అక్కడెందుకూ ఉండటం? తనే కావాలనేం లేదుగా?

అతను అందగాడు! కో.. అంటే కోటి మంది వస్తారు పెద్ద ప్రేమకారి పోతున్నట్లు పరుగెత్తుకొచ్చాడు .

ఔనుమరి! పెళ్ళాం చెప్పకుండా పుట్టింటి కెళ్ళి ఇహరానంటే అవమానంగదా! అందుకని వచ్చాడు

ఛీ! ఈ మగాళ్ళనసలు నమ్మకూడదు '

ఎన్ని కబుర్లు చెప్పాడు! ఎంత ప్రేమను గుమ్మరించాడు!

మంచం మీద బోర్లా పడుకుని రోషంగా ఏడుస్తోంది మంజీర

అయిందిగా? ఇహ వెళ్ళు" అన్నాడు బాబూరావు

బాధా తప్త హృదయంతో వెనుతిరిగాడు ప్రణీత్

ఇదంతా బాబూరావు ఆడుతున్న నాటకం

మంజూ అమాయకురాలు తెల్లని వన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళు

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## ఘనపదార్థాలను తొలిసారిగా రుచి చూపిస్తూ

సుమారు 4వ నెల నుంచి మీ పాపాయికి పాలతోపాటు ఘనపదార్థాలూ కావాలి. దీన్ని సెరిలాక్ కానుకతో ప్రారంభించేందుకు ఇదే సరైన సమయం.

**పోషకాహార లాభం :**
సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు-ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, క్రొవ్వుపదార్థం, విటమిన్లు, ఖనిజాలు అన్నీ ఉన్నాయి. మీ పాపాయికి ప్రత్యేక అవసరాలకు తగినట్టుగా సరైన పాళ్ళలో అన్నీ సమతూకంలో ఉన్నాయి.

**రుచి లాభం :**
సెరిలాక్ మంచి పోషక పదార్థాలను, మంచి రుచిని కలిపింది. పాపాయిలకు సెరిలాక్ రుచి భలే ఇష్టం.

**సమయం ఆదా లాభం :**
సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార ఉన్నాయి. దాన్ని వెచ్చటి నీటిలో కలిపితే చాలు. క్షణంలో ఆహారం తయారు.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు తయారుచేయడంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.

ఉచిత సెరిలాక్ పుస్తకం కోసం వ్రాయండి.
సెరిలాక్
పోస్ట్‌బాక్స్ నం: 3.
న్యూఢిల్లీ-110 008.




Nestlé

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంలో పరిపూర్ణం-ఎంతో రుచికరం

## ఒడిలో చెలి మోహన రాగం

అనుకునేంత పిచ్చిదామె

ఏం జరిగింది? ఏం చెప్పాడు బాబూరావామెకు? అమె తన నంతగా చీదరించుకునే పని తానేం చేశాడు?

ఆమె ఒంటరిగా దొరికితే తను నచ్చ చెప్పుకోగలడు' ఇది బాబూరావుకు తెలుసు అందుకే ఆయన తనకీ అవకాశం ధొరకనివ్వడు

మంజూను బాబూరావు తన కబంధ హస్తాల్లోకి లాగేసుకున్నాడు

ఇది చాలా సున్నిత మైన వ్యవహారం జాగ్రత్తగా ఆమెనా వలయంలోంచి తప్పించాలి

ఇన్నాళ్ళూ ఆమె తన పక్క నుండబట్టి బాబూరావుతో పోరాటం తనకేం కష్టమనిపించలేదు

ఇప్పుడాయనను ఒంటరిగా ఢీ కొనాలి

ఇందుకు తను భయపడడు కానీ తన సర్వశక్తులూ మంజీరతో నే వెళ్ళి పోయినట్లనిపిస్తోంది అమె లేకుండా తనెలా ఉండగలడు? అమె తన ఊపిరి ఉత్సాహం సాహసం శాంతి

అన్నీ ఆమే తనకు ఆమెనెలా తెచ్చుకోవాలి?

సర్వం కోల్పోయిన వాడిలా తిరిగొస్తున్న ప్రణీత్‌ని చూసి ఏం జరిగిందో ఊహించ గలిగింది హైమ ఆ స్థితిలో రోడ్డు మీద నడుస్తున్న అతన్ని పలకరించటం మంచిది కాదని మౌనంగా ఉండి పోయిందామె

* * * * * * * * * * * *

చేసేదంతా చేసి అతన్ని స్వయంగా అవమానించి వెళ్ళగొట్టి, ఇప్పుడిలా ఏడవటమెందుకూ? నిష్ఠూరంగా అన్నది శార్వాణి

"నువ్విలా సాధించావంటే నే నింట్లోనుంచి వెళ్ళి పోయి ఎందులో నన్నా దూకి చస్తాను ఉక్రోషంగా అన్నది మంజీర

ఇహ నోరెత్తలేదు శార్వాణి.

* * * * * * * * * * * *

ఆత్రంగా కొడుక్కి ఎదురొచ్చింది కామేశ్వరి

నిద్రలో నడుస్తున్న వాడిలా ఉన్నాడు ప్రణీత్ చాలా అలిసి పోయినట్లున్నాడు....

ప్రణీత్ స్నానం చేసి వచ్చాక అతన్నేం ప్రశ్నించకుండా....

బ్రతిమాలి, బలవంతంగా అన్నం తినిపించింది కామేశ్వరి.

ఏం జరిగి వుంటుందో ఆమె ఊహించ గలిగింది.

ప్రణీత్ మనసు మొద్దు బారినట్లుంది. బెడ్ మీద పడుకుని కళ్ళు మూసుకున్నాడు....

ఇలా జరుగుతుందని కలలో కూడా ఊహించ లేదతను.

తమ నిద్దరినీ విడదియ్యటం ఎవ్వరికీ సాధ్యం కాదనే అచంచల విశ్వాసం అతని కుండేదిన్నాళ్ళూ

పక్కన ఆమె లేకుండా ఒంటరిగా పడుకుంటే దిగులుగా అనిపిస్తోం దతనికి

అర్ధరాత్రి దాకా అతని కళ్ళు తెరుచుకునే ఉన్నాయి

* * * * * * * * * *

అలవాటుకు విరుద్ధంగా బాగా ఎండపడి లేచాడు ప్రణీత్ కావాలనే అతన్ని లేపలేదు కామేశ్వరి

తాతగారి ద్వారా తను విన్న విషయాలన్నీ అప్పటికే ఆమె చెవిన వేసింది హైమ

మంజీర అలక దేనికో మాత్రం ఎవరికీ తెలియటంలేదు బాబూరావు ఏదో చేశాడని తెలుసుగానీ ఏం చేశాడో ఎవరికీ తెలీదు ఆయన చెప్పడు మంజీర అసలే చెప్పదు

కళ్ళు తెరిచిన ప్రణీత్ అలవాటుగా మంజూ! అనబోయి మనసు కేదో తట్టినట్లుగా ఆగి పోయాడు

మంజీర తననొదిలి వెళ్ళి పోయిందనే నిజం అతన్ని పరిహసిస్తున్నట్లుగా అతని ప్రేమను సవాలు చేస్తున్నట్లుగా ఉంది

వంటింట్లో నుంచి హైమ కంఠం వినిపిస్తోంది

హైమ ద్వారా మంజూ మనసులో ఉన్న దేమిటో రాబట్టాలి

అది తెలిస్తే ఈ సమస్యను తను పరిష్కరించు కోగలడు

"హైమా!

ప్రణీత్ పిలుపు విని అతని దగ్గర కొచ్చింది హైమ

ఆమెను చూడగానే అతని మనసు ఆర్ద్రమయింది

'చూడు' మంజూ ఏం చేసిందో' అన్నాడు ప్రణీత్ అతని కళ్ళలో బాధ రెపరెపలాడుతోంది

ఇలాంటివి జరుగుతూనే ఉంటాయి నువ్వు మనసు పాడు చేసుకో కన్నయ్యా' ఇదంతా మావయ్య పన్నాగమని అందరికీ తెలుసు అసలేం జరిగిందో నేను నెమ్మదిగా మంజూనే అడిగి తెలుసుకుంటాను. అన్నీ అవే చక్కబడతాయి". స్నేహంగా అన్నది హైమ....

అతను మంచం దిగి చెప్పులేసుకుంటూ ఉండగా ఫోన్ మోగింది.

ఫోన్‌లో వచ్చిన మెసేజ్ విని త్రుళ్ళి పడ్డాడు ప్రణీత్. అతని చేతులు రిసీవర్

## గడుసులోకం — బాబు



# రచయిత్రి జవాబులు



**పి. గీతాకుమారి, తాడేపల్లిగూడెం**

ప్ర నాకు ఎప్పటి నుంచో కథలు రాయాలనే బలమైన కోరిక ఉంది కానీ అచ్చుకావటం లేదు కథలు ఎలారాయాలో చెప్పరూ?!

జ మంచి మంచి నవలలు చదవండి మీరురాసిన వాటికీ చదివిన నవలలకూ శైలి కూర్పు మొదలైన వాటిల్లో గల తేడాలను గమనించండి పట్టుదలతో అలారాస్తూనే ఉండండి తప్పకుండా మీ రచనలు అచ్చు అవుతాయి

**కె. ప్రమీల, మార్కాపురం**

ప్ర రాజకీయాల కోసం కన్న కూతుర్నే కాదనుకునే బాబూరావు లాంటి తండ్రు లెక్కడయినా ఉంటారా?!

జ బాబూరావు ఉన్నాడు గదా! అలాంటి వాళ్ళకు కన్న మమకారాలకన్నా రాజకీయ మమకారాలే ఎక్కువ

**సంకేపల్లి పవన్‌కుమార్, వేములవాడ**

ప్ర మీరు రాసే నవలల్లో ఒక పాత్రకు 'పవన్' అనే పేరు పెట్టరూ? నా కోరిక ఈ జన్మలో తీరుతుందా?

జ ఈ మాత్రానికే మళ్ళీ ఇంకో జన్మెత్తాలా పవన్ కుమారా!

**రెడ్డి శివనాగేశ్వర్రావు, మాచర్ల**

ప్ర కోట్లు సంపాదించిన వ్యక్తి నయినా మరిచి పోతారు గానీ మీలాంటి రైటర్స్‌ని సాహిత్య ప్రియులు ఎప్పటికీ మర్చిపోరు మీ జీవితానికింత కన్నా పరమార్థం ఏం కావాలి?

జ అరె! నిజమేనే!

**యల్లాపు భాస్కరరావు, అనకాపల్లి**

ప్ర ఈ సీరియల్‌కు 'ఒడిలో చెలిమోహనరాగం అని పేరు పెట్టటం సబబేనా?

జ పూర్తిగా చదివాక, మీరే చెపుదురుగాని

**కొంతం వెంకట సత్యన్నారాయణ, గొల్లప్రోలు**

ప్ర ఒడిలో చెలిమోహన రాగం"ను చెలిఒడిలో మోహనరాగం' అని అనొచ్చా?

జ "మోహన ఒడిలో చెలిరాగం' అని కూడా అనొచ్చు

## ఉత్తమప్రశ్న

**జె. వి. రమణమూర్తి, కంభం**

ప్ర : కొందరు రాజకీయ నాయకులు స్టేజీ ఎక్కితే.... ఒకపార్టీ వారు వేరొక పార్టీ వారిని దూషిస్తూ ఉంటారు ఇలా ఏ పార్టీలూ లేక పోయినా.... కొందరు రచయిత (త్రు)లు రచయితల మహా సభల్లో ఒకరి నొకరు దూషించుకుంటా రెందుకు? రచయితలమహాసభ లెందుకు. జరుపుతారు?

**జ : మీరు చెప్పినట్లు దూషించు కోటానికి మాత్రం జరపరు. పాఠకులకూ రచయిత (త్రు)లకు .... రచయిత (త్రు)లకూ రచయిత (త్రు)లకూ మధ్య సదవగాహన ఏర్పడటం కోసం జరుపుతారు. కాకపోతే "దుర్వినియోగం" అనేది మనకు అన్నిటా ఉన్న అలవాటు!**

**ఎమ్. శివాజి, మోదుకూరు**

ప్ర మీకు మంచి పేరు తెచ్చిన నవల పేరేమిటి?

జ నా నవలలన్నీ నాకు మంచి పేరు తెచ్చినవే

**కె. ఇందుమతి, బెంగుళూరు**

ప్ర సావిత్రిగారూ, మీ ఒడిలో చెలిమోహన రాగం' సుపర్బ్‌గా ఉంది ఎప్పటి కప్పుడు తరవాత సంచిక కోసం తహతహలాడి పోతున్నాము ఈ నవలలో మీకు బాగా నచ్చిన పాత్రలేవి?

జ ప్రణీత్, హైమ

**పి. సంధ్యారాణి, మైసూరు**

ప్ర సావిత్రిగారూ! 'ఒడిలో చెలిమోహనరాగం'లో మాకు 'హైమ' పాత్ర చా . లా నచ్చింది మరి మీకు?

జ నాకు కూడా !

**పి. జయంతి, నర్సాపురం**

ప్ర అక్కయ్యా! మిమ్మల్ని నేనిలా పిలవొచ్చా?

జ పిలిచేశారుగా?

ప్ర . నా ప్రశ్నలకి మీరెందుకు జవాబివ్వటం లేదు? నా కెంత బాధగా ఉందో తెలుసా?

జ నాకూ బాధగానే ఉంది మీ ప్రశ్నలు మరీ ఇంత అధ్వాన్నంగా ఉన్నందుకు

**కె. రాజేందర్, హైదరాబాదు**

ప్ర ఒడిలో చెలిమోహనరాగం' చాలా చాలా బావుంది నా జన్మలో రాస్తున్న ఈ ఉత్తరానికి జవాబిస్తారుగా? ఇలాంటి రచనల ద్వారా నవయువకులకు కొత్త భావాలు, కొత్త ఆదర్శాలు అందించాలని ఆశిస్తున్నాను నేను ముందు ముందు ఇలాంటి ఉత్తరాలు రాయటానికి ప్రోత్సహిస్తూ జవాబిస్తారు గదూ?

జ ముందు ముందు కూడా ఇలాంటి ఉత్తరాలే రాస్తారా?!

**శివలక్ష్మి జ్యోతి, గుంటూరు**

ప్ర నా ఆశయం నెరవేరుతుందా అక్కా? నేను పొదుపు పాటించానుగదూ?

జ . ఔనౌను మూడు పేర్లు పెట్టుకుని మూడు ఉత్తరాలు ఒకేకవరులో పెట్టటం ద్వారా!

కృషితో నాస్తి దుర్భిక్షం' అనే సూక్తి గుర్తుంచుకుంటే మీ ఆశయం తప్పక నెరవేరుతుంది □

---

మీద బిగుసుకున్నాయి.

"మై గాడ్!" అనుకున్నాడతను

ఎంతో షార్ప్‌గా ఆలోచించే తనకీ ఊహ ఎందుకు తట్టలేదు?!

నిన్న తన మీద ప్రయోగింప బడ్డ మత్తు ప్రభావం. . మంజూ చేసిన పని తన మనసును మొద్దుబారేలా చేశాయి

"ఏమైంది? ఆదుర్దాగా అడిగింది హైమ

'సూర్యకళ నెవరో హత్య చేశారు" అంటూ గబగబా డ్రెస్ చేసుకుని బయల్దేరాడు ప్రణీత్. .

తన బలగంతో వెళ్ళి పంచనామా వగైరా ఫార్మాలిటీస్ అన్నీ పూర్తి చేశాడు ప్రణీత్ .

ప్రణీత్‌కి సూర్యకళతో అక్రమ సంబంధ ముస్నదని . ఇప్పుడు వాళ్ళిద్దరికీ చెడిందని ప్రణీత్ రహస్యాలన్నీ సూర్యకళకు తెలుసని అవి బయట పెడుతుందనే భయంతో అతనే ఆమెను హత్య చేశాడని

క్రితం రోజు అతను సూర్యకళనుద్దేశించి "తెల్లారే లోగా నీ అంతు చూస్తానని బెదిరించటం చాలా మంది విన్నారనీ ఒక వార్త పైడిపల్లిలో ప్రచారమైంది అది తాటాకు మంటలా ఊరంతా గుప్పున అంటుకుంది.. ..

"ఒక వ్యక్తి ఏదయినా మంచి చేస్తే దాని కాళ్ళే ప్రచారం లభించదు. క్యాజువల్‌గా విని ఊరుకుంటారు జనం.

ఆ మంచికి రంగు పులిమి చెడుగా ప్రచారం చెయ్యటానికి ఒక గ్రూప్ ఎప్పుడూ సిద్ధంగానే ఉంటుంది

ఒక్క చెడ్డపనిని అదే వ్యక్తి చేశాడు అనే వార్త వినిపిస్తే మాత్రం చెవులు దోరపెట్టుకుని వింటారు ప్రజలు

అన్నం నీళ్ళూ మానేసి. ఆ వివరాలు సేకరించి. వాటికి మరి కొన్ని స్వంతంగా జోడించి వ్యాపింప చేస్తారు.

గాలి కన్నా వేగంగా ఆ వార్త ప్రచారమవుతుంది

తనకు ప్రణీత్ మీదే అనుమానమున్నట్లు సూర్యకళ భర్త చేత రిపోర్టిప్పించారు బాబూరావు వర్గంవాళ్ళు

ప్రణీత్ సస్పెండయ్యాడు

(ఇంకావుంది)

## వ్యక్తిగతం



భారతీయ నృత్య కళా రంగంలో అసాధారణ ప్రతిభని ప్రదర్శించిన విదుషీమణి శ్రీమతి మృణాళినీ సారాభాయి నృత్యం యొక్క సంప్రదాయిక రూపాన్నీ అంత స్సత్త్వాన్నీ పోగొట్టకుండానే దానిని సమకాలీన భూమికలకు వాహికగా మార్చాలన్నది ఆమె అభిప్రాయం భారత జాతిలో సాంస్కృతిక పునరుద్ధరణ వాతావరణంలో కళలని అభ్యసించిన ఈమె నృత్యం యొక్క మౌలిక భాషని నిర్వచించటానికి పూనుకుంటున్నారు శ్రీమతి మృణాళినికి నృత్యం జీవన శ్వాస ఒక ఆలోచనా విధానం. ప్రాపంచిక దృక్పథం విశ్వకవి రవీంద్రుని శిష్యరికంలో ఆమె కళా హృదయం, కళల పట్ల ఆమె [illegible] వికసించాయి బాల్యం నుంచీ నృత్యాన్ని అభ్యసిస్తున్న శ్రీమతి మృణాళిని భరత నాట్యం, కథాకళి, మోహినీ ఆట్టం వంటి నృత్య కళా రూపాలలో, వివిధ జాన పద నృత్య రీతులలో మెళకువలని గ్రహించి విద్వాంసురాలైనారు ఈమె కొంత కాలం పాటు అమెరికన్ అకాడెమీ ఆఫ్ డ్రమెటిక్ ఆర్ట్స్ సంస్థలో నటన, అభినయాలని కూడా అభ్యసించారు కళారంగంలో తాము ఇటువంటి అద్భుత విజయాలు సాధించటానికి కారణం తమ భర్త డా విక్రమ్ సారాబాయ్ ప్రోత్సాహమని ఆమె అన్నారు విశ్వ భారతి విశ్వవిద్యాలయం ఏటేటా అంద జేసే అత్యున్నత పురస్కారం దేశికోత్తమ' ఈ ఏడు ఈమెకి లభించింది దర్పణ అకాడెమీ అనే నృత్య శిక్షణా సంస్థని కూడా ఈమె నిర్వహిస్తున్నారు □



చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి హుయావో బాంగ్, తన రాజకీయ 'తప్పిదాలను' అంగీకరిస్తూ పదవికి రాజీనామా చేశారు గత నెలలో పెద్దఎత్తున విద్యార్థులు ఇతోధిక ప్రజాస్వామ్యాన్ని, భావ ప్రకటనా స్వేచ్ఛను కోరుతూ ప్రదర్శనలు జరిపినప్పుడు, హుయావో బాంగ్ వాటిని అదుపు చేయలేక పోయారని గత కొద్ది రోజులుగా విమర్శలు వస్తున్నాయి ఈ విమర్శల తర్వాత జరిగిన పొలిట్ బ్యూరో సమావేశంలో హుయావో బాంగ్ తన పదవీ కాలంలో సమిష్టి నాయకత్వం అనే పార్టీ సూత్రానికి వ్యతిరేకంగా ప్రధాన రాజకీయ అంశాలపై పొరపాట్లు చేశానని ఆత్మవిమర్శ చేసుకున్నారు 1979 నుంచి డెంగ్‌జియావో పింగ్ తలపెట్టిన సంస్కరణలను రూపొందించడంలోను, అమలు చేయడంలోను, హుయావో బాంగ్ అగ్రభాగాన నిలిచారు ప్రస్తుతం 72 సంవత్సరాల వయసు గల హు ప్రధాన కార్యదర్శి పదవికి రాజీనామా చేసినప్పటికీ పొలిట్ బ్యూరో సభ్యుడు గానూ, కేంద్ర కమిటీ సభ్యుడు గానూ కొనసాగుతారు □

# వారఫలం

**27-2-1987 శుక్రవారం మొదలు 5-3-1987 గురువారం వరకు**

★ **మేషం :** విచక్షణతో చేసిన ప్రతి వ్యవహారం మీకు అనుకూలదాయకమే ముందు వెనుకలు ఆలోచించి చేసిన పనులు సక్రమంగా జరుగుతాయి రాజకీయాలకు దూరంగా ఉండటం ఎంతైనా న్యాయం స్త్రీలకు కొందరకు 'ప్రమోషన్' ఉద్యోగరీత్యా చెప్పవచ్చు

★ **వృషభం :** గురుని స్థితి, మీకు లాభదాయకం అధికారమందు పెంపు చెప్పవచ్చు వ్యవహారరీత్యా అనుకూలం కొందరు కొనుగోలు నిమిత్తం, వ్యాపారం వృద్ధినందించు నిమిత్తం ప్రయాణించనున్నారు. అన్ని విధాలా అనుకూల దాయకం, లాభదాయకమైన వారమే. స్త్రీలకు ఉద్యోగరీత్యా సంతోషం, ఆర్థికంగా మెరుగు చెప్పదగిన అంశాలు.

★ **మిధునం :** దరిదాపుల్లో మేలు జరుగునని చెప్పవీలులేదు మరీ ఈ వారం అయోమయం అందగలదన్న డబ్బు చేతికిరాదు వెనుక ఏనాడో తీసికొన్న డబ్బుకై వత్తిడి ఏర్పడుతుంది. స్త్రీలకు : నూతన మిత్ర సమాగమం, కొందరకు నూతనోద్యోగ ప్రాప్తి. అన్ని విధాలా తృప్తి.

★ **కర్కాటకం :** అధికార మందున్న వారి సహాయ సహకారము లుంటాయి ఉద్యోగమందు స్త్రీ పురుషులకు సుగుణం కనిపిస్తుంది. కొందరకు విద్యా విషయంగా చెప్పదగిన అంశం చాలమందికి ఒకటే హెచ్చరిక ఆరోగ్య రీత్యా జాగ్రత్త పడటం అవసరం స్త్రీలకు వ్యర్థ ప్రయాణాలు, అధిక ఖర్చులు

★ **సింహం :** ఆరోగ్యరీత్యా చాల మందికి అనానుకూలత చెప్పవచ్చు 'అర్ధాష్టమ' శనిబాధ యింకా నివారణ కాలేదు అందుకుతోడు ధనార్జనా నిమిత్తం చిక్కిన అవకాశాలు జారిపోయే పరిస్థితి యున్నది సాటివారి పోటీని ఎదుర్కొన వలసిన అగత్యమున్నది అధికార పతనం కొందరకు చెప్పదగిన అంశం. స్త్రీలకు: ఉద్యోగరీత్యా యిబ్బందులు

★ **కన్య** చాల కాలంగా వృత్తిలో అనుకొన్న పెంపు కనిపించటంలేదని ఆరాట పడుతారు. అనవసరమే. ఈ వారాన్నుండి చూచుకోండి, ఉద్యోగం చేసే వారికి చెప్పదగిన మేలున్నది రాజకీయ రంగాన వీర విహారం చేయాలనుకోవటం వెర్రితనం. వారం అనుకూలంగాదు స్త్రీలకు : రచన, నాట్య, సంగీత, చేతివృత్తులయందు చొరవగలవారికి మేలే

★ **తుల :** అనుకూల వార్తా శ్రవణం అప్రయత్న ధనలాభం, వ్యాపార రంగాన ప్రసిద్ధి ఏర్పడటం, అథవా ధనాదాయం, మిత్రవర్గం వలన మేలు చేకూరుట చెప్పదగిన ముఖ్యాంశం అనవసరంగా రాజకీయంలో చిక్కుకోకండి. స్త్రీలకు : శుభ కార్యాలోచనలు, ఉద్యోగపెంపు

★ **వృశ్చికం :** ఇప్పుడిప్పుడే గ్రహబలం మీకు అనుకూల మవుతున్నది 'గురు' భగవానుని అనుగ్రహం చేకూరుతుంది అభిమానులు, ఆర్థికంగా చక్కని స్థితిగలవారి వలన ఏదో మేలు జరుగ నున్నది. గ్రహించండి స్త్రీలకు: వృత్తి యందు వికాసం, రాజకీయాలందు చొరవ కొందరకు, సభాగౌరవం కొందరకు

★ **ధనుస్సు :** వ్యాపార రీత్యా బాగా పుంజుకొంటారు చాల మందికి ధన విషయంగా ఎలాంటి యిబ్బందులుండవు కృషి రాణించటంతో ధనాదాయ ముంటుంది మధ్యవర్తుల వలన ఒకానొక విషయంలో మేలు కనిపిస్తుంది స్త్రీలకు వ్రతాచరణం, నగలు నాణ్యాలు తయారించుకోటం చెప్పదగిన ముఖ్యాంశాలు.

★ **మకరం :** సుఖ శాంతులు, కుటుంబానందం, విద్యా విషయంగా పెంపు, రాజకీయంగా ఎత్తులు సాగడం, రచనా విధానాన కొంత ఆదాయం చేకూరుతుంది ప్రత్యర్థులతో తగాదాలు రావచ్చు. కొందరకు 'రోడ్డు' ప్రమాదం ఏర్పడవచ్చు. గమనించాలి. స్త్రీలకు · ఉద్యోగం–చేసే వారైతే అనుకూలం.

★ **కుంభం :** ధనవసతి గల కాలం గ్రహ సంబంధమైన అనుకూలత, 'వారఫలం' అనుకూల మని గ్రహించాలి ఉద్యోగ రీత్యా అనుకూలం. ఆటపాటల్లో ప్రవేశమున్న వారికి అనుకూల సమయం. మీరు వ్యాపారం చేస్తారా? అలాగైతే అనుకూలమే స్త్రీలకు · లావాదేవీలలో అనుకూలం, ధనాదాయం.

★ **మీనం :** నాలుగు మార్గాలా మీకు అన్ని రంగాలలో సుగుణం కనిపిస్తుంది. రాజకీయంగా మేలున్నది మీ ప్రయత్నాలు సానుకూలమవుతాయి, ముందడుగు వేయండి విద్యా విషయంగా పెంపున్నది కథకులకు, రచయితలకు, గాయక వర్గానికి, పత్రికా నిర్వాహకులకు సర్వానుకూలమైన వారం, స్త్రీలకు. రచయితలయిన, నాట్య ప్రసిద్ధి కలిగినా మేలే

–విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## కారణం తల్లిదండ్రులే

పేపర్‌లో ఆ ప్రకటనలోని ఫోటో చూసి ఆశ్చర్య పోయింది ఒక ముఠాచేతిలో కాల్‌గర్ల్‌గా పనిచేస్తున్న పదిహేడేళ్ళ రూప ఆ ఫోటోలోని మనిషి తన అన్నయ్య ఫోటో క్రింద "ఇరవై సంవత్సరముల ఈ దారుణ హంతకుడిని పట్టి ఇచ్చిన వారికి రూ 25,000 బహుమతి యివ్వబడును

ఆ ప్రకటన రూప ఆలోచనలని గతంలోకి నెట్టింది

* * * *

"అమ్మా ఆకలేస్తోంది అన్నంపెట్టు" పదకొండవసారి అడిగారు రూప, సురేష్‌లు చుట్టుప్రక్కలున్న అమ్మలక్కలతో చేరి అక్కడ చేరనివారిమీద చెడుకబుర్లు చెప్పుకుని ఆనందించడంలో మునిగి పోయిన వాళ్ళతల్లి సుజాతని

ఆ కబుర్లంటే యిష్టం ఒకవైపు, తను అక్కడినుంచి వెళ్ళిపోయాక తనమీద చెడుగా చెప్పుకుంటారేమోనన్న భయం ఒకవైపు కలిసి సుజాతని అక్కడి నుండి కదలనివ్వలేదు పిల్లలిద్దరూ ఏడుపు మొదలెట్టారు సుజాత పట్టరాని కోపంతో యిద్దరినీ నాలుగు బాది ఒకగదిలో పెట్టి తలుపులు బంధించింది. రాత్రి బాగా చీకటి పడిన తర్వాత త్రాగిన నిషాలో తూలుతూ వచ్చి మంచం మీద పడ్డాడు ఆ పిల్లల తండ్రి పిల్లలేరి? కనపడటంలేదని అడిగిన పాపాన పోలేదు ఆ తండ్రి

* * * *

రోజూ అలాంటి సంఘటనలెన్నో!! అవి మా యిద్దరిలో చిన్నప్పటినుంచి తల్లిదండ్రులంటే భయం, అసహ్యం పెంచి మేము యింటినుంచి పారిపోయేలా చేసాయి. ఆ రోజు నాకింకా బాగా గుర్తుంది. రూప గుర్తు చేసుకుంటోంది.

* * * *



భర్త ఆఫీస్ కెళ్ళిన తర్వాత ప్రక్కింటి వాళ్ళతో కలిసి మూన్‌షోకి బయల్దేరింది సుజాత. రూప, సురేష్‌లు కూడా వస్తామని గొడవ చేసారు. ఎప్పటిలానే వాళ్ళని నాలుగుబాది, వాళ్ళని యింటికి కాపలా పెట్టి సినిమాకి వెళ్ళింది. పెద్దవాడయిన సురేష్ ధైర్యం చెయ్యడం వలన యిద్దరు కలిసి యింట్లోంచి పారిపోయారు

* * * *

తల్లిదండ్రుల నీడలో ప్రేమాభిమానాలతో పెరగవలసిన ఆ చిన్న వయసులో ఆ పిల్లలు ఈ మాయా ప్రపంచంలోకి అడుగు పెట్టారు మోసగాళ్ళ వలలో పడ్డారు అర్థమైన చాకిరీ చేసారు వస్తువులలా అమ్ముడు పోయి అన్న, చెల్లెలు విడిపోయారు

ఇన్నాళ్ల తర్వాత ఆ ప్రకటన రూపకి తన అన్న సురేష్ సమాచారంని తెలిపింది

* * * *

రూప ఒక కాల్‌గర్ల్‌గాను, సురేష్ ఒక దారుణ హంతకుడిగాను మారటానికి కారణం ఎవరు? వాళ్ళని నిందించి లాభంలేదు. అందుకు కారణం నిస్సందేహంగా వాళ్ళ తల్లిదండ్రులే.

—ఎం. నాని, అల్కాట్ గార్డెన్స్, రాజమండ్రి

* * *

## గట్టి కృషి అవసరం

అసలు పిల్లల ప్రవర్తన, సంస్కారం అనేవి వారు పెరిగిన వాతావరణము, పరిసరాల ప్రభావము మీద ఆధారపడి ఉంటుంది. పిల్లలు చెడిపోవటానికి కారణాలు రెండు విధాలుగా మనకు గోచరిస్తున్నాయి. ఒకరకంగా హై సొసైటీలో తిరిగే తల్లిదండ్రుల వలన- అది ఎలాగంటే, వారి వారి వృత్తి, ప్రవృత్తులలో వారు ఉంటూ పిల్లల పెంపకం అంతా నౌకర్ల మీద వదలి వేయటం. నౌకర్లు పిల్లల సంరక్షణ అంటే వారి స్నానపానాదులు, స్కూలుకు పంపటం లాంటివి చేస్తారు గాని వారి చదువులు, ప్రవర్తన విషయం వారికి తెలియవుగదా' తల్లిదండ్రులు పట్టించుకోక పోవటం, కావల్సిన డబ్బు ఇవ్వటం వలన పిల్లలకు స్వేచ్ఛా ప్రవృత్తి ఎక్కువయి, పిల్లలు చెడిపోవటానికి ఎక్కువ అవకాశం ఉంది ఈరకం పిల్లలు త్రాగుడు, వ్యభిచారం లాంటి వాటికి దాసులవుతున్నారు ముఖ్యంగా టీనేజ్‌లోనే పిల్లలను జాగ్రత్తగా కనిపెట్టి ఉండాలి ఆ తర్వాత వారికి వ్యక్తిత్వం వస్తుంది విచక్షణా జ్ఞానం తెలుస్తుంది కాబట్టి వారి వయసు మలుపు తిరిగేటప్పుడే, సరయిన గైడెన్స్ ఇవ్వాలి తల్లిదండ్రులు

ఇక రెండో రకంలో దిగువ తరగతికి చెందిన పిల్లలు ఎక్కువగా చెడిపోవటానికి అవకాశాలున్నాయి ఎందుకంటే, వారు బీదరికంలో ఉండి, కనీస అవసరాలు తీరకపోవటంతో, వారి మనః ప్రవృత్తి రకరకాలుగా మారే ప్రమాదముంది వారికి చదువు మీద శ్రద్ధలేకపోవటం, తల్లిదండ్రులు విద్య యొక్క ప్రాముఖ్యతని తెలుసుకో లేక వారిని ప్రోత్సహించక పోవటం, ఆర్థిక ఇబ్బందుల దృష్ట్యా వారిని చిన్నతనంలోనే పనుల్లోకి పంపించటం చేస్తుంటారు. చేసే పనిలో ఏకాగ్రత కుదుర్చుకో లేక, చిత్త చాంచల్యం వలన కొందరు పిల్లలు ప్రమాదాలకు గురవుతూ ఉంటారు. మనః ప్రవృత్తి రీత్యా కొందరు చెడిపోయే అవకాశం ఉంటే, పెద్ద పెద్ద నేరాలు చేసేవారు, చిన్న పిల్లలకు డబ్బు ఆశ చూపి, చిన్న చిన్న దొంగతనాలు నేర్పి బాలనేరస్తులను తయారు చేస్తున్నారు వారికి తెలియకుండానే గూండాలు, స్మగ్లర్స్ చేతిలో చిక్కుకు పోతున్నారు, వారికి పరిస్థితి అర్థమయ్యేసరికి, బయటపడలేని ఉచ్చులో ఇరుక్కుపోతారు.

ఈ రెండురకాలుగా కాక, ఇంకొన్ని విధాలుగా కూడా చిన్నారి బాలలు ఆహుతి అవుతున్నారు. కొందరు పిల్లలు రాజకీయ ప్రయోజనాల కోసం సమ్మెలు, ఘెరావులు విద్యార్థుల చేత జరిపిస్తే, ఇంకొక వర్గం వారు పిల్లలను ఎత్తుకు పోయి, కాళ్ళూ, చేతులు విరగ్గొట్టి, కళ్ళు పోగొట్టి భిక్షాటనకు ఉపయోగిస్తున్నారు మరొక రకమయిన ముఠా ఆడపిల్లలను మోసగించి లేక అపహరించి విదేశాలకు పంపి వ్యభిచార వృత్తిని పెంపొందిస్తున్నారు. కర్కుడి చావుకి



కారణాలులాగా అభాగ్య బాలల దీన గాథలకి సాధనాలు చాలా ఉన్నాయి.

ఇవి అరికట్టాలంటే ఏ ఒక్కరివల్ల అయ్యేపని కాదు సమాజం సమష్టిగా కృషి చేయాలి అన్ని తరగతుల తల్లి దండ్రులు పిల్లల విద్య, ప్రవర్తనల పట్ల శ్రద్ధ వహించాలి ప్రభుత్వం నేరస్థులను కఠినంగా శిక్షించాలి ముఖ్యంగా పిల్లలను అపహరించే ముఠాను పట్టటంలో గట్టి చర్య తీసికొనేటట్లు ఆదేశించాలి ఇటీవల మన ప్రభుత్వం, బాల నేరస్థులను విడుదల చేయాలని, వారికి వినియోగించిన ప్రత్యేక సంస్థలలో ఉంచి, ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దాలని చేసిన చట్టం హర్షించ తగ్గది. నిర్బంధ విద్యా విధానం కూడా పిల్లలను తీర్చి దిద్దుతుంది అలాగే వెట్టి చాకిరీ




చేయించే వారిని కఠినంగా శిక్షించాలి ఏదైనా మంచి మార్పు రావాలంటే, ఆదేశిక సూత్రాలు అమలు జరిగేటట్లు ప్రభుత్వం గట్టి కృషి చేయాలి అలా జరిగిన నాడు, చిన్నారి బాలల దీన గాథలు మనం కనము, వినము

—పాలపర్తి శ్యామలాదేవి,
గుంటూరు

* * *

# పరిష్కారం అసాధ్యం మాత్రం కాదు

"అమ్మా! పదిపైసలు ధర్మం చెయ్యండమ్మా!" అతి దీనంగా వినిపిస్తుంది రోడ్డు పక్కన ఓ పసివాడి గొంతు. 'రెండు రూపాయలు పది రూపాయలు" అంటూ సినిమా హాలు దగ్గర బ్లాక్ టిక్కెట్లు అమ్ముతున్న పదేళ్ళైనా నిండని మరో పసివాడి గొంతు మరో రెండడుగులు ముందు కెళితే బీడి కర్మాగారంలో ముద్దొచ్చే చిన్నారులెందరో బీడీల తయారీలో నిమగ్నమై కనిపిస్తారు బస్టాండులో జేబు కొట్టేశాడని ఓ పన్నెండేళ్ళ కుర్రాడిని చావగొట్టడం మొదలగునవి మనం రోజూ వినటం, చూడటం జరుగుతుంటుంది అలాంటప్పుడు మనలో చాలామంది వాళ్ళని చూసి అసహ్యించుకొంటారు ఇంకా వీళ్ళైతే కోపాన్ని ప్రదర్శిస్తారు కానీ వాళ్ళలా మారటానికి కారణం ఏమిటి? అని ఆలోచించే వారెంత మందుంటారు?

'అమ్మా! నేనియ్యాల్నించీ పన్లోకెళ్ళ!నేను కూడా సదువుకుంటానే' అన్నాడో చిన్నారి 'ఎదవ కబుర్లాడమాకు మనకి సదువులేంటహే! పన్లో కెళ్ళకపోతే కూడెట్టా వస్తదీ? అని కసురుకొన్నాడు ప్రక్కనే వున్న వాడి నాన్న అలా అన్నందుకు అతడిపై మనకి కోపం రానక్కర్లేదు కారణం దినదిన గండంగా వేదించే, అతను పరిష్కరించలేని ఆర్థిక సమస్య లెన్నో వున్నాయి అతని వెనుక ఈ తరహా కుటుంబాల్లోనించే జేబుదొంగలు, బ్లాక్‌లో టిక్కెట్లు అమ్మేవాళ్ళు, పొద్దస్తమానం పని చేసే బాల కార్మికులూ తయారవుతున్నారు

ఈ విద్ద్యూరం విన్నారా వదిన గారూ! మన వీది చివర పెంటమీద ఓ బాబెవరో ఏడుస్తూ కనిపించాడట పిల్లాడుబతికేవున్నాడుగానీ, ఏమో ఏ రాక్షసి చేసిందో ఈ పని అంటూ మెటికలు విరిచారు పక్కింటి కాంతమ్మగారు సామాజిక కట్టుబాట్లకీ, శారీరక వాంఛకీ మధ్య నలిగిన సంఘర్షణ ఫలితమే ఆ పసికందు వాడే




తరువాతి కాలంలో తన తల్లెవరో, తండ్రెవరో తెలీని బావి భారత అనాద అంతర్జాతీయంగా శిశువుల అక్రమ రవాణా జరుగుతుంది అన్నా ఆశ్చర్య పోనక్కరలేదు యూరప్ దేశాలలో దత్తతకు శిశువులు కొరతగా వున్నందువల్ల అభివృద్ధి చెందుతున్న దశలో వున్న దక్షిణాసియా దేశాల నుండి శిశువులని కొనుగోలు చేస్తున్నారు శ్రీలంక నుంచి సుమారు వెయ్యి మంది శిశువులు విదేశీయుల చేతుల్లోకి అక్రమంగా పోయినట్లు అధికారుల అంచనా

తను సాధించిన ఓ చిన్న విజయానికి గుర్తింపు లభించకపోగా తల్లి దండ్రుల నుంచి నిరుత్సాహపరిచే వ్యాఖ్యలు ఎదురవటం, చూడకూడని లైంగిక కార్య కలాపాలని అకస్మాత్తుగా చూడడం, అకారణ కోపంతో నాన్నగారు శత్రుత్వ వైఖరిలో క్రోదంతో తనని చావగొట్టడం, ఆకలితో కడుపులోని పేగులు మెలికలు తిరగడం ఇవన్నీ కారణాలే నేటి బాలల దీన స్థితికి

అయితే వాట నెలా పరిష్కరించటం? పరిష్కారం కష్టసాధ్యం కావచ్చు గానిఅసాధ్యం మాత్రం కాదు నేను కూలోణ్ణయినా నా కొడుకు ఇంజనీరు' కావాలి" అనుకొనే నాన్నలు, "నేటి బాలలే బవిష్యత్ప్రగతికి దీప్తులు" అని గుర్తించే ప్రభుత్వం కావాలి.



పరిశ్రమల్లో పనివాళ్ళను దోచుకొనే యాజమాన్యాలకు వ్యతిరేకంగా ప్రభుత్వాలు చట్టాలు చేస్తున్నాయి అయితే వాటిని మరింత పటిష్టంచేసి చట్ట పరిధి నుంచి తప్పుకొనే యాజమానులను రాజకీయ వత్తిడికి లొంగకుండా చట్టం శిక్షించాలి ఇంకా ఆర్థికంగా వెనుకబడిన కటుంబాలను ఇతోధికంగా ఆదుకోవటం సమాజం, ప్రభుత్వాల ఉమ్మడి బాధ్యత పిల్లల హృదయాలు ఇంకా విచ్చుకొనే మొగ్గలుగా ప్రతి తల్లిదండ్రులు గుర్తించాలి అంతే కాకుండా ప్రేమనూ, ప్రోత్సాహాన్ని అందించాలి రాష్ట్ర వ్యాప్తంగా మరియు దేశవ్యాప్తంగా మరింత ఎక్కువగా శిశు సంక్షేమ కేంద్రాలు తెరవాలి అప్పుడు మనం చెప్పుకొనేవి చిన్నారి బాలల దీనగాథలు కావు భవిష్యత్ సోపాన నిర్మాతల వీరగాథలు

—లక్కోజు శ్రీనివాసరావు,
ప్రదీప్‌నగర్, విజయనగరం □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు

పూర్తి చిరునామా

సంతకం

# ఫాలాక్షుని డైరీ

## కక్షలకి ఆహుతైన కుటుంబం!

కర్నాటక బెల్గాంకు చెందిన అంకలగి అనే గ్రామంలో రెండు కుటుంబాలు కక్షలతో కొట్టుకు చచ్చేవారట. ఈ కక్షలు పెరిగి ఒక కుటుంబంవారు తమ విరోధి కుటుంబం వారంతా నిద్రపోతూండగా మొన్న 19వ తేదీ రాత్రి ఆ యింటికి నిప్పంటించి, లోపలివారెవరూ బయటకు రాకుండా కాపలా కాశారట తత్ ఫలితంగా ఆ కుటుంబానికి చెందిన పదిమంది ఆడామగా, పిల్లా జెల్లా అంతా కాలిబూడిదైపోయారట

## ట్రాన్సిస్టర్ పేలి సంగీత దర్శకునికి గాయాలు!

తాను రాసిన సినిమా పాటలకు సంగీత దర్శకులు శంకర్– గణేష్‌లలో ఒకరైన గణేష్ సంగీతం కూర్చలేదని, దానివల్ల తన భవిష్యత్తే నాశన మయిందనీ పగబట్టిన సేలం జిల్లా సెట్టిపట్టికి చెందిన కందసామి అనే వో ఆసామి ఆ గణేష్‌కు పార్సిలులో వో ట్రాన్సిస్టరు పంపాడట దానిని ఆ గణేష్ ట్యూను చైదంతోనే అది ఢమాల్న పేలి, ఆయన రెండు చేతులూ, గుండె, ముఖం వంటి వాటికి తీవ్రమైన గాయాలయ్యాయట

## ముఖ్యమంత్రులు – సినిమాలు!

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి యన్టీఆర్ తాను సినిమాల్లో మళ్ళీ నటిస్తానని ప్రకటన చెశారు తమిళనాడు ముఖ్యమంత్రి యమ్జీఆర్ తాను మళ్ళీ




సినిమాలకు కథ, చిత్రానువాదమూ వగైరాలు రాస్తానని. పాటలు కూడా రాస్తాననీ అన్నారు–

## పట్టపగలు నడి రోడ్డుపై హత్య!

పెదనకు చెందిన 25 ఏళ్ళ షేక్‌మస్తాన్ అనే వో మున్సిపల్ కాంట్రాక్టరును శివనాగ ప్రసాదరావు, వెంకటేశ్వరరావు. రామన్ అనే ముగ్గురూ పట్ట పగలు నడిబజార్లో పొడిచి చంపేశారట. వీరి ముగ్గురికి కోర్టు యావజ్జీవ శిక్షను విధించిందట.

## హత్యకి దారి తీసిన భూమి తగాదా!

తమిళనాడు నెల్లై జిల్లాకు చెందిన కాట్టు పురంలో పూలి రామపాండియన్ అనే అతనికి అదే వూరుకు చెందిన పూలి ఉగ్ర పాండియన్ కుటుంబానికి భూమితగాదాలున్నాయట అవి రానానూ పెరిగి ఉగ్రపాండియన్ కొడుకు 37 ఏళ్ల శ్రీరామపాండియన్ తన కుటుంబంలోని వో తొమ్మండుగురు ' యువకులను తీసుకుని, కత్తులతో, కటారులతో ఆ రామపాండియన్ ఇంటిమీద పడ్డారట. ఇంట్లో వున్న నలుగురు ఆడవారు వారిని వారించబోయేసరికి వారిని భయపెట్టి పక్కకు తప్పుకోమని వీరు హెచ్చరించారట. అయినా తంగదురైచ్చి అనే ఆమె ధైర్యంగా వారిముందుకు వెళ్ళేసరికి ఆ తొమ్మండుగురూ కలసి ఆమెను ఖైమా కొట్టినట్టు కొట్టి చంపారట.

## మంటలకు ఆహుతి అయిన పోలీసు అధికారి!

భాగల్పూరు జిల్లా నాద్‌నగరుకు చెందిన నేత పని వారంతా తమకు విద్యుచ్ఛక్తి సరఫరాను నిలపడంతో భయంకరమైన ఆర్భాటం చేశారట దీనిని కంట్రోలు చేయడానికి పోలీసు డిప్యూటీ సూపరింటెండెంట్ యస్ పి మెహ్రా తన పరివారంతో వెళ్ళేసరికి వారు రాళ్ళతో స్వాగతం చెప్పారట ఆ రాళ్ల వానకు తట్టుకోలేక చెల్లా చెదరైన పోలీసులను పట్టుకుని వారు వుతక నారంభించారట తనను తాను రక్షించుకోడానికి ఓ యింట్లోకి పోయి మెహ్రా తలుపు వేసుకుంటే ఆ తలుపు బద్దలు కొట్టి, ఆయన్ను కొట్టి కొట్టి చంపేసి, జగభగా మండుతున్న ఆయన టేపులోనే ఆయన శవాన్ని పడేసి కాలి, బూడిదయ్యేదాకా కాపలా నిలబడ్డారట వారు

## ఖర్చు తప్పించుకునేందుకు హత్య!

ఢిల్లీ పటేల్ నగర్‌కు చెందిన రమాకాంత్ అనే ఆయన తన వొదిన గారు తన అన్న చావుతో భారమై, దానికి తోడు ఆమె రోగాలకు డబ్బు ఖర్చు పెట్టలేక, వేరే గత్యంతరం లేని వానిలా ఆమెను రాయితో కొట్టి చంపేశాడట రక్తపు మడుగులో పడున్న శవాన్ని చుట్టుపక్కల వారు చూసి పోలీసులకు రిపోర్టు యిస్తే (17-12-86) చట్టం ఆ రమాకాంతునికి యావజ్జీవ కారాగార శిక్ష ప్రసాదించిందట కోర్టులో ఆయన తను చేసిన దారుణానికి కారణం చెప్ప నిరాకరించారట –

## కోకోకోలా రహస్యానికి నూరేళ్ళు!

కోకోకోలా పానీయం పుట్టి యీ నాటికి నూరు సంవత్సరాలయిందట ఈ పానీయం ఫార్ములా యీ నాటికి కూడా అతి రహస్యంగా వున్నదట ప్రపంచ దేశాలలో ఒక్క మనదేశంలో తప్ప తతిమ్మా దేశాలలో అమ్ముడుపోయే యీ పానీయం పార్ములా మాత్రం ఆ కంపెనీ అతి సొంతదారులకు మాత్రమే తెలుసునట మొన్న సంవత్సరం ఈ కంపెనీ శత సంవత్సరోత్సవం జార్జియాకు చెందిన అట్లాంటాలో అతి వైభవంగా చేసుకున్నదట కోకోకోలా ప్రొడక్షన్స్ అని యీ కంపెనీ యిటీవల సినిమాలూ, టి వి షోలూ ఆరంబించిందట

## ప్రాణం తీసిన వేరుశనగ పలుకు!

మహారాష్ట్ర అహ్మద్‌నగరుకు చెందిన వో ఎయిర్‌ఫోర్స్ ఆఫీసరుగారి 18 నెలల పసిపాప చేతికందిన వేరుశనగ్గింజ నోట్లో పెట్టిందట అదే సమయంలో ఆ పాపకు దగ్గు రాడంతో ఆ గింజ రొప్పున గాలి గొట్టానికి అడ్డం పడ్డదట దాంతో వూపిరి తిరగక ఆ పాప చనిపోయిందట

## స్వీడన్ పాలకుల నిరాడంబరత్వం!

అమెరికాలో ఓ బస్సులోని అమెరికన్ ప్రయాణీకుడు తన ప్రక్కనున్న స్వీడను ప్రయాణీకునితో తన దేశం గొప్పదనం చెప్తూ




అమెరికా ప్రజా ప్రభుత్వం ప్రపంచంలో కల్లా గొప్పదనీ, ఏ పౌరుడయినా నేరుగా అమెరికా ప్రసిడెంటును ఆయన నివాసంలో కలుసుకోవచ్చునీ చెప్పాడట దానికా స్వీడను దేశీయుడు మా దేశంలో అంత కష్టం కూడా లేదు పాలకులు మామూలుగా బస్సులలో ప్రయాణం చేస్తూనే ప్రజలతో కలసి వుంటారు అన్నాడట ఇదేమి ఆశ్చర్యమని ఆరా తీస్తే ఆ స్వీడను దేశీయుడు సాక్షాత్తూ కస్టాఫ్ అరప అడాల్ఫ్ అట! □

గోద్రెజ్

# క్రొత్త

# మేగా

## నీలి డిటర్జెంట్ బిళ్ల

## ఎఓఎస్*కల్గినది




భారతదేశపు ప్రముఖ అధికార-రక్షకురాలు రజని ఇప్పుడు ఉపయోగించేది కేవలం మెగా.

*ఎఓఎస్ – మరింత నురుగు, మరింత శుభ్రపరిచే శక్తి ఇచ్చే ఒక అద్భుత దినుసు.

'అమ్మ పడుకుందేమిటి ఈ టైములో?' అదుర్దాగా అడిగాడు భాస్కర్ కాఫీ కలుపుతున్న కుసుమ నెమ్మదిగా,

'మధ్యాహ్నం నేను ప్రమీల వాళ్ళింటికి వెళ్ళాను తను రేపు పురిటికి వెళ్ళి పోతోంది కదా తిరిగి వచ్చేసరికి మీ అమ్మగారు అదోలా ఉన్నారు కళ్ళు వాచి ఉన్నాయి ఎందుకలా ఉన్నారంటే ఏమీ చెప్పలేదు నేను రెట్టించలేదు ' ఇంకా గొంతు తగ్గించి, 'నాకయితే ఏడిచారేమోనని అనుమానం ఎవరో వచ్చారు ఎందుకంటే సోఫా కింద ఖాళీ గ్లాసులు ఉన్నాయి నా ఉద్దేశ్యంలో మీ మామయ్యా గానీ వచ్చారేమో నని లేకపోతే అంతలా అయిపోరు తలనొప్పిగా ఉందంటే మాత్ర ఇచ్చాను వేడిగా కాఫీ తాగి పడుకున్నారు, ఇందాకే ' అంది

"మామయ్యా అన్న మాట వినగానే భాస్కర్ కనుబొమలు ముడిపడ్డాయి అన్యమనస్కంగా గ్లాసు అందుకున్నాడు

"అంటున్నానని కాదు గానీ మీరంత మొండితనం చెయ్యకుండా ఉండవలసింది ఆవిడ పరంగా ఆలోచించకుండా ప్రవర్తించారు అందరూ ఆవిడనే అంటారు మీరు మానేస్తే పోయింది, ఆవిడని పంపించి ఉండాల్సింది 'సాధ్యమైనంత మృదువుగా అంది కుసుమ

'కబుర్లు చెప్పడం చాలా సులభం కుసుమా ఇప్పుడిలా నిశ్చింతగా ఉన్నామని అన్నీ మర్చిపొమంటే నా తరం కాదు ఆ రోజులన్నీ అనుభవించిన వాడిని నేను వెండి ఉయ్యాలలో ఊపేవారు మా తాతగారు నన్ను, అని చెప్పాను నీకు అలాగే జరగాలని నేననను మెడకి ఉంటే కాళ్ళకి లేక, కాళ్ళకి ఉంటే మెడకి అందని దుప్పట్లు కప్పుకుని ముడుచుకుని పడుకున్నాము నేను అమ్మ నేను ఏడిస్తే ఊరుకునే వారు కాదట తాతగారు రెండు తరాల వాళ్ళు కూచుని తినేంత ఆస్తి చేశానమ్మ వీడికి నేను, వాడు ఎందుకు ఏడవాలి? అనేవారట అలాంటిది రెండు కడుపులు నింపుకోడానికి అవస్థలు పడ్డాము ఇదంతా ఎలాగయిందంటావు? ఒక్కసారన్న తన ప్రాణానికి పడి ఏడిచే జీవాలు రెండు ఉన్నాయని ఆలోచించేరా? అంతలా మా ఉనికే పట్టకుండా సర్వనాశనం చేసి నడి రోడ్డు మీద నిలబెట్టారే? అటువంటి మనిషి మీద నాకింత పిసరు కూడా జాలిలేదు జాలిపడే ఇంకెవరినీ కూడా నేను సహించను, ఆవేశంతో ఊగిపోయాడు భాస్కర్

తమాయించుకుని, 'ప్లీజ్, నన్ను రెచ్చగొట్టకు కుసుమా ఒళ్ళు తెలియదు నాకీ విషయంలో మొన్ననే కదా ఒకసారి ఘర్షణ పడ్డాము ఈ విషయంలో 'అని అక్కడ నుంచి వచ్చేసి తల్లి పడుకున్న గదిలో కుర్చీలో కూర్చుని, తదేకంగా ఆమె మొహంలోకి చూశాడు నిద్రపోతున్న ఆ మొహంలో ప్రశాంతత లేదు అలసట, అలజడి పరుచుకుని ఉన్నాయి' ఇలాగేనా అమ్మా నిన్ను నేను చూడాలనుకున్నది? మన దుఃఖంలో ఆ దుకోసం మనుష్యులు మనల్ని సుఖంగా బతక నివ్వరెందుకు?' బాధగా అనుకున్నాడు. గడిచి పోయిన రోజుల తాలుకు భయంకరమైన నీడలు పడి మనసు అల్లకల్లోల మయి పోయింది

* * *

లక్ష్మీకాంతం, సుభద్రమ్మ గార్ల నాలుగో సంతానం జగన్నాథం ముగ్గురు ఆడపిల్లలు వరసగా పుడితే బెంగపెట్టేసు కున్నారు ఆయన అసలు ఆయనే ఆ వంశానికి ఏకైక వారసుడు ఇంక తనకి మగపిల్లలు పుట్టరేమో, ఈ వంశం ఇక్కడితో ఆగిపోతుం దేమోనని బెంగ చీకూ చింతా లేని సంసారం అయినా మనసు నెమ్మదిగా ఉండేది కాదు ఆయనకి ఇంత ఆస్తి ఎవరు తినేట్టు అనుకునేవారు పదేళ్ళ తర్వాత జగన్నాథం పుట్టాడు ముగ్గురి తర్వాత మగపిల్లవాడు మంచిది కాదన్నారు అందరూ అవేమీ పటించుకోకుండా ఏడు మల్లెల ఎత్తుగా పెంచుకొచ్చారు పిల్లవాడిని జగన్నాథం పుట్టిన దగ్గర్నుంచీ పట్టినదల్లా బంగారమే అయింది ఆడపిల్లలని ఘనంగా సాగనంపి, గొప్పింటి పిల్లయితే కొడుకుని ఎక్కడ అరడి చేస్తుందో అని సంప్రదాయ కుటుంబంలో పుట్టిన విమలని పెద్ద ఆస్తిపాస్తులు లేకపోయినా చేసుకున్నారు ఆయన అంచనా తప్పుకాలేదు విమల చాలా అణకువగా ఉండేది జగన్నాథం అంటే భయం ఉండేది డబ్బున్న వాళ్ళ ఇంట్లో ఏమంటే ఏం తప్పో అన్నట్టు అసలు మాట్లాడేదే కాదు అతి ముద్దుగా పెరిగిన భర్త స్వభావం ఆమెకి అంతు పట్టలేదు రోజంతా ఊరుమీద పడి తిరిగే వాడు

పెళ్ళయిన పిల్లవాడు ఇంటి పట్టున ఉండక పోవడం సుభద్రమ్మకి అంతగా నచ్చలేదు 'వ్యవహారం చూసుకునేందుకు ఇంకా నేనున్నాను గదా' అని లక్ష్మీకాంతం గారు ఏమీ అనేవారు కాదు పెళ్ళయిన రెండేళ్ళకే కొడుకుని కంది విమల దాంతో ఆయన గాలిలో తేలిపోయారు 'నాలాగ వాడికి



వంశోద్ధారకుడి గురించి బెంగ లేకుండా చేసింది, కోడలు' అని మురిసి పోయారు జగన్నాథానికి మాత్రం బాధ్యత పట్టలేదు ఇంట్లో ఉన్న కొంచెం సేపు కొడుకుని ఎత్తుకుని, భార్యతో అవసరమైన రెండు మాటలు మాట్లాడేవాడు అంతే రోజులో ఎక్కువ భాగం వీధిలోనే ఉండేవాడు నెమ్మదిగా పై ఊళ్ళకి కూడా వెళ్ళి వారం రోజులు ఉండిపోయే వా

భర్త ప్రవర్తన బాధా కరంగానే ఉండేది కానీ పెద్ద వాళ్ళ ముందు ఏమీ అనలేక పోయేది

కొడుకు తప్పు దారిలో పడుతున్నాడని భయపడింది తల్లి మనవడి ముద్దు మురిపాలతో తాతకి తీరేది కాదు ఆమధ్యలో ఆవిడ కాలం చేసింది లక్ష్మీకాంతం గారు మనిషి డీలా పడిపోయారు కొడుకు వ్యసన పరుడయ్యాడని, డబ్బు తగలేస్తున్నాడని చాలా ఆలస్యంగా తెలుసుకున్నారు కోడల్ని చూసి జాలేసింది తనకి తగ్గ వాడిని చేసుకుంటే సుఖపడేదేమో, ఈ గాపు ఇంట్లో పడేసి ఆ పిల్ల బతుకు నాశనం చేస్తున్నానని బాధపడ్డారు నోరు తెరిచి, నీ మొగుడు ఇంటి పట్టున ఉండేటట్టు కాస్త తెలివి తేటలుగా మసులుకోమని ఎలా చెప్పాలో ఆయనకి తెలియలేదు ఆయన కూడా చిన్న వయసులో ఆస్తికి వారసుడయ్యాడు కానీ ఇలాంటి బుద్ధులు అలవడలేదు, తన కొడుక్కి ఎలా వచ్చాయో అర్థం కాలేదు కోడలు మళ్ళీ గర్భవతి ఆ గందర గోళంలోనే ఇంటినిండా గంపెడు పిల్లలు కావాలనుకునే ఆయన ఈ రెండో పిల్లని ఎలా పెంచుతుంది అని భయ పడ్డారు, తీరు లేని తన కొడుకు ప్రవర్తన చూసి ఒక రోజు రాత్రి నిద్రలోనే ఆయన శ్వాస వదిలేశారు ఇంక నాతరం కాదన్నట్టుగా

విమల ఒంటరిదయి పోయింది మనసు, శరీరం రెండూ ఆరోగ్యంగా లేవు. నెలలు నిండిన మనిషి జారిపడి కడుపులో పిల్లని పోగొట్టుకుని, చచ్చి బతికింది భాస్కర్‌ని చూసుకుంటూ రోజులు గడిపేది అటువైపు వారినీ, ఇటువైపు వారినీ కూడా కాస్త భర్తకి నయాన్నో భయాన్నో చెప్పమంటే, అతను మా మాట వింటాడా? మీ ఇద్దరి మధ్య మేమెందుకు? నువ్వే చూసుకోవాలి ఇవన్నీ' అంటూ అందరూ తప్పించు కున్నారు ఆఖరికి జరగకూడనిది జరగనే జరిగింది

# ఇంటికో వీరేశలింగం

## 'జ్యోతిర్మయి'



ఎవరో ఆడదాని కోసం దెబ్బలాటలో మాటా మాటా పెరిగి జగన్నాథం తోటి వాళ్ల మీద బలమైన వస్తువుతో గాయం చేస్తే ఇద్దరికి బుర్రలు బద్దలయ్యాయి. వాళ్లల్లో ఒకడు ఆ తర్వాత పోయాడు. జగన్నాథానికి యావజ్జీవ శిక్ష పడింది. విమల మొద్దు బారిపోయింది. ప్రాణం పోయేదే కానీ, కొడుకుని చూసి నిలబెట్టుకుంది. 'నేనూ వీడూ కూడా ఆయనకి ఏమాత్రం అక్కర్లేక పోయాం. ఒక్కసారి కూడా నేనిలా ప్రవర్తిస్తే వాళ్లేమయి పోతారు అన్న స్పృహ లేదాయన్నకి' అనుకుంటే గుండె తరుక్కు పోయింది. ఆస్తంతా అప్పుల వాళ్ళు లాక్కుపోయారు. అత్తగారు తన పుట్టింటి వారిచ్చిన మూడు ఎకరాల పొలం కోడలికి ఇచ్చింది. అదొకటే ఆధారం. లోకం కోసం వెరిచి అన్నగారు ఇద్దరినీ ఇంటికి తీసుకెళ్లాడు.

నరకంలా ఉండేది అక్కడ బతుకు. తను చచ్చిపడి ఉన్నా, పిల్లవాడిని ఊర్కోబెట్ట లేక పోయేది. పేచీలు భరించలేక కొట్టేది. ఆ తర్వాత ఏడ్చుకునేది.

'ఎవర్నని ఏం లాభం? ఒక్కొక్క పాదం అలాంటిది అంతా తుడుచుకు పోయింది ఇక్కడ చేరింది మహాతల్లి మాకేం గతులు పట్ట నున్నాయో?' అంటూ శాపనార్థాలు పెట్టే వదిన గారి ఇంట్లో ఎలా ఉండాలో అర్థం కాలేదు ప్రాణం చచ్చిపోయేది

'ఎందుకమ్మా ఇక్కడ ఉండడం మన ఇంటికి పోదాం' అన్న కొడుకు మాటలకి ఏం చెప్పాలో తెలిసేదికాదు ప్రతి ఏడూ శిస్తులు తీసుకొచ్చే కోటయ్య పాతకాలంవాడు తన అత్తగారి పుట్టింటి వారి పొలాలు అతనే చాలా రోజులనుంచీ చూస్తున్నాడు. మిగతా అందరూ తమ తమ పొలాలు అమ్మేసుకున్నారు కానీ ఇవి ఉన్నాయి పాతకాలపు అభిమానం అలాగే ఉంది అతనికి. ఆ ఇంటి కోడలు బతుకు ఇలా అయిపోతే చాలా బాధపడ్డాడు

ఎందుకమ్మా ఇలా రోజూ చస్తు బతుకుతావు మీ అత్తగారి ఊరు ఇంకా గొడ్డుపోలేదు ఎక్కడయినా బతికెయ్యచ్చు ఆ పాత గౌరవాలు ఇంకా ఉన్నాయమ్మా బతికి చెడ్డదానివి ఎవరయినా ఆదరం చూపిస్తారు ఒకసారి పొలాలు చూసుకుంటానని చెప్పి ఇక్కడనుంచి బయట పడిపో, ఈ డబ్బు ఎలాగూ ఆయన చేతిలో నే పోస్తున్నావు కొన్నాళ్ళు పోతే ఏదో ఖర్చు అంటూ అమ్మెయ్యమంటారు ఆ ఆధారం కూడా పోతుంది ప్రతిచోటా వింటున్న కథలే ఇవి ఆ పిల్లవాడికోసం అన్నా ధైర్యం చెయ్యి' అని నచ్చచెప్పాడు

నిజమేననిపించింది విమలకి నిత్యం తిట్లు, శాపనార్థాలు భరిస్తూ ఈ పిల్లవాడితో ఎలా బతకాలో తనకీ పాలుపోవడంలేదు ఏమీ దారి కనిపించడంలేదు అతను ఆ మాత్రం ధైర్యం ఇస్తే ఇక్కడ బతికే ఈ మాత్రం బతుకు ఎక్కడన్నా వెళ్లమారిపోతుంది తనంటే ఎలాగూ అభిమానం లేదు వీళ్లకి ఇలా ఆలోచించి, అన్నగారితో ఏమాత్రం అనుమానం రాని విధంగా 'ఒక్కసారి వెళ్లి పొలాలు చూసుకు వస్తానని' అంది

'నువ్వేం చూస్తావు? నీకేం తెలుసు?' అంటూ వారించిన అతనితో, 'అన్నింటికీ ఎక్కడకని నువ్వు పరుగెడతావు? నీకూ పనులున్నాయి కదా ఏదో కాస్త నా మొహం అన్నా వాళ్లకి తెలుసు ఒకసారి కనుక్కుని వచ్చి, ఆ తర్వాత నీకు అప్పగిస్తాను నీకూ ఆ ఊళ్లవీ తీలియవు' గదా' అని బయలుదేరింది వెంటనే మరీ బలవంతంగా ఎలా ఆపాలో తెలియక ఊర్కున్నాడు అతను ఆమే ధైర్యం చెయ్యగలదని అతనికి అనుమానం రాలేదు

కొన్నిరోజులు కోటయ్య ఇంట్లో ఉండి, ఫర్వాలేదని గ్రహించి అక్కడే ఉండిపోవాలని నిశ్చయించుకుంది రెండు పెద్ద ఇళ్లల్లో పనులు కుదుర్చుకుంది ఎంత దిగజారిపోయినా మరీ అంట్లు అవీ చేసేంతగా దిగిపోలేదు వంటలు, అప్పడాలు, వడియాలు, మంచినీళ్లు పట్టిపెట్టడం ఇలాంటివి ఒప్పుకుంది కౌలుకి పోగా వచ్చిన డబ్బు, ఇదీ కలుపుకుని అతి కష్టంగా రోజులు గడుస్తున్నాయి ఒకళ్ల ఇంట్లో వెనకవైపుకున్న గది దుమ్ము దులిపి నివాసం ఏర్పరచుకోనిచ్చారు సంగతి తెలిసిన అన్నగారు వచ్చి చెల్లెలు ధైర్యానికి కోపమొచ్చి అనకూడని మాటలు అనివెళ్లాడు విని ఊరుకుంది

భాస్కర్ మాత్రం తండ్రిలా కాకూడదని వెయ్యిదేవుళ్లకి మొక్కుకుంది దగ్గర కూచుని చదివించేది తన అదృష్టం అంతా ఇంక వాడే 'నాన్నగారు డబ్బంతా పాడుచేస్తే తాతగారు ఆ డబ్బు నీకెందుకు ఇవ్వలేదమ్మా' అనే కొడుకు మాటలు తప్పించేసేది వాడికేం తెలుసు? తరతరాల ఆస్తి చట్టరీత్యా కొడుక్కే చెందుతుంది, తగలేసుకోనీ, నిర్వాహం చేసుకోనీ అయినా వాడి పిచ్చిగానీ తనపేర ఉంటే మాత్రం అది లాక్కోడం ఎంతసేపు? ఇలా జరిగింది కానీ లేకపోతే ఈ కాస్త పొలం కూడా అలాగే కరిగిపోయేది

తల్లి రావడం ఏమాత్రం అన్నా ఆలస్యం అయితే, ఒకొక్కరోజు బాస్కర్ వంటచేసేసేవాడు. 'అదేంటి నాన్న, నువ్వెందుకు చెయ్యి చేసుకున్నావు?' అంటే 'నేనే అమ్మాయినైతే చెయ్యనేమిటి?' అనే భాస్కర్ మాటలకి విమల వణికిపోయేది 'ఒద్దు బాబూ' అదొక్కటే తక్కువ నువ్వే ఆడపిల్లవయితే నా పరిస్థితి ఇంకా ఘోరంగా ఉండేది ఇలా ఎక్కడ-పడితే అక్కడ వదలగలనా? ఎంతమందినుంచి కాపాడుకోవాలి' అని బయపడేది రెండోసారి పిల్లని పోగొట్టుకున్నప్పుడు కొన్నాళ్ళు బాధపడిన మనసు అది లేకపోవడమే మంచిదన్న అభిప్రాయానికి



చౌకరకంవి కొనడానికీ, మంచి నాణ్యమైనవి కొనడానికీ మధ్య
బోలెడు తేడా ఉంది...అందుకే కొనాలి నాణ్యమైన సర్ఫ్.
"తూకం చూస్తే మీకే తెలుస్తుంది—సర్ఫ్ యొక్క పవర్ ప్యాక్డ్ ఫార్ములా మీ డబ్బుకి మించిన విలువ ఇస్తుందని".
డబ్బుకి మించిన విలువా? అసలే సర్ఫ్ ఖరీదైనది కూడా కదా?
"చూడండి. దీనివల్ల ఎంత ఎక్కువ లాభమో గ్రహించారా మీరు. కేవలం సర్ఫ్ మాత్రమే నా బట్టల్ని అతి తెల్లగా ఉతుకుతుంది. పైగా వాటిని సంరక్షిస్తుంది కూడా. అందేత అవి కొత్తవాటిలా కనిపిస్తూనే వుంటాయి. అంటే ఇంక ఆదాయే ఆదా. అందుకే డబ్బుకి మించిన విలువ ఇస్తుందని అన్నాను నేను".
సరేగానీ, లలితగారూ, ఆ మాత్రమే చాలంటారా మీరు?
"అబ్బే. ఇంకా ఎంతో వుంది! ఒక కిలో చౌక రకం పౌడర్ ఎంత వుంటుందో అంత ½ కిలో సర్ఫ్ ప్యాక్‌లో ఉంటుంది. అంటే ఒక కిలో చౌక రకం పౌడర్ ఉతికేటన్ని బట్టల్ని అర కిలో సర్ఫ్ ఉతుకుతుందన్నమాట. అంటే సర్ఫ్ నుంచి మీరు మరింత లాభం పొందుతున్నట్టేగా మరి?"
1 కిలో చౌక రకం పౌడర్
½ కిలో సర్ఫ్
అంటే, కొనేందుకు సర్ఫ్‌ని మించినది లేదన్నమాట!
"అందులో సందేహం ఏముంది? సర్ఫ్ మరెంతో తెల్లగా ఉతుకుతుంది. మరే మామూలు పౌడర్లకన్నా రెట్టింపు బట్టల్ని. చౌక రకంవి కొనడానికీ, మంచి నాణ్యమైనవి కొనడానికీ మధ్య బోలెడు తేడా ఉంది. అందుకే సర్ఫ్ కొనడంలో మరింత వివేకం ఉంది".
POWER PACKED
Surf

వచ్చేసింది

వయసొస్తున్న కొద్దీ, భాస్కర్‌కి తండ్రంటే కసి, ద్వేషం పెరిగిపోయాయి తండ్రిని గౌరవించాలని తగినంత కారణం చూపించలేకపోయింది విమల. దూరంగా జైలులో ఉన్న జగన్నాధాన్ని చూడడానికి ఎవరూ వెళ్లేవారు కాదు కొడుకుకి ఆ వాతావరణం చూపించడం అసలు ఇష్టపడలేదు విమల

ఒక్కొక్కసారి "నిజంగా తనకీ, జగన్నాధానికీ పెళ్లయిందా?' అనుకునేంతగా గడిచిన జీవితం ఒక కలలా అయిపోయింది. 'ఎప్పుడో ఒకప్పుడు తన భర్త' అన్నభావం తప్ప అతని తలపులకి స్పందించడం అన్నది ఆ మనసు ఎప్పుడో మానుకుంది కలిగి ఉన్నపుడే ఏమీ లేవు, ఇంక ఇపుడు ఎక్కడివి?

పనులుచేసి చేసి వాచిపోయిన చేతుల్ని చూసి కళ్లనీళ్లు పెట్టుకునేవాడు భాస్కర్. 'నువ్వు ప్రయోజకుడవై, నీ సంపాదన నాచేతుల్లో పెట్టి నాకు వెన్న రాసినట్టుగా ఉంటుంది' అనేది నవ్వుతూ

'అప్పుడు నువ్వింక ఎపుడూ నవ్వుతూనే ఉండాలమ్మా ప్రపంచంలో కొడుకంటే భాస్కర్‌లా ఉండాలి ఉని అందరూ అనుకోవాలి' అన్న బాస్కర్ ఆవేశం ఒకొక్కసారి భయం కలిగించేది

మంచి మార్కులు సంపాదించిన కొడుకుని పై చదువులు చదివించలేని తన నిస్సహాయతకి బాధపడింది విమల. అటువంటి సమయంలో ఆ ఇంటి యజమాని సలహా ఇచ్చి, ఈ టైములో నువ్వతని భవిష్యత్తు నాశనం చెయ్యకు విమలమ్మా. తెలివైనవాడు ఇంజనీరింగ్‌చదివించు అక్కడ కాలేజీలో మా బావమరిది పనిచేస్తున్నాడు చూస్తూ ఉంటాడు డబ్బుకి చూసుకోకు. కోటయ్యకి ఒక ఎకరం తనఖాపెట్టి, డబ్బు తీసుకో రోజులు కలిసొస్తే నీ కొడుకే విడిపించుకుంటాడు అన్నారు. అలాగే చేసింది విమలమ్మ కొడుకు ఉన్నతి చూస్తుంటే ఆకలి కూడా ఉండేదికాదు విమలమ్మకి

ఈసారి జీవితంలో ఓడిపోలేదు, మోసపోలేదు కొడుకు ప్రయోజకుడయ్యాడు ఉద్యోగం సంపాదించాడు యాక్సిడెంట్‌లో పోయిన తన స్నేహితుడి చెల్లెల్ని కట్నం ఆశించకుండా పెళ్లి చేసుకున్నాడు కొడుకు ఆ తల్లీ కొడుకుల మధ్య చక్కగా ఇమిడిపోయింది రోజులు సాఫీగా గడిచిపోతున్నాయి ఆ తరుణంలో,

జగన్నాధం సీరియస్‌గా ఉన్నాడని జైలునుంచి కబురు వచ్చిందని మేనమామ రాసిన ఉత్తరం కల్లోలం రేపింది చిందులు తొక్కాడు భాస్కర్

'ఎంతయినా నీకు తండ్రికదా బాస్కర్ నాకు భర్త.. 'ఎలాగో అంటూన్న తల్లి మాటలకి మధ్యలోనే అందుకుని 'ఎవరమ్మా తండ్రి, ఎవరు భర్త? నీకు గుర్తున్నాడా అలాగని నాకయితే గుర్తులేని మనిషికోసం వెళ్లి అతనికంత ప్రాముఖ్యం ఇవ్వకమ్మా నాచేత్తో అతనికేదో చేసి నీతోటి సమానం చెయ్యలేను. నువ్వు వెడితే మాత్రం

## 'ఇంటికో వీరేశలింగం'

నేను లేనట్టే అనుకో' అని అనేశాడు

అతనిలోని కర్కశత్వాన్ని చూసి కుసుమ కూడా భయపడింది విమలకి ఏమీ పాలుపోలేదు లోకంకోసం భయపడాలి కదా కానీ కొడుకు మాటలు ఆవిడని కట్టిపడేశాయి గుండె రాయి చేసుకుంది తన నిర్ణయం మేనమామకి రాసి పడేశాడు

'గుండెలమీద చేయివేసుకుని చెప్పమ్మా ఆయన జ్ఞాపకాలు నీకింకా ఉన్నాయని' అని నిలదీసే కొడుకు మాటలకి ఆవిడ దగ్గర సమాధానం లేదు

జగన్నాధం పోయాడని సమాచారం అందిస్తూ మేనమామ రాసిన ఉత్తరంలో కోపాన్నంతా కక్కాడు 'మీరొచ్చి ఎక్కడ ఇబ్బంది పడతారోనని నేను బయలుదేరి వెళ్లి ఆ జిడ్డంతా అంటించుకున్నాను కొడుకు అందచూసుకుని మొదట్నించీ నువ్వెవరినీ లక్ష్యపెట్టలేదు' అంటూ

ఉండవలసిందేనా? కొడుకునన్న అధికారంతో నే కదా ఆవిడ్ని ఆరోజు ఆపేశారు? ఈరోజు ఇలా అడ్డు తగులుతున్నారు? కొడుకుగా ఆవిడకి ఏమాత్రం స్వతంత్రం ఇచ్చారు? ఆవిడ మానాన ఆవిడ్ని ఎవరూ బతకనివ్వరా?' అని ప్రశ్నించింది

కుసుమ మాటలకి కళ్లనీళ్లు తిరిగాయి భాస్కర్‌కి 'నన్ను చాలా తప్పుగా అర్థం చేసుకున్నావు కుసుమ ఒక కొడుకుగా, ఇక మగవాడిగా నేను ఆవిడ్ని శాసించడం లేదు తనకంటూ ఒక అభిప్రాయం ఏర్పరచుకునే అవకాశం ఈ జీవితం ఆవిడకి ఎపుడూ ఇవ్వలేదు ఆరోజు నిజంగా ఆవిడ నన్ను కాదని వెడితే నేనేమన్నా చెయ్యగలననుకున్నావా? తన నోటితో ఆవిడ ఎప్పుడూ అనలేదు అతను నాకేం చేశాడు, నేనెందుకు వెళ్లాలి? అని ఆవిడ జీవితంలో సంపూర్ణ ప్రతిక్షణం అతిదగ్గరగా చూసిన వాడిని నేను అనుభవించవలసిన వయసంతా రోకళ్లకీ, అప్పడాల పీటకీ అంకితమయిపోయింది




ఆరోజు మాత్రం విమలమ్మ తను విరుద్ధంగా ప్రవర్తించలేకపోయింది తనంత తానే పుస్తెలు తీసేసి, బొట్టు మానేసుకుంది ఎంతటి రాతిగుండెకయినా ఆ పనులు చేస్తుంటే పగులు వేసింది కుసుమ ఒక తోబుట్టువులా ఆరోజంతా అత్తగారిని ఓదార్చింది ఈ వ్యవహారం అంతా చూసిన బాస్కర్ మళ్లీ,

'ఇనాళ్లూ ఆయన ఉండి నీకేం ఒరగపెట్టాడని ఈరోజు లేడని అవన్నీ తీసేస్తున్నావు? ఏరోజన్నా వాటి గురించి అతను పట్టించుకున్నాడా?' అని రంకెలు వేశాడు కుసుమ ఇంక ఊరుకోలేకపోయింది అతన్ని చెయ్యి పట్టుకుని పక్కకి తీసుకొచ్చి,

'మీరేమన్నా ఆలోచించే మాట్లాడుతున్నారా? లోకమంతా ఆవిడకేదో అన్యాయం చేసింది, అని బాధపడే మీరు ఆవిడకంటూ ఒక మనసుందని, దానికి ఒక అభిప్రాయముందని ఆలోచించేరా? ప్రతిసారీ ఆవిడ ఎవరో ఒకరికి భయపడుతూ

ఎంచంతాంటి ఇల్లు, వాకిలి ఆవిడకి లేవు ఇంటికొస్తే కనిపించేవి నిర్జీవమైన గోడలు, దైన్యం నిండిన నా మొహం

ఆ వయసులో శారీరకంగా, మానసికంగా తనని తాను అదుపులో పెట్టుకోడానికి ఎంతటి మానసిక స్థైర్యం కావాలో అన్నీ ఉన్న నీలాంటి వాళ్ల ఊహకి కూడా అందవు కుసుమా ఒక కొడుకుగా తల్లిని గురించి అటువంటి మాటలన కూడదనుకో నా దృష్టిలో ఆవిడ ఒక దేవత అటువంటిది, జీవితమంతా ఒంటరిగా పోరాడి నిలబడిన మనిషి ఈరోజు అప్పరాల్ ఒక మగాడి ముందు, ఒకప్పుడు తన మొగుడు అయినందుకు ఎంతైనా నేను ఆడదాన్ని అని ఓడిపోవడం నేను సహించలేను ఆ మొహంలో ఆ ఓటమిని చూస్తూ నేను భరించలేను అందుకే ఇలా ప్రవర్తిస్తున్నాను కుసుమా నాబాధ ఎవరికీ అర్థంకాదు ' అని నిస్సహాయంగా చేతుల్లో మొగం దాచుకున్నఅతన్ని చూసి, 'ఇటువంటి కొడుకునికన్న ఆతల్లి అదృష్టవంతురాలు' అని

అనుకోకుండా ఉండలేకపోయింది కుసుమ

ఆ తర్వాత భాస్కర్ ఇంక వేరే ఏమీ గొడవ పెట్టలేదు కోలంగాయాల్ని మాన్పించింది 'మళ్ళీ ఈ రోజు మామయ్య వచ్చి ఏదో అని అందర్నీ రెచ్చగొట్టి వెళ్ళాడు' అనుకుంటూ చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకున్నాడు బాస్కర్

కళ్ళు తెరిచిన విమలమ్మ కొడుకుని చూసి ప్రయత్నం మీద నవ్వింది

'పడుకున్నావేమిటి అమ్మా ఈ వేళపుడు' అన్నాడు సాధ్యమైనంత మామూలుగా

'ఊర్కినేరా? కాఫీ తాగావా? ఎంతసేపయింది వచ్చి?' అంటూ మాట తప్పించబోయింది

'మామయ్య వచ్చాడా అమ్మా' తల్లి వైపు సూటిగా చూస్తూ అడిగాడు ఆవిడ కళ్ళు దించుకుంది 'నాకు తెలుసమ్మా లేకపోతే నువ్వింతలా కళ్ళూ, మొహం ఏకం అయ్యేట్టు ఏడ్చే అవసరం రాదు ఏమన్నాడో చెప్పు '

విమలమ్మకి ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు ఒకసారి అయిన గొడవే మళ్ళీ మొదలవుతుంది

'మామయ్య నిన్ను ఎలాంటి మాటలు అన్నాడో జ్ఞాపకం ఉందామ్మా? ఇల్లు వదిలేసి, వచ్చామని ఉక్రోషంతో ఆరోజు చెల్లెలివని కూడా ఆలోచించకుండా నాదగ్గర ఉంటే నీకు వేషాలెయ్యడానికి ఎలా కుదురుతుంది? ఇక్కడయితే ఎన్ని నాటకాలయినా ఆడచ్చు, అంటూ మాట్లాడాడు ఆదరించకపోతే మానెయ్యి కనీసం మామూలు మనుష్యుల గానయినా చూశాడా? నిత్యం మాటలతో చంపేసేవారు కాస్త ఆదరణ చూపించి ఉంటే మనం అక్కడే ఉండే-వాళ్ళం కదా అలా అయితే నాకింత కసి, ద్వేషం పుట్టేవి కావేమో, మనుష్యుల మధ్య బతికి దిక్కులేని వాళ్ళలా అయిపోయాం ఏమన్నాడో చెప్పమ్మా?'

కొడుకు మాటలకు విమలమ్మ కాదనలేక-పోయింది ఆవిడకేమీ దాచాలని అనిపించలేదు

## 'ఇంటికో వీరేశలింగం'

'ఏముంది బాబూ క్రొత్తేముంది? అందరూ అనేదే. లోక విరుద్ధంగా ప్రవర్తిస్తే మనం ఇద్దరం వెళ్ళలేదని అరిచాడు వాడయితే చిన్నవాడు నీకేమయింది? తాళికట్టినవాడు కదా ఆ మాత్రం గౌరవం లేదా? మనిషివి కదా అంటూ ఏవేవో అన్నాడు పోనీలే ' అంటుంటే

'నేనొచ్చేదాకా ఆగలేకపోయాడా? నాదగ్గర అనమనాల్సింది మనిషి అన్నవాడు ఎలా ప్రవర్తించాలో వీళ్ళెవరూ మనకి చెప్పక్కరలేదు వీళ్ళందరూ మనుషులేనేమిటి? తాళి కట్టించుకున్నావా? అసలు తాళి అన్నది ఎవరు కడ్తారమ్మా? మూడు ముళ్ళు ఎవరు వేస్తారు? తాళి కట్టించుకున్న వాళ్ళకి కాదమ్మా వేసిన వాడికి దాని పట్ల బాధ్యత ఉండాలి తను ఎందుకు కట్టాడో వాడికి తెలియాలి అన్నీ వదులుకుని బలి పశువులా తాళి కట్టించుకున్న వాడి వెనకాతల ఇంక అన్నీ నువ్వే నాకు అంటూ వాడేదో ఉద్ధరిస్తాడని వెళుతుంది ఆడది తన భార్యని సదా రక్షించుకుంటూ, కంటతడిపెట్టకుండా జీవితాంతం రక్షించుకుంటానని కడతాడమ్మా తాళి నేను 'మగవాడిని' అని గొప్పగా చెప్పుకుంటాడే? తన భార్యని, పిల్లలని చూసుకోలేని మగవాడు ఏం మగవాడమ్మా ఆమాత్రం చెయ్యలేనివాడు నేను మగవాడినని చెప్పుకోడమెందుకు? మూడుముళ్ళ పట్ల బాధ్యత అంటూ మీ ఆడవాళ్ళెందుకు అలమటించిపోతారు? ఆ మూడుముళ్ళ బంధం నిలబడేట్టు చూడాల్సింది మగవాడు ఆడది ఏం చెయ్యగలదు? మెళ్ళో వేసుకు తిరుగుతుంది అంతే నీకిపుడు అందరూ పోటీలు పడి గుర్తు చేస్తున్నారే? ఆ రోజుల్లో ఏ ఒక్కడూ కూడా 'ఒరేయ్ నీకు తాళికట్టిన ఒక పెళ్ళాముంది దాని పట్ల నీకు ఒక బాధ్యత ఉంది' అంటూ అతనికి ఎందుకు చెప్పలేదు మాట్లాడవేమిటమ్మా అతన్ని ఎవరూ అనరో ఏం బంధం మిగిల్చాడని అతన్ని చూడ్డానికి నువ్వు వెళ్ళాలి? తన భార్యని దిక్కులేనిదాన్ని చేసిన మగవాడు ఏం మగవాడమ్మా?' అంటూ ఆవేశంగా అన్నాడు బాస్కర్

అతని వాక్ప్రవాహాన్ని పరవశంగా వింటున్న విమలమ్మ, 'ఎన్నడో రాజా రామ మోహన్‌రాయ్, వీరేశలింగంగారి నోటమ్మట వింటున్నట్టుగా ఉందిరా నాకు ఎప్పుడో ఒకసారి అలాంటి వాళ్ళు పుట్టి మమ్మల్ని ఉద్ధరిస్తే కొంతలో కొంత మా బతుకులు బాగుపడుతుంటాయి' అంది

'ఎంతమాట అన్నావమ్మా బుర్ర ఉన్న ఏ మగవాడికన్నా చెంపదెబ్బలాంటిమాట ఇది తన తల్లిని, తన భార్యని తన తోబుట్టువుని ఉద్ధరించడానికి తరానికో, శకానికో ఒక వీరేశలింగం, ఒక రాజారామ్ మోహనరాయ్ పుట్టాలా? పరాయి వాడెవరో తన ఆడవాళ్ళని ఉద్ధరించాలా? అంతకన్నా తలవంపు ఇంకేమన్న ఉందా? మొగుడుపోయిన ఆడదాన్ని ఒంటరిగా బతకనివ్వని ఈ కుళ్ళు సమాజం నిప్పుల్లోకి తోస్తుంటే దానికి కూడా నీలాగే బతికే హక్కుంది, అదీ మనిషే, నీ పెళ్ళాం చచ్చిపోతె నువ్వు చస్తావా? అని చెప్పడానికి ఒక రాజారామోహన్ రాయ్ కావాలా? పెళ్ళాం పోయిన ఎదిరోజులకే పీటలమీద కెక్కే నీలాగే విధవకి కూడా మళ్ళీ పెళ్ళి చేసుకునే హక్కుంది అని చెప్పడానికి ఒక వీరేశలింగం రావాలా? ఆపాటి ఇంగితం, ఆలోచనా శక్తిలేని మగవాడు ఆడదానికన్నా శారీరకంగా బలవంతుడు కావచ్చు, మానసికంగా రోగిష్టివాడమ్మా వాడి బుర్రకి పక్షవాతం వచ్చింది బాధ్యత నెత్తిమీదపడి ఇల్లు వదిలి ఉద్యోగంచేసే ఆడపిల్లని దానిమానాన దాన్ని బతక నివ్వాలమ్మా రాబందుల్లా పొడవకూడదు భర్తపోయిన ఆడదాన్ని మళ్ళీ పెళ్ళి లేకపోతే పీడాపోయింది తన బతుకు తనని గొడవ చెయ్యకుండా బతకనియ్యాలమ్మా కన్న తల్లిని గౌరవించి, భార్యని ప్రేమించి, తోబుట్టువుని ఆదరించి పరాయి ఆడదానిలో ఒక తల్లిని, తోబుట్టువుని నిలుపుకుని తన ఇంటికి తనే ప్రతి మగవాడు ఒక వీరేశలింగం ఎందుకు కాకూడదమ్మా ఎపుడో ఎవరో వచ్చి ఉద్ధరిస్తారని కన్నీళ్ళతో ఆడది ఎదురు చూడడం మగవాడిగా నాకు తలకొట్టేసినట్టుగా ఉంది నా ఇంటికి నేనే వీరేశలింగాన్ని అనుకుంటే ఈ సమాజంలో ఇంతమంది అబలలు, పతితలు ఉండరు, ఆడదాని కళ్ళలో ఇంతదైన్యం ఉండదు మామయ్య మాటలకి నువ్వు బాధపడకమ్మా నువ్వు చేసిన దానిలో ఏమి తప్పులేదు ఒక కొడుకుగా, ఒక భర్తగా నా బాధ్యత నేను మీరిద్దరూ గర్వపడేలా తీరుస్తాను ' తల్లి ఒళ్ళో తల దాచుకున్నాడు భాస్కర్

**తల నిమురుతూ కొడుకు వైపు చూస్తూ ఉండిపోయింది. తన చేత్తో నాటిన విత్తనం మొక్కై, ఆరోగ్యమైన మహావృక్షమైతే దానినీడనే సేద దీర్చుకున్నప్పటి పరవశం ఉందా చూపులో.** □



"



ప్రెషర్ కుక్కర్స్ డీలర్ నైన నేను, ఏది భద్రతగల కుక్కరో, ఏది మరింత భద్రతాయుక్తమైనదో చెప్పగలను. అయితే వాటి అన్నింటిలోను అత్యంత భద్రమైనది న్యూ ప్రెస్టీజ్. కనుక మీరు మీ శ్రీమతికి న్యూ ప్రెస్టీజ్ ని కొని పెట్టారంటే, మీకు ఆమెపట్ల మిక్కిలి మక్కువ కలదని నిరూపిస్తున్నారన్న-మాట. మరియు ఆమె శ్రేయస్సుకే అత్యధిక ప్రాధాన్యాన్ని యిస్తున్నారన్న మాట-సర్వదా.

## న్యూ ప్రెస్టీజ్ ఎంత భద్రమైనదో చూడండి

100% SAFE

నూటికి నూరు పాళ్ళుభద్రతను చేకూర్చే అద్వితీయమైన గాస్కెట్ రిలీజ్ సిస్టం (జి ఆర్.ఎస్.) ఒక్క న్యూ ప్రెస్టీజ్ కి మాత్రమే కలదు. 'వెయిట్ వెంట్'





పూడుకొనిపో యినట్లయితే, కుక్కర్ లోపల మితిమించిన ఒత్తిడి ఏర్పడుతుంది. ఇది కుక్కర్ కు అత్యంత సమీపములో పున్న వ్యక్తికి ప్రమాదకరంగా పరిణ మించవచ్చును.

న్యూ ప్రెస్టీజ్ అయితే, మితిమీరి ఏర్పడిన సీటి ఆవిరి జి.ఆర్.ఎస్ ను బయటకు నెట్టు తుంది. తత్ఫలితంగా జి.ఆర్.ఎస్. ఆవిరిని



భద్రంగా, రూఢిగా క్రిందికి విడిచిపెడు తుంది. గాస్కెట్ ను ఒక స్పూన్ తో లోపలికి నెట్టండి.

అంతే, ప్రెషర్ కుక్కర్ తిరిగి వినియోగానికి సిద్ధంగా వుంటుంది. న్యూ ప్రెస్టీజ్ అయితే ఎన్నడూ అణుమాత్రంకూడా ప్రమాదం వుండదు. అందుచేతనే ఎట్టి పరిస్థితులలోనైనప్పటికి అది అత్యంత భద్రమైనది- సర్వదా. "

# భార్యపై నిజమైన ప్రేమగలవారు ప్రెస్టీజ్ వద్దని ఎట్లా అంటారు





## ప్రెస్టీజ్

Prestige 25 SILVER JUBILEE 1984-85

ttk తయారి.

న్యూ ప్రెస్టీజ్ ఒక్కటే మాత్రమే 100% భద్రమైనది. న్యూ ప్రెస్టీజ్ ఒక్కదానికి మాత్రమే జి.ఆర్.ఎస్. కలదు.

MAA (S) TTP 3B TEL 85

సీరియల్

# అన్యాయం




## యం. యస్. ఆర్. చౌదరి

(గత సంచిక తరువాయి)

చిదానందం తన అండర్ గ్రౌండ్‌లో కాన్ఫరెన్స్ జరుపుతున్నాడు

ఆ కాన్ఫరెన్స్‌లో చిదానందం అనుచరులందరూ పాల్గొన్నారు

"ఫ్రెండ్స్ నిన్నగాక మొన్న డ్యూటీలోకి వచ్చిన ఇనస్పెక్టర్ విజయ్ అప్పుడే మన లారీని ఒకదానిని పట్టుకున్నాడు నమ్మినబంటులా, విశ్వాస పాత్రుడిలా పనిచేసే మన నాగులు ఆ విజయ్ గాడి వల్ల ఆత్మహత్య చేసుకోవలసి వచ్చింది కాబట్టి అందరూ జాగ్రత్తగా ఉండండి ఎవ్వరైనా పొరపాటుగా పట్టుబడితే ఎవ్వరి పేర్లూ బయట పెట్టద్దు సాధ్యమైనంత వరకు తప్పించుకొనండి లేకుంటే ఏమి చేయాలో మీకు తెలుసుగా

అందరూ తలూపారు

జాన్, డేవిడ్ మీ ప్రోగ్రెస్ ఎలా ఉంది

జాన్, డేవిడ్ లిద్దరూ ఫారెస్ట్‌లో గల గోడౌన్ దగ్గిరుంటారు గంజాయి, నల్లమందు స్మగ్లింగ్ చేయుట వారి పని అడవిలో నుంచి జరిగే గంజాయి స్మగ్లింగ్‌కి జాన్, డేవిడ్ లిరువురూ నాయకత్వం వహిస్తున్నారు

ఫైన్ బాస్ సమాదానమిచ్చాడు జాన్

'మీరు అన్నివేళలా జాగ్రత్తగా ఉండండి ఏ క్షణమైనా పోలీసులు దాడి చేయవచ్చు అవసరమైతే సరుకును నాశనం చేసి పారేయండి అంతే గాని మీరు మాత్రం దొరకద్దు హెచ్చరించాడు చిదానందం

అలాగే బాస్

★ ★ ★ ★ ★ ★ ★ ★

'టప్ మంటూ రివాల్వర్ పేల్చాడు విజయ్

బుల్లెట్ దూసుకెళ్ళి నల్లత్రాచు పడగను రెండుగా చీల్చి వేసింది

పాము గిల గిల్లాడుతూ చచ్చిపోయింది

ఆ యువతి అది చూసి నిట్టూర్చింది

విజయ్‌ని చూసి అమాంతం విజయ్ కాళ్ళ మీద పడి 'నన్ను చంపొద్దు దొరా నన్ను వదలి పెట్టు అంటూ ఏడుపు నందుకొంది

ఉలిక్కిపడ్డాడు విజయ్

**జరిగిన కథ–6:** సలీం, జావేద్‌లు గణేశ్‌ను చంపేస్తారు విజయ్ ఎస్ ఐ అవుతాడు బాస్ ఆజ్ఞపై సలీం, జావేద్‌లు ఒక బ్యాంకు దోపిడీ చేస్తారు వజ్రాల స్మగ్లింగ్ గురించి సమాచారం అంది, విజయ్ అక్కడికి వెళ్ళేసరికి అక్కడ స్నేహితుడు ఆనంద్ ఉంటాడు కాలేజి ఎన్నికల్లో గెలిచిన విజయ్ తమ్ముడు రాజేష్‌ను స్ట్రైక్ సందర్భంగా పేరు మోసిన రౌడీ రంగా చంపేస్తాడు రంగా తండ్రి చిదంబరం కోర్టులో సాక్ష్యాల్ని తారుమారుచేసి కేసు కొట్టేయిస్తాడు ఆనంద్ ఇచ్చిన సమాచారం మీద విజయ్ చిదానందానికి చెందిన గంజాయి లారీని పట్టుకుంటాడు, గంజాయి స్థావరాన్ని కనుక్కునేందుకు అడవిలోకి వెళ్తాడు విజయ్

ఆమెను తను ప్రాణాపాయం నుంచి కాపాడాడు అందుకు కృతజ్ఞతలు చెప్పాల్సింది పోయి, ఆమె భయపడుతూ తన కాళ్ళ మీద పడిందంటే ఏదో అనుమానం ప్రవేశించింది విజయ్ మనస్సులోనికి

ఆమెను లేవ నెత్తుతూ 'చూడమ్మా మనుషుల్ని ఆపదల్లోంచి కాపాడే వాడినే కాని చంపే వాడిని కాదు అన్నాడు

కాని ఆమె ఏడుపు నాపలేదు

'ఆపు అంటూ గద్దించాడు విజయ్

రక్కున నోరు మూసింది ఆ గిరిజన యువతి

నేను నిన్ను చంపుతానని ఎలా అనుకొన్నావు?'

మమ్మల్ని చంపటం మీ కలవాటేగా ఇప్పటికి నలుగురు మగవారిని చంపారు ముగ్గురు యువతుల్ని ఎత్తుకుపోయారు అలాంటి వారు నన్నెందుకు వదిలి పెడతారు

అంటే నన్నుగాక ఇంకా ఎవరినైనా నాలాంటి వార్ని చూశావా నువ్వు? ప్రశ్నించాడు విజయ్

మీరు ఆ కొండ క్రింద ఉండే వాళ్ళు కాదా అడిగింది ఆ యువతి ఆశ్చర్యంగా

'కాదు వార్ని పట్టుకోవాలని వచ్చిన పోలీస్‌ను' చెప్పాడు విజయ్

వారు ఎక్కడున్నారో చూపిస్తావా? వారి పీడ మీకు విరగడయ్యేటట్లు చేస్తాను

ఓ! నా వెంట రండి అంటూ ముందుకు నడచింది ఆ యువతి

అనుసరించాడు విజయ్

అలా కొంత దూరం తీసుకెళ్ళి ఒక చెట్టు క్రింద ఆగింది ఆ గిరిజన యువతి

"అలా చూడండి దొరా అవే వారి గుడిసెలు అంటూ ఒక దిశగా చూపించింది

ఆమె చూపించిన దిశగా చూసి ఉలిక్కిపడ్డాడు విజయ్

అక్కడ

దాదాపు పది గుడిసెలు ఉన్నాయి ఆ గుడిసెల ముందు దాదాపు 20 మంది స్త్రీ పురుషులు కూర్చొని ఉన్నారు ఆ గుడిసెల వెనుకగా గంజాయి మొక్కలు కనిపించాయి

'థాంక్స్ అమ్మా అన్నాడు విజయ్

"సరే ఇక నువ్వెళ్ళు అంటూ ఆ యువతిని పంపి వేశాడు విజయ్

వైర్‌లెస్ ఆన్ చేశాడు విజయ్

హల్లో సర్ నేను విజయ్‌ను మాట్లాడుతున్నాను ఇక్కడ గంజాయి మొక్కలు పెంచే చోటును కనిపెట్టాను నేను అంటూ ఆ చోటు వివరాలు చెప్పాడు విజయ్

'అర్జంటుగా మీరు బలగాన్ని వెంట పెట్టుకుని రండి మొత్తాన్ని ఒక్కసారే పట్టుకోవచ్చు' చెప్పాడు విజయ్

ఓ కే అరగంటలో అక్కడుంటాము ' డిస్కనెక్ట్ చేశాడు నందనరావు

అరగంట చేసేదేమీ లేక వార్ని కనిపెడుతూ ఉండి పోయాడు విజయ్

అరగంట గడిచింది

ఇంతలో –

ఒక హెలికాప్టర్ వచ్చింది అక్కడికి హెలికాప్టర్ దారి చూపిస్తుండగా రెండు పోలీస్ వాన్లు, ఒక జీప్ వచ్చి ఆగాయి అక్కడ

హెలికాప్టర్ లాండయింది

అందులోంచి కమీషనర్, ఎస్ పి నందనరావులు దిగారు

ఇదంతా చూస్తూ అయోమయంగా ఏమీ అర్థం గాక నిలబడిపోయారు జాన్, డేవిడ్, తదితర అనుచరులు

కమీషనర్‌ను, ఎస్ పి ని చూడగానే చేయి ఊపాడు విజయ్

ఇదే సార్ ఆ స్థావరం వీరందరినీ అరెస్ట్ చేయండి అన్నాడు విజయ్

జాన్, డేవిడ్‌లతో సహా అక్కడున్న వారందరినీ అరెస్ట్ చేశారు పోలీసులు

కమీషనర్ అభినందించాడు విజయ్‌ను

★ ★ ★ ★ ★ ★ ★ ★

నిప్పు తొక్కిన కోతిలా చిందు లేస్తున్నాడు చిదానందం

ఎలా జరిగింది ఇది? ఎంత ఆలోచించినా అర్థం కావటం లేదు అతనికి

సడన్‌గా పోలీసులు దాడి చేసి గంజాయి మొత్తాన్ని పట్టుకొన్నారు' అని వినగానే చేష్టలుడిగిపోయాయి చిదానందానికి

కాని ఒక్కటే సంతోషంగా ఉంది అతనికి ఎంత అడిగినా, ఎంత ప్రయత్నించినా జాన్, డేవిడ్‌లు నోరు విప్పటం లేదు గంజాయి అంతా తమదే అని చెపుతున్నారు కాని ఇంకేమీ చెప్పటం లేదు వారు అదే అతనికి ఆనందంగా ఉంది

అర్జంటుగా అనుచరులందరినీ పిలిపించాడు చిదానందం

ఫ్రెండ్స్ ఇంత సడన్‌గా విజయ్ దాడి చేశాడంటే ఇందులో ఎవరిదో మన హస్తం ఉన్నట్టుంది అన్నాడు అనుమానంగా అందర్నీ చూస్తూ

అనుచరులందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకోసాగారు

అంటే నీ ఉద్దేశ్యం అడిగాడు ఆనంద్

మనలో ఎవరో నా సీక్రెట్స్‌ను బయటకు చేరవేస్తున్నారన్నమాట?

ఎవరని నీ ఉద్దేశ్యం?

తెలుస్తే?

ఒక్కొక్క అనుచరుణ్ణి పరిశీలనగా చూశాడు చిదానందం

వీరందరూ చాలా కాలంగా నా ఉప్పు తింటున్న వాళ్ళు వీళ్ళు నాకు ద్రోహం తలపెట్టరు

'వాట్డూయు మీన్

"ఎస్ ఈ మధ్య నువ్వు రెండు మూడు సార్లు ఇనస్పెక్టర్ విజయ్‌కుమార్‌ని కలుసుకొన్నావని తెల్సింది ఎందుకు

"చిదానందం అది నా పర్సనల్ విషయం '

"ఆనంద్ అది నీ పర్సనల్ విషయం కావచ్చు కాని నేను నీ పార్ట్‌నర్‌ను అది నాకు తెలిసి తీరాలి

అయితే విను విజయ్ నేను చాలా కాలంగా ఫ్రెండ్స్‌ము అందుకని కల్సుకోవటానికి వెళ్ళాను అంతే

అంతేనా లేక '

'మిస్టర్ చిదానందం అయామ్ నాట్ యువర్ సబార్డినేట్ నేను కూడా నీతో సమానమైన వాడినే నువ్వు నన్ను గుచ్చి గుచ్చి ప్రశ్నలు వేయటంలో నీ ఉద్దేశం అన్నాడు కోపంగా ఆనంద్

'కోప్పడకు ఆనంద్ మన వృత్తే అలాంటిది నేను నా వృత్తిలో నా కన్నకొడుకునే నమ్మను

బైది బై ఎలాగయినా సరే ఆ విజయ్ ఆట కట్టించాలి లేకుంటే మన ఆటలు సాగవు,"అన్నాడు చిదానందం

* * * * * * * *

ఆ ఇంటి ముందు కారు ఆగింది

కారులోంచి నందనరావు, సుమిత్రమ్మ దిగారు ఇంట్లోకి ప్రవేశించారు

వార్ని చూస్తూనే "రండి అన్నయ్యగారు" అంటూ ఆహ్వానించి వారికి కుర్చీలు చూపించింది సుందరమ్మ

ఇప్పుడిప్పుడే సుందరమ్మ కొద్దిగా తేరుకొంటూంది అదంతా సుమిత్రమ్మ కృషే అని చెప్పవచ్చు సుమతి కూడా మళ్ళీ మామూలుగానే కాలేజీకి వెళుతోంది

"ఇలా కూర్చొని ఉండండి కాఫీ తీసుకొస్తాను" అంటూ వంటింట్లోకి పోబోయింది సుందరమ్మ



## ఆశయం

"ఇప్పుడెందుకులెమ్మా కాఫీ" అన్నాడు నందనరావు.

"ఫరవాలేదులే అన్నయ్యా" అంటూ ఐదు నిముషాల్లో కాఫీ తయారు చేసుకొని వచ్చింది సుందరమ్మ

"చూడమ్మా అశుభం జరిగిన ఇంట్లో వెంటనే శుభం జరిగితే అతని ఆత్మ శాంతిస్తుందంటారు అందుకని వెంటనే అమ్మాయికి పెళ్ళి చేద్దామని అనుకొంటున్నాము"అంది సుమిత్రమ్మ

"నాదేముంది వదినా అంతా అబ్బాయి ఇష్టమేగా. అబ్బాయి చేసుకుంటానంటే చేసెయ్యండి' అంది సుందరమ్మ.

అంతలో..

విజయ్ రానే వచ్చాడు.

"అదుగో అబ్బాయి వస్తున్నాడు. అబ్బాయినే అడగండి." అంది సుందరమ్మ.

"హల్లో సార్ ఏంటిలా వచ్చారు?" అడిగాడు విజయ్.

"ఏమిటోయ్ ఇంకా సారేనా? మామగారు అని పిలవలేవు?" అన్నాడు నందనరావు నవ్వుతూ

"బాబూ నీ పెళ్ళి చేసెయ్యాలని నిర్ణయించుకొన్నారు మామయ్య" అంది సుందరమ్మ

"ఇప్పుడా?"

"అవును "

"సరే మీ ఇష్టం" అన్నాడు విజయ్

"సరే బాబూ త్వరలో ముహూర్తం నిర్ణయించి తెలియచేస్తాను. మేమిక వెళ్ళి వస్తామమ్మా" అంటూ లేచారు నందనరావు, సుమిత్రమ్మలు

* * * * * * * *

"ఓహో అప్పుడే అమ్మాయి గార్కి పెళ్ళి కళ వచ్చిందే!"

"రాదా మరి? అబ్బాయి గారు పెళ్ళికి అంగీకరించారు కదా!"

పార్కులో ఒకచోట సిమెంట్ బెంచీపై కూర్చుని ఉన్నారు విజయ్, నర్మదలు.

"పెళ్ళికి అంగీకరించకపోయి ఉంటే ఏం చేసే వారు?" అన్నాడు విజయ్.

"ఏం నువ్వు అంగీకరించకుంటే ఆంధ్రదేశమే గొడ్డు పోయిందా? మగాళ్ళకే కరువొచ్చిందా? నాకు మొగుడే దొరకడా?"

"అవునులే ఆడవారి ప్రేమే అంత!"

"అంటే ఎంత మంది ఆడవార్ని చూశావు ఇప్పటికి?"

"నేను థియరీ చెబుతున్నాను. ప్రాక్టికల్ చెప్పటం లేదు" అన్నాడు విజయ్ నవ్వుతూ

అప్పటికి చీకటి పడ్డది




"పద చాలా టైమయింది' అంటూ లేచాడు విజయ్ నర్మద కూడా లేచి నిలబడింది

* * * * * *

ఆ రోజు రాఖీ పండుగ.

రాఖీ పండుగ ఎక్కువగా ఉత్తర భారతంలో ముఖ్యంగా ఆంధ్రాలో తెలంగాణాలో జరుపుకొంటారు.

రాఖీ పండుగని అన్నా చెల్లెళ్ళ పండుగని అంటారు. పండుగ రోజు ప్రతి చెల్లెలు అన్నల చేతికి రాఖీ కట్టి తమ కోర్కెలు తీర్చుకొంటారు.

విజయ్, ఆనంద్ లిద్దరూ విజయ్ ఇంటి దగ్గర కూర్చొని కబుర్లాడుకొంటున్నారు విజయ్ ఆలోచనలన్ని ఆ నాడు జరిగిన బాంక్ దోపిడీ గురించే ఆలోచిస్తున్నాడు ఇంత వరకూ పరిశోధిస్తున్నా ఇంకా ఎటువంటి క్లూ దొరకలేదు

ఆ విషయమే ఆనంద్‌తో అంటున్నాడు విజయ్

సలీమ్, జావేద్‌లు అనే పేర్లు తప్ప ఇంక ఏ విషయమూ తెలియలేదు అన్నాడు విజయ్

సలీమ్, జావేద్ ఆ పేర్లు ఎక్కడో విన్నట్లు అనిపించింది ఆనంద్‌కు

"ఎక్కడ" ఆలోచనలో పడ్డాడు ఆనంద్

గుర్తుకొచ్చింది ఆనంద్‌కు.

ఆ రోజు ఎయిర్‌పోర్టులో పోలీస్ ఇన్‌స్పెక్టర్ వేషంలో తనను చెక్ చేసింది సలీమే.

అంటే దీని వెనుక పెద్ద గాంగే ఉంది అన్నాడు ఆనంద్

"అవును" అన్నాడు విజయ్

ఆనంద్ ఆలోచనలో పడ్డాడు. సలీమ్, జావేద్ లెవరో ఎంత ఆలోచించినా అర్థం కాలేదు ఆనంద్‌కు దాదాపు నగరంలో ఏ దోపిడీ జరిగినా, ఏ హత్య జరిగినా చిదానందంకి తెలియకుండా జరుగదు సలీం, జావేద్ లనే వారు ఎవరూ చిదానందం గాంగ్‌లో లేరు ఇదేదో వేరే ఇంకో గాంగ్ లాగుంది

ఏమిటి ఆనంద్ ఆలోచిస్తున్నావు?"

"ఏం లేదు... ఏం లేదు..."

"హల్లో అన్నయ్యా" అంటూ వచ్చింది నర్మద "హల్లో గుడీవినింగ్" అన్నాడు ఆనంద్.

"ఏదీ నీ చెయ్యి చాపు" అంది నర్మద

"ఎందుకమ్మా?"

"ముందు చాపు."

చాపాడు తన కుడి చేతిని ఆనంద్

చాపిన ఆ చేతికి రాఖీ కట్టింది నర్మద.

"రాఖీ పండుగ కదా! నాకు అన్నయ్యలు ఎవరూ లేరు. నువ్వు గుర్తుకొచ్చావు. నువ్వు ఎక్కడుంటావో కనుక్కొందామని వచ్చాను. అదృష్టవశాత్తు నువ్వే కలిశావు" అంది నర్మద.

"అయితే ఈ అన్నయ్య నుండి నువ్వు ఏం కోరుకుంటున్నావో కోరుకో వెంటనే తీర్చేస్తాను." అన్నాడు ఆనంద్

"అడిగేయ్ నాలుగు చీరెలు, రెండు నెక్లెస్‌లు" అన్నాడు విజయ్ హాస్యంగా

"నాకేం వద్దులే చీరెలు, నగలు. అవసరం వచ్చినప్పుడు కోరతాలే. అప్పుడు తీర్చుదువు గాని" అంది నర్మద.

"వచ్చే నెల 20 వ తేదీ మా పెళ్ళి. తప్పక రావాలి ప్రస్తుతానికి ఇదే నా కోరిక" అంది నర్మద.

"రేయ్ రాస్కెల్ పెళ్ళి ఖాయం అయితే ఆ విషయం ఇంత వరకు నాకు చెప్పలేదేమిరా?" అంటూ విజయ్ వీపు మీద చరిచాడు ఆనంద్.

"మీ చెల్లెలు చెప్పిందిగా చాలదా?" అన్నాడు విజయ్.

* * * * * * * *

"చిదానందం... చిదానందం."

"ఏమిటి ఆనంద్."

"ముసుగు మనిషి అంటే ఎవరో నీకు తెలుసా?"

"ముసుగు మనిషా? వాడెవడు" అన్నాడు చిదానందం ఉలిక్కిపడి.

## ఆశయం

"పాత పేపర్లు చూస్తుంటే ముసుగు మనిషి అని కన్పించింది ఎవరో నీకు తెల్సేమోనని '

ఏమో? అన్నాడు చిదానందం

"మన మాదిరే ఇంకో గాంగ్ అయ్యుండచ్చు '

'అంతే అయ్యుంటుంది '

★ ★ ★ ★ ★ ★ ★ ★

'సలీమ్ జావేద్

యస్ బాస్ "

మొన్న జరిగిన బాంక్ దోపిడీని ఇనస్పెక్టర్ విజయ్‌కుమార్ పరిశోధిస్తున్నట్లు తెల్సింది జాగ్రత్తగా ఉండండి

'అతను మనల్నేమి చేస్తాడులే

"నో నో కేర్‌లెస్ వద్దు చిన్న పామునైనా పెద్ద కర్రతో కొట్టమన్నారు ఒక విషయం బైట పడిందంటే ఇంక అన్నీ విషయాలు బయటకు వస్తాయి కాబట్టి

కాబట్టి

'వాడు మన విషయం కనుక్కునే లోపుగనే వాణ్నే మనం అడ్డు తొలగించుకోవాలి

ఎలా?

'దానికి నేనొక ప్లాను ఆలోచించాను' అన్నాడు ముసుగు మనిషి

★ ★ ★ ★ ★ ★ ★ ★

విజయ్ సలీం, జావేద్ లెవరో తెల్సిందా?'

'ఇంకా తెలియలేదు త్వరలో నే తెల్సుకుంటాను.

"ఇదివరకు పేపర్లో ముసుగుమనిషి అని పడింది ఆ ముసుగుమనిషికి ఈ సలీం జావేద్‌లకు ఏదో సంబంధముందని నా అనుమానం" అన్నాడు ఆనంద్.



"థాంక్యూ" అన్నాడు విజయ్.

★ ★ ★ ★ ★ ★ ★ ★

విజయ్ పెండ్లికి కావాల్సిన ఏర్పాట్లన్నీ చేసుకోసాగాడు.

ఇంకా పెండ్లి 15 రోజులుంది

ఈ పదిహేను రోజులు సెలవు పెట్టమన్నారు నందనరావుగారు

కాని పెళ్ళి తరువాత ఎలాగూ సెలవు పెట్టాలి. అప్పుడు పెట్టొచ్చులే అని సెలవు పెట్టలేదు విజయ్

విజయ్ పోలీస్ స్టేషన్లో కూర్చొని ఉన్నాడు

అప్పుడు సమయం ఉదయం 11 గంటలు కావస్తోంది

ట్రింగ్ ట్రింగ్ ఫోను మ్రోగింది

రిసీవరెత్తాడు విజయ్

'హలో

హలో పోలీస్ స్టేషనేనా? అంటూ ఆదుర్దాగా వినిపించిందో స్త్రీ కంఠం అవతలి వైపు నుంచి

యస్. ఇనస్పెక్టర్ విజయ్ కుమార్ స్పీకింగ్

అవతలి స్త్రీ చెబుతున్న మాటలు విన్న విజయ్ మొఖంలో రంగులు మారాయి

వెంటనే వస్తున్నాను 5 నిముషాల్లో అక్కడ ఉంటాను అంటూ రిసీవర్ క్రెడిల్ చేసి త్వర త్వరగా బయలుదేరాడు విజయ్

స్టేషన్ బయటనున్న జీప్ ఎక్కి స్టార్ట్ చేశాడు జీపు దూసుకు పోయింది.

ఫోనులో యువతి చెప్పిన అడ్రస్ మననం చేసుకొంటూ జీప్ డ్రైవ్ చెస్తున్నాడు విజయ్

ఐదు నిముషాలలో జీప్ ఒక బిల్డింగ్ ముందు ఆగింది

ఆ పేటలో చివరగా, ఒక ప్రక్కగా ఉంది ఆ బిల్డింగ్ తలుపులు తెరిచే ఉన్నాయి

జీప్ దిగి ఆ బిల్డింగ్‌లోనికి అడుగు పెట్టాడు విజయ్

బిల్డింగ్ లోపల తలుపులన్నీ తెరిచే ఉన్నాయ్ ఎటువంటి అలికిడి విన్పించటం లేదు. అంతా నిశ్శబ్దంగా ఉంది.

లోపలి గదిలోకి అడుగు పెట్టాడు విజయ్

ఆ గది ప్రక్కనే బెడ్‌రూమ్ ఉంది

బెడ్‌రూమ్‌లోనికి అడుగు పెట్టిన విజయ్, ఎదురుగా కన్పించిన దృశ్యాన్ని చూసి కొయ్యబారి పోయాడు

ఎదురుగా

బెడ్‌పై అస్తవ్యస్తంగా ఒక యువతి, యువకుడు బోర్లా పడుకొని ఉన్నారు

వారిని వెల్లకిలా త్రిప్పాడు విజయ్

అంతే! ఆశ్చర్యంతో ఆఁ అంటూ నోరు తెరిచాడు విజయ్

ఆ యువతి, యువకుల పొత్తి కడుపులో నుంచి రక్తం ధారాపాతంగా కారుతోంది ఎవరో కత్తితో బాగా గాయపరిచి చంపారు అది జరిగి ఎంతో సేపు కాలేదన్నట్లుగా ఇంకా వారి శరీరాల నుంచి రక్తం కారుతోంది

వారిద్దరి వయస్సు 25 సం రాల లోపు ఉంటుంది నూతన దంపతుల్లా ఉన్నారు

ఇంతలో

ధబ్ మనే శబ్దంతో తలుపులు మూసుకొన్న శబ్దం వినిపించింది

ఉలిక్కిపడి కంగారుగా మెయిన్ డోర్ దగ్గరికి వచ్చాడు విజయ్

కాని అప్పటికే తలుపులు మూసి ఉన్నాయి

కంగారుగా తలుపులు తట్టాడు విజయ్

కాని తలుపులు తెరుచుకోలేదు

కంగారుగా బిల్డింగ్ అంతా వెతికాడు బయట పడేందుకు మార్గం కోసం

కాని ఎక్కడా దారి కనిపించలేదు

ఓ! గాడ్ తెలివిగా ఇరికించారు" అనుకొన్నాడు విజయ్

వెనుకకు వెళ్ళి ఆ శవాలను పరీక్షించాడు విజయ్

ఎటువంటి ఆధారం కనిపించలేదు హంతకులు ఎవరో చాలా తెలివిగా హత్య చేయటమే గాక, తనను తెలివిగా ఇరికించారు. (ఇంకా ఉంది)

# 15 బహుమతులను గెలవండి




## మెజెస్టిక్®

మీ కూపన్ నేడే పొందండి.
పండుగ బహుమతుల పథకంలో చేరండి.

**లక్కీ డ్రా :**
**ప్రతినెలా 15వ తేదీన.**
**స్థలం:మహావీర్ కంబైన్స్**
**హైదరాబాదు. ఫోను. 231198**




అన్ని మెజెస్టిక్ ప్రెషర్ కుక్కర్లకు
పండుగ బహుమతి కూపన్ వుంది.
బహుమతి పొందే కూపన్ మీదే
కావచ్చు. మీకు చేరువలో వున్న
డీలర్ నుండి వివరాలు పొందండి.

## మెజెస్టిక్®
ప్రెషర్ కుక్కర్

సొమ్ము విలువకు తగ్గ ప్రెషర్ కుక్కర్

ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్స్ : మహావీర్ కంబైన్స్, కంచన్ జంగ కాంప్లెక్స్, కింగ్ కోఠి రోడ్, హైదరాబాద్-1. ఫోన్ : 231198, 235856
అన్ని ప్రఖ్యాత దుకాణములలో లభించును.

# వారసత్వం

స్వాతికుచ్చి
వెంకట సూర్యసత్యప్రసాద్

స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులు ఎలాగయినా భరతమాత శృంఖలాలను తెగకొట్టడానికి ప్రజలంతా కృషి చేస్తున్న రోజులు కుల మతాల పంతాలు వదలి దేశ దాస్య విముక్తి దీక్షలో అందరూ ఏక త్రాటిపై పయనిస్తున్న రోజులు

శ్రీరంగపురంలో నీలకంఠశాస్త్రిగారి ఇంటిలో కూడ ఉద్యమ గంటలు మ్రోగిన క్షణం

ఆరోజు మధ్యాహ్నం ఎవరో కొంతమంది స్వాతంత్ర్య సమరయోధులు ఆ గ్రామంలో జన జాగరణ కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు ఈ కార్యక్రమానికి ముందుగానే ఈ గ్రామం ఎన్నుకోడంలో కారణం లేకపోలేదు ప్రతీమారు మూల గ్రామం నుండి ఒక్కడైనా నడుం కట్టి ఉద్యమంలో చేరారు కాని శ్రీరంగపురం మాత్రం ఇంకా నిద్రావస్థలోనే ఉంది అందుకనే జన జాగరణ కార్యక్రమానికి ఈ గ్రామం ఎన్నుకున్నారు

ఉపన్యాసాలు జోరుగా సాగుతున్నాయి ప్రజల ముఖాలు రక్తాన్ని చిందిస్తున్నట్టుగా ఉన్నాయి ఓ భరతమాత బిడ్డలారా! ఈ దేశం మనది మన పూర్వులు మన కిచ్చిన వారసత్వ సంపద ఈరోజు మనం అశ్రద్ధ చేసి దేశాన్ని వదిలి పెడితే రాబోయే తరాలవారు అనుభవించే దుస్థితి ఎట్లా ఉంటుందో మీరే ఊహించుకోండి మన ధర్మం, మన సంస్కృతి పతనమైన రోజున మన బ్రతుకులే నడి బజారులో పడతాయి ఈ దేశం పరుల హస్తగతం అయ్యాక మనం చేసేదేమిటి? మన ప్రాచీన మునులు మనకు అప్పజెప్పిన వేదాలు, శాస్త్రాలు, ధర్మాలు భావి తరానికి జ్ఞానదీపికలై దారి చూపాలి అనుకుంటే మీరంతా ముందుకు రండి' అన్న ఓ యోధుని ఉపన్యాసం నీలకంఠశాస్త్రిగారి గుండెల్లో గ్రుచ్చుకుంది

నిజమే. ప్రతి ఒక్కడు తన కేమి పట్టనట్టు నిర్లిప్తతగా ఉంటే ఈ దేశం ఏం కావాలి? ఇన్ని తరాలుగా వస్తున్న తన కుటుంబంలోని వేద వారసత్వం నశించిపోతే నేనేం చేయాలి? వద్దు వద్దు అలా కాడానికి వీల్లేదు ముందుగా నా దేశాన్ని రక్షించుకోవాలి ఆ తరువాతే ఈ వేద ధర్మం ఇదే పట్టుదల శాస్త్రిగారిలో పెరిగింది.

* * * * * * *

ఐదు రోజుల తరువాత శ్రీరంగపురంలో జాతీయ జెండా ఎగుర వేయడానికి రంగం సిద్ధమైంది ఊరంతా నిషేధాజ్ఞలు విధించబడ్డాయి రక్షక భటులు ఊరంతా తిరుగుతున్నారు ఎలాగయినా జెండా ఎగురవేయాలి

నీలకంఠశాస్త్రిగారిలో పట్టుదల పెరిగింది రక్షక భటులను చూసేసరికి అంతవరకు తన వెనక ఉన్న జనం చల్లగా జారుకున్నారు. ఐనా ఇంకా శాస్త్రి ఏకాకి కాలేదు తనను నమ్ముకునే కాళిదాసనే ఒక శక్తి తన వెనకాలే ఉందన్న ధైర్యం శాస్త్రిగారిలో పోలేదు తెల్లవారితే అనుకున్న కార్యక్రమం జరిగి తీరాలి రాత్రి పన్నెండు గంటలవుతోంది జన సంచారం ఎక్కడా లేదు. రక్షక భటులు కూడా మెల్లగా నిద్రలోకి జారుకున్నారు. అదే సమయంలో నీలకంఠయ్యగారు అడుగులో అడుగు వేసుకుంటూ హరిజనవాడకు బయలు దేరారు. అదే సమయంలో ఇంకో ఆకారం అడుగులో అడుగు వేసుకుంటూ హరిజనవాడనుండి అగ్రహారంలోకి వస్తోంది. సరిగా ఇద్దరు గోపాలస్వామి గుడి వరకు వచ్చారు

'కాళీ!" శాస్త్రిగారి కంఠం ఖంగుమంది

"చిత్తం! నేనూ మీ గురించే వస్తున్నానండీ కాళిదాసు సమాధానం చెప్పాడు

'కొంప మునిగిందిరా కాళీ' అందరూ నెమ్మదిగా జారుకున్నారు!"

'ఐతే మాత్రం ఏమయింది సామీ' రేపు పది గంటలకు జండా కట్టవలసిందే "

'మన మిద్దరమే అయిపోయాము గదరా!

'శాత్రి గారు మీరు కూడా అట్టాగంటే ఎట్టాగండి? మీరు ఊఁ అనండి అంతే"

'మరి తరువాత పడే శిక్ష గురించి ఆలోచించావురా?

"అలాంటి వన్నీ ఆలోచిత్తే ఇలాంటి పనులు చేయలేమండి!' స్థిరంగా జవాబిచ్చాడు కాళిదాసు

శాస్త్రి గారికి కూడ కొంతంత ధైర్యం వచ్చింది ఇద్దరూ కాసేపు ఏదో గుసగుస లాడుకున్నారు

* * * * *

జండాకట్టే సమయం సమీపిస్తోంది గ్రామం అంతా గంభీరంగానుంది రక్షక భటులు వాహనాలలో తిరుగుతున్నారు. గ్రామ కార్యాలయం ముందు జనం గుమిగూడి ఉన్నారు. అసలుజండా ప్రతిష్ఠ జరుగు తుందా అన్న అనుమానం అందరిలోను ఉంది. ఇంతలో ఓ గుఱ్ఱపు బండి అటుగా వస్తోంది రక్షక భట వాహనం ఒకటి ఆ బండిని ఆపు చేసింది లోపలివాళ్ళు కనిపించకుండా బండికి రెండు వైపులా తెరలు కట్టబడి ఉన్నాయి శాస్త్రిగారు బండి వెనకాలే విషణ్ణ వదనులై నడుస్తున్నారు.

'ఎక్కడికి?" వాహనం లోంచి దిగిన ఓ పోలీసు గద్దించాడు

'క్షమించాలి నా భార్యకు పురుడు వచ్చే సమయం ఆమె పరిస్థితి చాలా విషమంగా ఉంది వెంటనే ఆసుపత్రికి తీసికొని వెళ్ళాలి' కంగారుగా బొంగురు పోయిన కంఠంతో సమాధానం చెప్పారు శాస్త్రిగారు

ఇంతలో బండి లోపలి నుండి గాజుల సవ్వడి వినిపించింది ఏదో మూలుగు కూడా ఎక్కువయింది తెరల కిందనుంచి చీర కదలికలు కూడా బాగా కనిపించాయి

రక్షక భటులు వెంటనే నమ్మేసారు సరే బండిని తొందరగా పోనివ్వండి ' అని హెచ్చరించి తమ దారిని వెళ్ళిపోయారు

సరిగా బండి గ్రామ కార్యాలయం దగ్గరకు వచ్చి ఆగింది బండిని అనుసరిస్తున్న శాస్త్రిగారు పై మీది ఖండువా తీసి నడుం చుట్టూరా గట్టిగా కట్టుకున్నారు ఏదో గొప్ప సాహసం చేస్తున్న సంతోషం ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది

"కాళిదాసూ! కిందకు దిగు ' అని గద్దించారు శాస్త్రిగారు అప్పటికి సమయం సరిగా పది గంటలయింది

చీరకట్టుకొని బండిలో కూర్చున్న కాళిదాసు ఒక్కసారి కిందకి ఉరికాడు రక్షణకై కట్టుకున్న వస్త్రాలు ఊడదీసాడు జండా పట్టుకొని ప్రళయ కాల రుద్రుడిలా ఉన్నాడు కాళిదాసు భారత్ మాతకీ! జై!' అన్న శాస్త్రిగారి కంచుకంఠం చుట్టూ మారు మ్రోగింది చుట్టూరా ఉన్న జనం కూడా ఉద్రేకంతో శాస్త్రి గారి గొంతుతో గొంతు కలిపి బిగ్గరగా జై అన్నారు. ఈ శబ్దం అక్కడే తిరుగుతున్న రక్షక భటుల పై పిడుగు పడ్డట్టయింది లాఠీలు ఆడించుకుంటు దూరం నుండి పరిగెత్తుకుంటూ వస్తున్నారు వారి రాకను గమనించిన జనం పరిగెత్తారు కాళీ జండా పట్టుకొని అప్పటికే అక్కడ ఉన్న ఓరాతిస్థంభం పైకి పాకుతున్నాడు శాస్త్రిగారు రెండు చేతులు చాపి కాళీకి రక్షణగా ఆ స్తంభం చుట్టూ తిరుగు తున్నారు

"వందేమాతరం! వందేమాతరం!" అంటూ బిగ్గరగా అరుస్తు కాళిదాసు స్తంభంపై జండా కట్టేస్తున్నాడు యమ భటుల్లాంటి రక్షక భటులు ఆ ప్రదేశానికి పరుగు పరుగున వచ్చారు. అప్పటికే కాళిదాసు జండా కట్టేసాడు లాఠీ దెబ్బలు శాస్త్రి గారి దబ్బపండులాంటి శరీరంపై ధబధబా పడుతున్నాయి "వందేమాతరం!" అంటూ క్రిందపడి దొర్లుతున్నారు ఆ స్తంభం పై నుండి ఒకే ఉరుకుతో క్రింద ఉన్న రక్షక భటులపైకి ఉరికాడు కాళీ శాస్త్రి గారిని వదలి ఆ దౌర్భాగ్యులు కాళిదాసుని చుట్టు ముట్టారు ఇద్దరి శరీరంపై ఎన్ని

దెబ్బలు పడ్డాయో లెక్క లేదు. అప్పటికే పోలీస్ వేన్ అక్కడికి వచ్చింది ఇద్దరినీ గొలుసులతో బంధించి అందులో వేసుకొని తీసుకు పోయారు

తగిలిన దెబ్బలకు విలవిలలాడి కాళిదాసు జైలులోనే కన్ను మూసాడు ఏనుగు లాంటి శాస్త్రి గారు పీనుగులా బైటకు వచ్చారు తరువాత కూడ చాలా కాలం స్వాతంత్ర్యోద్యమంలో తిరిగారు శాస్త్రిగారి అదృష్టమా అన్నట్టుగా దేశానికి స్వాతంత్ర్యం లభించింది తన వేదాలకి, తన ఆ చారాలకి ఎటువంటి ఆటంకము ఇక ముందు ఉండదన్నట్టుగా స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకున్నారు

ఈదీర్ఘ ఆలోచనల నుండి శాస్త్రిగారు ఈలోకంలోకి వచ్చారు వారం పదిరోజుల నుండి ఆరోగ్యం అంతంత మాత్రంగానే ఉంది అనారోగ్యానికి సాయం తన తోటే ఈ వేదం తన ఇంట్లో అంతమై పోతోందన్న దిగులు. ఎన్ని తరాలనుండో ఈ వేద సంస్కృతి తన ఇంట్లో అనూచానంగా వస్తూనే ఉంది తన తండ్రిగారు ఈవేదాన్ని అహోరాత్ర పారాయణ చేసి గొప్ప గౌరవాన్ని పొందినట్టు తనకు తెలుసు ఈ వైదికంలో కూడా శాస్త్రి గారివి అభ్యుదయ భావాలే విదేశీ దురాక్రమణ శాస్త్రిగారి గుండెలపై భయంకరమైన ఆలోచనలకి దారితీసింది తన తండ్రి కాదన్నా, తన భార్య అన్నపూర్ణ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నా వినకుండా స్వాతంత్ర్యోద్యమంలోకి ఉరికారు. తనకు చేతనైనంత సేవ ఈ దేశమాతకు చేయాలనుకున్నారు అలాగే చేశారు గ్రామ గ్రామానా ఈ ఉద్యమంలో తిరగడంలో అభు...

భావాలు బాగా నాటుకు పోయాయి ఈలోకం అంతా ఈ వేదం చదువు కున్న వాళ్ళ మూలంగానే ఉందన్న భేషజాలను దూరం చేసారు. భౌతిక వాదం వైపు మొగ్గుతున్న ఈలోకంలో వేదం యొక్క పాత్ర చాలా ఉన్నదన్న యదార్థాన్ని అదేసమయంలో గ్రహించారు రాను రాను ఈ ప్రాచీన సంస్కృతి ప్రజలకు దూరమై పోతుందని కూడా ఆయనకి తెలుసు ఇంత వరకు తన గృహంలో వేద సంస్కృతి తాండవించింది తన తరువాత ఏమై పోతుందో నన్న బెంగ నీల కంఠశాస్త్రి గారికి పట్టుకుంది.

★ ★ ★ ★ ★

నీలకంఠ శాస్త్రి గారికి ముగ్గురబ్బాయిలు, ఇద్దరమ్మాయిలు ఆడపిల్లలిద్దర్ని వేద పండితుల కిచ్చే పెళ్ళి చేసారు అంతవరకు ఆయన చేసినది బాగానే ఉంది కొడుకుల దగ్గరకు వచ్చేసరికి కొంచం తానే తప్పటడుగు వేసారేమో అని తపించి పోతూ ఉంటారు తన వలె తన పూర్వీకుల వలే కాకుండా పిల్లలని కాస్త లౌకిక విద్యలలో కూడా ప్రవేశింప చేస్తే తన కంటే కూడ ఈ లోకంలో లౌక్యంగా బ్రతక కలరనే ఉద్దేశ్యంతో పైవాళ్ళిద్దరికి శాస్త్రోక్తంగా అక్షరాభ్యాసాలు చేసి ఒకటో తరగతిలో చేర్పించారు. ఆధ్యాత్మిక విద్యల్లోనే కాకుండా లౌకిక విద్యల్లో కూడా శాస్త్రిగారి కొడుకులు అఖండు లన్నట్టుగా చదివి అందరికి ఆశ్చర్యాన్ని కలిగించారు అన్ని పరీక్షలలో సర్వ ప్రథములుగా ఉత్తీర్ణులయ్యారు. కాలంతో బాటు ప్రయాణం చేసే తత్వం శాస్త్రిగారిది వాళ్ళ చదువులకి ఆటంకం కలిగించలేదు ఇక తన మూడో కొడుకు రామ శాస్త్రికి వేదం చెప్పించాలనే నిర్ణయించు కున్నారు మామూలు గానే అక్షరాభ్యాసం చేయించి, ఏడు వరకు చదివించి తరువాత విఘ్నేశ్వర పూజ ప్రారంభిద్దామని ఊహించారు. ఇంతలో స్వాతంత్ర్య పోరాటం శాస్త్రిగారి జీవితంలో ఓ మలుపు ఇంటిపరిస్థితులపై శీతకన్ను మూడోవాడు ఆరో తరగతి ఒకటి రెండు సార్లు దండయాత్ర చేసాడు శాస్త్రిగారు వాడు తప్పినందుకు పెద్దగా బాధపడ లేదు వేదమాతే ఆవిధంగా చేసిందని తృప్తి పడి మంచిరోజున దేవాలయంలో పూజాది కాలు గావించి "ఓమ్ గణానాంత్వా గణపతిగం అహవామయే. ." అని కుఱ్ఱాడికి విఘ్నేశ్వర పూజ ప్రారంభించారు వేదం చదువు కోడమంటే మాటలు కాదు ఎంత కష్టపడి చదివితే ఆవేద విజ్ఞానం అలవడుతుందో తనకు తెలుసు

మూడోవాడు రామశాస్త్రిని వేదంలో పెట్టేడప్పుడు ఆయన ఒక్క సారి వెనక్కి తిరిగి చూసుకోవలసిన పరిస్థితి ఏర్పడింది

ఇక రెండు రోజులలో వేదాధ్యయనం ప్రారంభించబోతున్నారనగా రామశాస్త్రిని పిలిచి పరిస్థితి అంతా వివరించారు.

'బాబూ! అబ్బాయీ! నాతో ఈ వేదం అంతమై పోడానికి వీల్లేదు నీమూలంగా ఈ పవిత్ర విజ్ఞానం దశదిశలా వ్యాపించాలి. ఇప్పటికే చాలా కాలం వృథా అయింది. నీ అన్న లిద్దరూ ఊహించని విధంగా






ఇంగ్లీషు చదువులు చదువు కున్నారు అవిద్య మన ఇంటావంటా లేదు అయినా వాళ్ళ చదువులికి నేను అడ్డం రాలేదు నువ్వైనా ఇది చదివి ఎన్నో తరాల నుండి వస్తున్న ఈ వారసత్వాన్ని నిలబెట్టు నాయనా! సరే! రేపు ఉదయమే ముండనం చేయించుకొని, శిఖమాత్రం వెనకాల బాగా ఉండేటట్టు చూడు" ఎంతో ప్రేమాభి మానాలతో సలహా ఇచ్చారు శాస్త్రిగారు

ఒక్కసారిగా ముఖం పైకెత్తి తండ్రికేసి చూసి "నాన్నగారూ! గుండు గీయించు కొని పిలక పెట్టించు కుంటేనే కాని వేదం రాదా అని రామశాస్త్రి ప్రశ్నించాడు ఆ ప్రశ్నలో మార్దవం లేదు ఏదో అయిష్టత గోచరించింది నీలకంఠ శాస్త్రి గారికి ఒక్కసారిగా తల తిరిగి నట్టయింది ఈ విధంగా తన కొడుకు అడుగు తాడని ఊహించ లేదు

'రామశాస్త్రీ! రాదని కాదు వేదాధ్యయనం గురించి నీకు తెలియక పోవచ్చు శిఖ, యజ్ఞోప వీతము ఈ రెండు బ్రాహ్మడన్న వాడికి చాలా ముఖ్యాలు ముఖ్యంగా మనకి' ఇంతకంటే ఇంక ఏం చెప్పలేదు. కొడుకు ముఖంకేసి తీక్షణంగా చూసి లోపలికి వెళ్ళి పోయారు శాస్త్రిగారు

రామశాస్త్రి కూడ ఇంక ఏం మాట్లాడలేదు. మరునాడు తనకు అనుకూలంగానే వేషంలో మార్పు వచ్చి నందుకు నీలకంఠ శాస్త్రిగారు కొంతలో కొంత తృప్తి పొందారు

* * * * *

ఐదేళ్ళు నిరాఘాటంగా సాగిపోయాయి రామశాస్త్రి కూడా తండ్రి మాటలకు ఎదురు చెప్పలేదు కాని కొడుకు చిలిపి పనులు మాత్రం ఒక్కోసారి విసుగు కలిగించినా కాలధర్మం అని శాస్త్రిగారే సరిపెట్టుకు పోయేవారు యవ్వనంలోకి అడుగు పెట్టిన తన పుత్ర రత్నానికి వయసుతో బాటే కొన్ని భయంకర కోరికలు కూడ అలవడ్డా యన్న సంగతి చాలా కాలానికి కాని తెలియలేదు అప్పటికే ఆయన చెయ్యి జారిపోయాడు చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టయింది వేదాధ్యయ నంలో కూడా కొడుకు కాస్త అస్తవ్యస్తంగానే

## వారసత్వం

ఉన్నాడు.సమయానికి సంతలకి రాడు వల్లె వేయడంలో చాల తప్పులు దొర్లుతున్నాయి ఉదాత్తానుదాత్త స్వరితాలు సరిగా పలకటం లేదు

ఓరోజు వల్లె వేయమని చెప్పి నీలకంఠం గారు ప్రక్కఊరు వెళ్ళారు వెంటనే వద్దామనే బయలు దేరారు కాని వచ్చే సరికి కొంచెం ఆలస్యమయింది ఇంటిలో వేద ఘోష విని పించడం లేదు ఇంటిలో చూస్తే రామశాస్త్రి లేడు

"అన్నపూర్ణా! అబ్బాయి ఏడి? ఇంట్లోకి వస్తూనే ప్రశ్నించారు

"మీరు వెళ్ళిన వెంటనే బయటకు వెళ్ళాడు ఇంతవరకు రాలేదు అని సమాధానం చెప్పి లోపలికి వెళ్ళిందామె

నీలకంఠంగారు అచేతనులయ్యారు మహా సముద్రం నుండి ఓ పెద్ద కెరటం మీదపడి తనను ముంచేస్తోందా అనిపించింది వెంటనే దేవాలయాని కెళ్ళారు అక్కడా కనిపించలేదు దేవాలయం వెనక నుండి ఓ పోరంబోకు స్థలంలోనికి ఓ మార్గం ఉంది అదంతా పచ్చిక బీడు చాలా మంది పాలిగాళ్ళు అక్కడ తమ దూడల్ని మేపు కుంటారు పిచ్చిపాటీ కబుర్లు కూడ చెప్పుకుంటూ ఉంటారు శాస్త్రిగారు కొంత దూరం ఆమార్గం గుండా వెళ్ళేసరికి రామశాస్త్రి గొంతు వినిపించింది ఇంకొంచెం లోపలికి వెళ్ళారు రామ శాస్త్రి అక్కడే ఉన్నాడు మామూలుగా ఉంటే ఫరవాలేదు ఇంకో ముగ్గురితో కలిసి చీట్ల పేక ఆడుతున్నాడు ఆట మధ్యలో ఎదురుగా ఉన్న ఓ పాలిగాడు కాలుస్తున్న బీడీ ద్వారా తన బీడీ అంటించు కుంటున్న రామ శాస్త్రి తనకు పుట్టిన ఓ భయంకర మైన వ్యాధిలా కనిపించాడు తలవంచు కొని ఇంటికి వచ్చేసారు శాస్త్రిగారు

చీకటి పడే సరికి పెద్ద బుద్ధిమంతుడిలా రామ శాస్త్రి ముఖం నుండా విబూది దట్టంగా పెట్టుకొని వినయంగా ఇంటికి వచ్చాడు

రామ శాస్త్రీ!' తండ్రి కంఠం ఖంగుమంది

గుమ్మంలోనే నిలబడి పోయాడు ఆ పిలుపు విని, ఓ క్షణం గడిచిన తరువాత యథాలాపంగా లోపలికి వెళ్ళబోయాడు

నిన్నే పిలిచేది పవిత్ర మైన వేదాధ్యయనానికి చెరుపు కలిగించే పనులు చాలా చేస్తున్నావురా నీకు ఏ ఆశయంతో ఈ విద్య ఇంత వయస్సులో కూడ చెబుతున్నానో ఆ ఆశయాలనే సర్వనాశనం చేస్తున్నావురా నువ్వు నలుగురితో తిరగడంలో తప్పులేదు కాని నువ్వాడే పేకాట్లు, కాల్చే బీడీలు మన వైదిక సాంప్రదాయానికి ఎంత వరకు సరిపోతా యన్నది నీకు నువ్వే ప్రశ్నించుకో చాలాస్పష్టంగా అడిగారు శాస్త్రిగారు

ఈ విషయం అడుగుతారని ఊహించలేక పోయాడు రామశాస్త్రి

నాన్నగారూ' క్షమించండి ఇంక ఇప్పటి నుండి జాగ్రత్తగానే ఉంటా' అంటూ ముందుకు వెళ్ళి పోయాడు ఆ సమాధానంలో పశ్చాత్తాపం కనిపించ లేదు గట్టులు తెంచుకొని ప్రవహించే నదికి చేతులు అడ్డు పెడితే ఆగుతుందా! నీలకంఠ శాస్త్రి గారు కూడ ఇంక మాట్లాడలేక పోయారు

* * * * *

మామూలుగా వేదాధ్యయనం సాగి పోతోంది అనడానికి వీల్లేదు పూర్తిగా అనాధ్యాయం ఏర్పడినట్టే ఒక్కొక్క వేద పనస ఇరవై సంతలలో వల్లెకు వచ్చేది నలభై సంతలకు కూడ వల్లెకు రావడం లేదు ఇక ఎంత కాలానికి ఈ వేదం పూర్తిగాను?' ప్రతినిత్యం ఏదో ఒక రకంగా తండ్రి కొడుకుల మధ్య చిన్నరకం చర్చ ఏదో ఒక విషయం మీద జరుగుతూనే ఉంది వల్లెలు వేస్తే సంతకు రాడు సంతలకు వస్తే వల్లె వేయడు ఒక నిరాశ నిస్పృహ శాస్త్రి గారిలో చోటు చేసుకున్నాయి ఈ వేదాధ్యయనం చివర వరకు వెడుతుందా? లేక పోతే ఈ వేదం నాతో ఆఖరేనా? అన్న సమాధానం లేని ప్రశ్నలతో కుమిలి పోతున్నారు తన కుటుంబంలో తరతరాల నుండి వస్తున్న వేదం ఎక్కడ మంట కలిసి పోతుందో అని ఆరోజు తగుదు నమ్మా అని స్వాతంత్ర్యోద్యమంలో ఉరికారు స్వాతంత్ర్యం వచ్చాక ఇంక ఫరవాలేదని ఊపిరి పీల్చుకున్నారు తన కొడుకులు ముగ్గురు కాక పోయినా కనీసం ఒక్కడైనా ఈ వేదం చదివితే ఈ వంశం పవిత్రత చెందు తుందని కలలు కన్నాడు కాని నేడు అది ఒక పీడ కలగా మిగిలి పోయేటట్టు ఉంది పోనీ రామ శాస్త్రిని కాదని ఇంకొకరికి ఎవరికైనా ఈ వేదాన్ని చెబుదామంటే, ఎవ్వరూ కూడ వద్దంటున్నారు కాలం ఈవిధంగా తయారయింది సరియైన ఆదరణ ఈ వేదానికి లేక పోవడమే దానికి కారణం అట్లా అని ఈ ఇంట్లో విద్యను చేజేతులా పాడు చేసుకోవడమేనా?

* * * * *

దసరా రోజులు వస్తున్నాయి దేవాలయంలో కూడా ఈ దసరా వేడుకలకు సంబంధించిన ఏర్పాట్లు జోరుగా సాగుతున్నాయి ఈ నవరాత్రులలో శారదా దేవి పూజలు వైభవంగా నీలకంఠ శాస్త్రి గారి అధ్వర్యంలోనే జరుగుతాయి

తొమ్మిది రోజులు వేద పారాయణ తప్పదు ఉద్దండులైన వేద పండితులు వచ్చి తమ వేద ప్రతిభను చూపిస్తారు. మధ్యాహ్నం పురాణ ప్రవచనం. సాయంత్రం నాటకాలు, బుర్రకథలు, హరికథలు లాంటివి ఏర్పాటు చేయబడతాయి దేవాలయం కార్య వర్గ అధ్యక్షులు చౌదరిగారు కూడ ఈ కార్యక్రమాల విషయంలో శాస్త్రిగారు ఏవిధంగా చెబితే ఆవిధంగా వింటారు డబ్బు విషయంలో వెనుకాడే ప్రశ్నే లేదు శాస్త్రిగారంటే ఒక భక్తి, ఒక పవిత్రత. స్వాతంత్రోద్యమంలో తమ ఆస్తులు ఎక్కడ పోతాయో అని అందరూ భయపడి పోతూ ఉంటే, శాస్త్రి గారు మాత్రం ఈ భారతీయ సంస్కృతి సమూలం మట్టి కొట్టుకు పోతుందేమో అని తపించి పోయాడు ఈ గ్రామంలో తొలిసారిగా జండా పాతి జైలు కెళ్ళిన వ్యక్తి తనతో బాటు జైలులో చచ్చి పోయిన కాళిదాసు కుటుంబాన్ని ఆదుకొని ఒక మార్గం చూపించిన వ్యక్తి కూడా శాస్త్రిగారే. ఇంతకంటే సంఘ సంస్కరణ, దేశాభిమానం ఏం కావాలి? అందుకనే శాస్త్రి గారు చౌదరి గారు లాంటి వాళ్ళకి దేవుడు ఈ దేవాలయ పవిత్రతతో బాటు, ఈ గ్రామం యొక్క సౌభాగ్యం కూడా ఈయన మూలంగానే ఉందని ఆ గ్రామంలోని అందరి నమ్మకం

ఉదయం సంధ్యావందనం, నమక చమకాల పారాయణ, దేవతార్చన పూర్తి చేసి దసరా కార్యక్రమాలను గురించి చర్చించ డానికై దేవాలయానికి వెళ్ళారు. దేవాలయం పూజారి సుబ్రహ్మణ్యం గారు శాస్త్రికి నమస్కారం చేసారు. దైవ దర్శనా నంతరం ఇద్దరూ మాట్లాడు కుంటూ దేవాలయం పూలవనం దగ్గరకు చేరుకున్నారు దేవాలయానికి వెనకాలే మంచి పూలవనం ఉంది వనంలోకి వెళ్ళాలంటే దేవాలయం లోంచే మార్గం ఉంది వనానికి చుట్టూ ప్రహరీ గోడ లోపల అందమైన వనం వివిధ రకాలయిన పూజకు సంబంధించిన పువ్వులు తులసి మొక్కలు పుష్కలంగా ఉంటాయి దైవ పూజకు ఎటువంటి ఆటంకము రాకూడదనే శాస్త్రిగారు స్వయంగా ఆ వనాన్ని పెంచారు ఆవనంలోకి ఆ గుడి పూజారిగారికి వారి కుటుంబానికి తప్ప మరి ఎవ్వరికి ప్రవేశం ఉండదు ఉత్సవ సమయాల్లో ఆవనం భక్తుల దర్శనార్థం తెరిచే ఉంటుంది పూలవనం గుమ్మం వద్దకు ఇద్దరూ సమీపించారు పూలవనం తలుపులు దగ్గరగా వేసి ఉన్నాయి. ఆవనంలోంచి వచ్చిన కొన్ని నవ్వులు, పరిహాసపు మాటలు ఆ ఇద్దరి మాటలకు అడ్డుకట్ట వేసాయి కొంతసేపు ఆ పూలవనం గుమ్మం వద్దే నిలబడి లోపలి నుండి వచ్చే ప్రేమ పక్షుల కిలకిలా రావాలు విన్నారు పూజారిగారి అమ్మాయి మంగ తాయారు, నీలకంఠయ్య గారి ప్రబుద్ధుడు రామశాస్త్రివి ఆమాటలు అని వేరే చెప్పక్కర్లేకుండగా ఇద్దరికీ అర్థ మయింది అంతే కాదు వాళ్ళ మాటలను బట్టి ఈ ప్రేమ వ్యవహారం చాలాకాలం నుండి సాగుతోందని అర్థమయింది కొంత సేపట్లో పూల వనం తలుపులు తెరచుకొని అలివేలు రామశాస్త్రి పకపకా నవ్వుకుంటూ బైటకు వచ్చి ఎదురుగా ఉన్న తండ్రులిద్దరిని చూసి నిర్ఘాంత పోయారు గొప్ప తప్పు చేసి దొరికి పోయినట్లుగా ముఖాలు మాడి పోయాయి ఇద్దరూ తలో దారి ఆశ్రయించి తండ్రుల చూపుల తూణీరాల నుండి తాత్కాలికంగా తప్పించు కున్నారు.

దీనంగా ముఖం పెట్టి సుబ్రహ్మణ్యంగారు శాస్త్రిగారి ముఖం లోకి చూసారు ఆడపిల్లలను కన్న తల్లిదండ్రుల బ్రతుకులు ఇంతే అన్నట్లుగా ఉన్నాయా చూపులు ఎవరిది తప్పైన దోషి మాత్రం కొడుకును కన్న తండ్రే ఇది లోక న్యాయం. పూజారిగారి కళ్ళలోని జాలి ఆవేదనా శాస్త్రి గారిని నిలువునా దహించేసాయి అంతేకాదు తన కుమార్తెకు సరియైన న్యాయం చూపించ వలసిన బాధ్యత శాస్త్రి గారిదే అన్నట్లుగా ఉన్నారు పూజారిగారు

సుబ్రహ్మణ్యం గారు! మీ వేదన నాకర్థమయింది ఇప్పుడు నేనేమి మాట్లాడలేను క్షమించండి" మిక్కిలి భారంగా నడుచుకుంటూ వెళ్ళి పోయారు

శాస్త్రి గారు వెళ్ళిన వైపే చూస్తూ అలాగే నిలబడి పోయారు పూజారిగారు

* * *

తన వేదం మాట దేవుడెరుగు ఇంకో కొత్త సమస్య శాస్త్రి గారిని పట్టుకుంది ఇపుడేం చేయాలి? మునపటికి మల్లే ఏం వచ్చినా తట్టుకో

లేక పోతున్నారు శాస్త్రిగారు వయస్సు పెరిగి పోయింది దానికి సాయం రామ శాస్త్రితో సమస్యలు ఇంటికి వచ్చే సరికి శరీరం బరువెక్కి పోయింది వళ్ళు తూలుతోంది కళ్ళు తిరుగుతున్నాయి ఎదురుగా ఏదో అగాధం ఏర్పడినట్టుంది శాస్త్రి గారికి అలా వస్తూనే నులక మంచంపై వాలి పోయారు

చాలా సేపటికి కాని మెలుకువ రాలేదు లేచే సమయానికి ఎదురుగా అక్రమ మార్గంలో వేదం ఏకరువు పెడుతున్న కొడుకు గొంతు వినిపించింది

"రామశాస్త్రి! ఇంక ఆపుచేయి నువ్వు వేదం చెప్పక పోయినా నేను బాధపడను కాని పవిత్ర వేదాధ్యయనంలో అపశ్రుతులు రానీయకు" అని లేచి కూర్చున్నారు

అప్పుడు కాని ఈ లోకంలోకి రాలేదు రామశాస్త్రి అలాగే చూస్తూ ఉండిపోయాడు

ఏరా! ఆ అమ్మాయితో ఎంత కాలం నుండి ఆ పరిచయం "

"చాలా రోజుల నుండి ఉంది" కంగారుగా చెప్పాడు సమాధానం.

గద్దించి గాదండించే పరిస్థితి కాదు. పదహారు సంవత్సరాలు నిండిన కొడుకుని మిత్రుడిలా చూసుకోవాలని శాస్త్రాలు చెబుతున్నాయి. ఇటువంటి సూక్ష్మమైన ధర్మాలన్నీ తెలిసిన జ్ఞాని శాస్త్రిగారు

వేదంపూర్తి కావాలంటే ఇంకా నాలుగేళ్ళు పడుతుంది అంత వరకు నీకో మార్గం లేదు ఎం

# నేను

అజ్ఞతాచ్ఛాదన లేని
విజ్ఞాన స్వరూపాన్ని నేను!
మాయా విశ్వాంబరాన్ని దరించే
నగ్న సత్య సౌందర్యాన్ని నేను!!

దృగ్గోచరుడనైనట్లుంటాను
కనులకు కానరాను నేను!
బుద్ధి గ్రాహ్యమైనట్లుంటాను
మేదకు అందను నేను!!

అలనుగాను, తరకనుగాను,
కెరటాన్నిగాను, జలాన్నీగాను!
అతీతాను భూతిని నేను!!
అనంతానందామృతాన్ని నేను!!!

—'చైతన్య'

# వారసత్వం

చూసుకొని ఆ అమ్మాయిని అభిమానించావురా"

కొడుకు నుండి సమాధానం లేదు

ఆ అమ్మాయిని వివాహం చేసుకోవాలనే అనుకుంటున్నావా?"

"ఊఁ"

మరి నీకు దారేమిటిరా?'

నాన్నగారు! వేదం చదివితే మాత్రం ఎందారి దొరుకుతుంది?'

నీలకంఠ శాస్త్రి ఖంగుతిన్నాడు. ఇప్పుడు కాని ఈ లోకంలోకి రాలేదు నిజమే దారేమిటి? వేదం మూలంగా తాను మాత్రం సాధించినది ఏమిటి?. .

"మరి వేదాధ్యయనం చెయ్యవా?"

"నాకు ఇష్టం లేదు నేను చదవలేను" నిర్మొహమాటంగా చెప్పాడు.

"ఇష్టం లేక పోతే ముందే చెప్పి ఉండాలి. చేతులు కాలాక ఆకులుపట్టుకున్నట్టయింది. ఇప్పుడేం చెయ్య గలవురా?"

మాట్లాడలేదు. యజ్ఞోపవీతాన్ని ఇటూ అటూ తిప్పుతు నేల కేసి చూస్తున్నాడు.

"సరే నీ ఇష్టం "

ఇంత కంటే మాట్లాడడం అనవసరం కొడుకు అభిప్రాయం తెలిసి పోయింది. జరిగేదేదో జరగక మానదు నీలకంఠ శాస్త్రి గారిది మహోన్నత వ్యక్తిత్వం కన్నందుకు వాడి కోదారి చూపాలి పై వాళ్ళిద్దరి పరిస్థితి చాలా బాగుంది పాపం అమాయకుడు రామశాస్త్రి. కన్న పేగు వ్యధ చెందింది. ఆస్తి గురించి కొడుకు లిద్దరికి ఉత్తరాలు వ్రాసాడు. వాళ్ళ నుండి సమాధానాలు వచ్చాక పూజారి సుబ్రహ్మణ్యంగారిని పిలచి మీ అమ్మాయి నా కోడలౌతుంది కంగారు పడకండి అని చెప్పారు.

★ ★ ★ ★ ★

మరునాడు అహోరాత్ర వేదపారాయణ అనగా



ఇల్లంతా సందడిగా ఉంది. బంధువులందరితో కలకలాడుతోంది. కాని శాస్త్రి గారు మాత్రం చాలా కంగారుగా ఉన్నారు. వచ్చిన వాళ్ళని యోగ క్షేమాలు చేయడం తప్ప ఎక్కువగా ఎవరితో మాట్లాడటం లేదు. తన పనేదో తాను చూసుకు పోతున్నారు ఇంతకు ముందు కొన్ని రోజుల నుండి శాస్త్రిగారి ఆరోగ్యం కూడ అంతంత మాత్రంగానే ఉంది పిల్లలు ఎంత చెబుతున్నా ఆయన వినడం లేదు తన పూర్వీకుల నుండి వస్తున్న వేద సంబంధ మయిన తాళపత్ర గ్రంధాలన్నీ మూట కడుతున్నారు. ఇధ్మం (మోదుగు పుల్లలు) భరిపాళ్ళు(దర్భలు) అన్నీ కట్టలు కడుతున్నారు దేవతార్చన సామానంతా పట్టు వస్త్రంలో కడుతున్నారు. ఈ కంగారులో ప్రక్కనే ఉన్న వ్యాస పీఠంపై తెలియకుండా అడుగు వేసారు పుటుక్కున విరిగి. పోయింది. నీలకంఠ శాస్త్రిగారు కూల బడిపోయారు. తాతల నాటి నుండి వస్తున్న ఈ వ్యాసపీఠం పని ఐపోయింది. అముక్కలు తీసి కళ్ళకు అద్దుకున్నారు. కళ్ళనుండి నీళ్ళు బొట బొటా కారి వ్యాస పీఠాన్ని తడిపేసాయి. శాస్త్రి గారు తన జీవితంలో మొట్ట మొదటి సారిగా ఏడ్చారు నిజంగా ఏడ్వవలసిన సమయంలోనే ఏడు పొచ్చింది నిజమైన ఏడుపంటే ఇదే శాస్త్రిగారికి చాలా తృప్తిగాఉంది.

ఎప్పుడు అనేక విషయాలు అడిగి తెలుసుకొనే నాన్నగారు ఎందుకిలా ఐపోతున్నారు. కొడుకులకి కూతుళ్ళకి అంతు పట్టడం లేదు ఏదేనా అడగడానికి కూడా అవకాశం ఇవ్వటం లేదు. తెల్లవారితే వేద పారాయణం ప్రారంభించ బోతున్నారనగా రాత్రి విపరీత మైన జ్వరం వచ్చింది. నిద్రలో ఏవో పలవరింతలు

"నా వేదం ఆగిపోయింది. నాకీ భూమి పై ఋణం తీరిపోయింది ... " అన్న అపశృతులు శాస్త్రిగారు పలవరిస్తున్నారు ఆరాత్రి ఎలా గడిచిందో ..

సరిగ్గా సూర్యోదయానికి వేదం పారాయణ చేయడం ప్రారంభించాలి. అహోరాత్ర పారాయణ మంటే మాటలా! సూర్యోదయంతో ప్రారంభించి ఏకాధ్వరంగా ఇరవై నాలుగు గంటలు పారాయణ చేసి మరునాడు సూర్యోదయంతో పరిసమాప్తం చేయాలి."ఈ వయస్సులో ఇంత సాహసం ఎందుకు చేస్తున్నారు?" పెద్ద కొడుకు సమయం చూసి నెమ్మదిగా అడిగాడు.

"అబ్బాయి! ఈ విషయంలో మీరేమీ అడ్డు చెప్పొద్దు. నావేదం నా ఇష్టం ఈ జ్ఞాన సంపదని నా ఇష్టం వచ్చినట్టు వాడుకుంటా. అయినా ఇంత వయస్సు వచ్చాక ఇంకా అనారోగ్యం, ఆరోగ్యం అనుకోడం అవివేకం".

శాస్త్రిగారి చూపుల్లో నిర్లిప్తత స్పష్టంగా చూసాడు పెద్దకొడుకు

*　　*　　*　　*　　*

అభిమానులతో దేవాలయం కిటకిట లాడుతోంది కుశాసనంపై పరచిన కృష్ణాజినంపై అపరశంకరుడిలా ప్రకాశిస్తున్నారు నీలకంఠశాస్త్రి గారు.

# ఈ వేమన పద్యాలు




హీన నరులతోడ నింతులతోడను
పడుచువాండ్రతోడ ప్రభువుతోడ
ప్రాజ్ఞ జనులతోడ బ్రహ్మజ్ఞతోడను
వైపు దెలిసి పలుకవలయు వేమ.

నుదుటి మీది విబూది రేఖల మధ్య వెలుగొందే కంకుమ బొట్టు శంకరుని త్రినేత్రం వలె ప్రకాశిస్తోంది మెడలో రుద్రాక్ష మాలలు శివుని నాగాభరణాల్లా ప్రకాశిస్తున్నాయి సూర్యోదయ సమయం అయింది కాని సూర్యోదయం అస్పష్టంగానే అవుతోంది ఆకాశంలో సహస్ర కిరణునికి మేఘం అడ్డుపడింది. వేణుగోపాల స్వామి ఆలయంలో వేద విజ్ఞాన సూర్యుడు శత సహస్ర కిరణాలతో వెలిగి పోతున్నాడు విఘ్నేశ్వర పూజ ప్రారంభమైంది వేదపారాయణకు అంకురార్పణ జరిగింది శంకరుని జటా జూటం నుండి వెలువడే గంగా ప్రవాహంలా- నీలకంఠ శాస్త్రి గారి నోటి నుండి వేదధార ప్రవహిస్తోంది ఆ పవిత్ర ప్రవాహంలో ఎంతో మంది పునీతు లౌతున్నారు అవిచ్ఛిన్నంగా వేద పారాయణ సాగుతూనే ఉంది వచ్చేవాళ్ళు వస్తున్నారు వేద పారాయణ వింటున్నారు వెళ్ళేవాళ్ళు వెడుతున్నారు నిండు హృదయాలతో రాత్రి శాస్త్రి గారికి రక్త పోటు ఎక్కువైంది వైద్యులు పరీక్ష చేస్తున్నారు ధైర్యంగా ఏమీ చెప్పలేక పోతున్నారు శాస్త్రిగారి కళ్ళనుండి విస్ఫులింగాలు వెదజల్లుతున్నాయా అన్నట్లుగా ఉన్నాయి వారి నేత్రాలు వేద పారాయణ సమాప్త సమయం ఆసన్నమయే కొలది శాస్త్రి గారి పరిస్థితి ఆందోళన కరంగా మారింది

కాలం చాలా భయంకరమైనది ఏది ఎప్పుడు జరుగుతుందో ఎవరూ చెప్పలేరు ఏ వేదం గురించి తన జీవితాన్ని వెచ్చించారో ఆవేదమాతే శాస్త్రి గారిపై చిన్న చూపు చూసిందా!

బాల భానోదయమైంది కాని జ్ఞాన భాస్కరుడు అస్తమించాడు విషణ్ణ వదనాలతో భక్తకోటి దేవాలయంలో తలలు వంచుకొని నిలబడిఉన్నారు నీలకంఠ శాస్త్రి నిజంగా నీలకంఠు డయ్యాడు □

గూడూరు నుండి తిరుపతి వెళ్ళే దారిలో తిరుపతికి ఈశాన్యంగ 40 కి మీ దూరంలో సువర్ణనదీ తీరాన దక్షిణకాశి దక్షిణకైలాసం సద్యో ముక్తికర బాస్కర క్షేత్రంగ ప్రసిద్ధి చెందిన శ్రీకాళహస్తీశ్వర దివ్యక్షేత్రం ఉంది బ్రహ్మ విష్ణు ఇంద్రాది దేవతలు వసిష్ఠ అగస్త్య భరద్వాజ రోమశాది మహర్షులు శ్రీ (సాలీడు) కాళము (నాగు) హస్తి (ఏనుగు) తిన్నడు (కన్నప్ప) నత్కీరుడు వల్లభుడు అప్పర్ సంబందర్ సుందరర్ మాణిక్య వాచకర్ ఆదిగా గల భక్తులు ఈక్షేత్రాన్ని సేవించి కృతార్థులయినారని లోకప్రసిద్ధి కైలాస నాథుడు వాయులింగాకారంగాను జగన్మాత గౌరీదేవి ఆత్మ విద్యానిధి జ్ఞాన ప్రసూనాంబిక గాను ఇక్కడ వెలిశారని మహర్షుల కథనం

## ఆలయ ప్రశస్తి

పంచభూతాత్మక లింగములలో కంచిలో పృథ్వీలింగము జంబుకేశ్వరంలో జలలింగము అరుణాచలంలో తేజోలింగము శ్రీకాళహస్తిలో వాయులింగము చిదంబరంలో ఆకాశలింగము వెలిశాయి శ్రీకాళహస్తీశ్వరుడు వాయులింగ మనడానికి, స్వామికడ నున్న దీపం సర్వదా చలించు చుండుటయే దృష్టాంతము స్వయం వ్యక్తమైన ఈ శివలింగం రెండడుగుల ఎత్తుగల పానవట్టం పై మూడడుగుల ఎత్తు కలిగి ఉంటుంది భక్తి కైంకర్యంతో శ్రీకాళహస్తీశ్వరుని సేవించి తరించిన ఏనుగుదంతములు పాముపడగ తిన్నని కనులు కలిగిన ఈశివలింగం పంచముఖములతో దివ్యకాంతులీను తుంటుంది ఈ క్షేత్రంలో మూలవరులు పశ్చిమాభిముఖంగా ఉంది అగస్త్య పర్వతాలనుండి పయనిస్తున్న సువర్ణ ముఖినది దక్షిణం నుండి ఉత్తరాభిముఖంగా ప్రవహించడం విశేషం కాశీలో వలెనే ఇక్కడ కూడా మణికర్ణికా ఘాట్ ఉంది

ఆలయ ప్రవేశద్వారంలో ఉత్తరాభిముఖంగా ప్రతిష్ఠించ బడిన పాతాళ గణపతి దర్శానికి', పూర్వాభిముఖంగ వెలసిన జ్ఞాన ప్రసూనాంబ అర్థానికి మహాద్వారానికి అభిముఖంగ ప్రతిష్ఠించ బడిన దక్షిణామూర్తి కామానికి పశ్చిమాభి ముఖంగ వెలసిన శివుడు మోక్షానికి ప్రతీకలుగ ఆర్షజనుల బావన

ఆలయానికి తూర్పు బాగంలో బాలాజ్ఞానాంబ గోపురం పశ్చిమాన తిరుమంజన గోపురం దక్షిణపు దిక్కున బ్రహ్మమందిరం వద్ద మహాద్వార గోపురం, ఉత్తరం వైపున శివయ్య గోపురం నాలుగు దిక్కులా రక్షకులుగా ఉన్నాయి ఆలయానికి వాయవ్యంలో 120 అడుగుల ఎత్తుగల బవ్యమైన రాజగోపురం ఉంది దీనిని శ్రీ శ 1516లో శ్రీకృష్ణదేవరాయలు నిర్మించాడు పర్వదినాలలో స్వామి ఉత్సవానికి



గర్భాలయ శిఖర కలశాల కుంభాభి షేక దృశ్యం



శ్రీ స్వామి వారిని సేవిస్తున్న కంచి కామకోటి పీఠ

బయలుదేరు సమయంలో ఈ ద్వారంగుండా వెళ్ళి, తిరిగి భిక్షాల గోపురం గుండా ఆలయ ప్రవేశం చేస్తాడు. ఈ గోపురాన్ని యాదవ నరసింహరాయల సభా సదస్యుడయిన భిక్షాలు నిర్మించాడు.

ఆలయంలో మూల వరులతో పాటు, ప్రదక్షిణ సమయంలో యాత్రీకులు వినాయక, శ్రీచెంగల్వరాయ స్వామి, ఉత్సవమూర్తులు, కాశీలింగం, రామేశ్వరలింగం, భక్త కన్నప్ప, సహస్ర నామలింగం, నటరాజస్వామి, మహర్షులు, వివిధ దేవీ దేవులు, కాలభైరవుడు, బట్టల భైరవుడు, నాగదేవతలు, సప్తమాతృకలు, తెనాలి



రామకృష్ణుడు ప్రతిష్ఠించిన లింగము. యమ ధర్మరాజు ప్రతిష్ఠించిన లింగము, ధర్మరాజు ప్రతిష్ఠించినలింగము చండికేశ్వర స్వామి ఆదిగా గల మూర్తులను దర్శించుకుంటారు

## తాత్త్వికప్రతిపత్తి

శ్రీకాళహస్తీశ్వరుని దేవాలయం ఆద్యంతం షట్చక్రసంచారమను యోగ సాధనకు ప్రతిరూపంగ మహర్షులు బావిస్తారు మానవ శరీరంలోని ముప్పయి ఆరు అవయవాలకు ప్రతిగా ఈ ఆలయంలో ముప్పయి ఆరు క్షేత్రాలున్నాయి జీవుడు పాతాళ గణపతిని ధ్యానించుకొని (మూలాధారం నుండి) క్రమ క్రమంగా అజ్ఞాచక్ర ప్రబావిలసిత మైన **లోకమాత** జ్ఞానప్రసూనాంబ దివ్యాలయ ప్రాంగణం చేరుకుంటాడు ఆ తర్వాత సహస్రార సంశోభితమై ఒప్పారు పరమేశ్వర దివ్యగర్భాలయం చేరుకొని స్వయంభవ

ప్రధాన ఆలయ ప్రవేశద్వారం





...ధిపతి జగద్గురు శ్రీ జయేంద్ర సరస్వతి స్వామి

వాయులింగస్థిత పరమాత్మాకారాన్ని దర్శిస్తాడు అప్పుడు జీవుడు–

జ్యోతిర్జ్వలతి బ్రహ్మాహమస్మి!
యో అహమస్మి బ్రహ్మాహమస్మి"

స్థాయికి చేరతాడు

ఇక్కడ విశేషమేమంటే దీక్షా పరులయిన పూజారులు కూడా ఈ శివలింగాన్ని తాకరు అభిషేకాదులు లింగపాన పట్టానికే కాని లింగము శిరస్సున' చేయరు పుష్పమాలాద్యలంకారములు లింగమునకు ముందుగల నవగ్రహ స్వర్ణకవచానికి మాత్రమే చేస్తారు మరో విశేషమేమంటే

## ...స్తి
## ...శ్వరుడు

సాధారణంగా శివాలయాల్లో తీర్థప్రసాదాలు యిచ్చుట అనాదిగా వాడుకలో లేదు. కాని శ్రీకాళహస్తిలో మొదటి నుండి తీర్థ ప్రసాదాలు భక్తులకు యిస్తారు

శ్రీశంకరాచార్యులవారు జ్ఞాన ప్రసూనాంబి కాలయానికి ఎదురుగ భువనేశ్వరి చక్రాన్ని స్థాపించారు శ్రీకృష్ణదేవరాయలు వారి ఆస్థానంలోని అష్టదిగ్గజములందు ఒకరుగా అసాధారణ కీర్తి నార్జించిన ధూర్జటి సుదలు పిందెడి కైతలో శ్రీ కాళహస్తీశ్వరుని స్తుతించి ధన్యుడయ్యాడు

## అన్యదర్శనీయ క్షేత్రాలు, తీర్థాలు

తిన్నని (కన్నప్ప) దేవాలయం కనకదుర్గ ఆలయం పంచముఖేశ్వర స్వామి కుమార స్వామి ప్రసన్న వరదరాజ స్వామి ధర్మరాజస్వామి శుకబ్రహ్మ, బాలజ్ఞానాంబ, కాశీవిశ్వనాధ ఆలయాలు యాత్రికులు దర్శిస్తారు ఈ దివ్య క్షేత్రంలో ముప్పయి ఆరు తీర్థాలున్నట్లు అర్చ్య పచనం వానిలో సహస్రలింగాల తీర్థం హరిహర తీర్థం భరద్వాజ తీర్థం, మార్కండేయ తీర్థం భైరవతీర్థం మోక్ష తీర్థం బ్రహ్మతీర్థం సూర్య పుష్కరిణి చంద్ర పుష్కరిణి లను భక్తులు ప్రధానంగసేవిస్తారు

## శిల్పకళా వైభవం

శ్రీకాళహస్తీశ్వరాలయం పల్లవ, చోళ విజయనగర శిల్పకళారీతులకు ప్రతిబింబము స్తంభాలు మండపాలు శిల్పకళా వైవిధ్యంతో అలరారు తుంటాయి శివ మాహాత్మ్యంను చాటి చెప్పే తైల వర్ణ చిత్రాలు ఒక ప్రత్యేక ఆకర్షణ నాగేశ్వర మండపము గుర్రపు సాని మండపము నూరు స్తంభాల మండపము కోట మండపము షోడశస్తంభాల మండపము ఆనాటి శిల్పుల కళా నైపుణ్యానికి నిదర్శనం కోట మండపంలో గల వర్ణ చిత్రాలు శతాబ్దకాలం గడిచినా ఎమాత్రం మాసిపోలేదు నటరాజ రంగస్థల మండపంలో పల్లవ కాలీన ఏకశిలా శిల్పాలు దర్శన మిస్తాయి వానిలో ఆనంద తాండవమూర్తి నటరాజ జ్ఞాన ప్రసూనాంబ కళ్యాణం ఆలింగన మూర్తి సుబ్రహ్మణ్య స్వామి భిక్షాటన మూర్తి కైలాసగిరిపై వృషబారూఢ శివుడు వెంగల రాయస్వామి వీణాధర దక్షిణామూర్తి గజాహరమూర్తి కైలాస శివుని రావణుడు పైకిలేపాలని ప్రయత్నించుట రుద్రమూర్తి ఏక పాదమూర్తి ఆడిగాగల శిల్పాలు శివతత్వాన్ని కళాత్మకంగా చాటి చెప్పి యాత్రికులను పరవశింప చేస్తాయి శ్రీ స్వామివారి గర్భగుడి కుడ్యములపై వెలుపల వైపు ఉత్తరపు దిక్కున బ్రహ్మ తూర్పున అరుణగిరి నాధీశ్వరుడు దక్షిణం దక్షిణామూర్తి శిల్పాలతో పాటు ఆగ్నేయం మూల జీవుని అరిషడ్వర్గములను స్వాహా చేసే యజ్ఞకుండం ఉంది

శ్రీకాళహస్తీశ్వరాలయంలో మోక్షప్రాప్తికి హేతుభూత మయిన ఆత్మవిద్య సగుణ రూపంలో దర్శన మిస్తుంది శ్రీ ఆదిశంకరాచార్యుల వారు పరమ శివుని భక్తిప్రాభావ్యాన్ని భక్త కన్నప్ప ద్వారా శివానందలహరిలో –

మార్గావర్తిత పాదుకా పశుపతే
రజ్గస్య కూర్చాయతే
గండూషాంబు నిషేచనం
పురరిపోర్దివ్యాభిషేకాయతే
కించిద్భక్షిత మాంసశేష కబలం
నవ్యోపహారాయతే
భక్తి కింన కరోత్యహో
వనచరో భక్తావతంసాయతే"

అని కీర్తించారు

–కెప్టెన్ షేక్ మౌలాలీ



తిన్నని మూఢ భక్తిని చాటిచెప్పే ప్రతిమ

పాతాళ విఘ్నేశ్వరాలయం





సీరియల్

# ఆరోహణ

శైలకుమార్

(గత సంచిక తరువాయి)

"ఎలా వుంధండీ కథ అడిగాడు చక్రవర్తి నీలిమను ఇద్దరూ నీలిమ ఇంటి ముందు గార్డెన్‌లో కూర్చున్నారు తాను కొత్తగా రాసిన కథను ఆమెకు ఇచ్చాడు చక్రవర్తి ఆమె చదవటం పూర్తి చేశాక అడిగాడు ఆ ప్రశ్న.

'బావుంది కాని మీరు కథనంలో చూపించినంత శ్రద్ధ డైలాగుల్లో చూపించటం లేదేమో" అంది

"ఎందుకంటున్నారలా "

"ఏం లేదు మాటలు పాత్రోచితంగా వుంటే బావుంటాయని

'అంటే మాండలికంలో రాయాలనా "

"అలా అని కాదు కాని అవసరమైన చోట్ల ఉపయోగిస్తే బావుంటుందేమో

"ఎలాగో చెప్పండి చూద్దాం" అడిగాడు నవ్వుతూ చక్రవర్తి

ఉదాహరణకి ఈ కథలో వేణు ఒక పల్లెటూరికి వెళ్తాడు అక్కడ ఓ వృద్ధురాలు అతన్ని ఓ సందర్భంలో 'బాత్‌రూంలో స్నానం చేసి రా బాబూ' అంటుంది ఔనా" అడిగింది నీలిమ

"ఔను '

"వేణు వెళ్ళింది రాయలసీమలోని ఓ పల్లెటూరికి మాట్లాడుతున్నది వృద్ధురాలు. ఆమెకు 'బాత్‌రూం' అనే పదం తెలియకూడదని కాదు కాని రాయలసీమలో చాలా మంది బాత్‌రూంను 'జల్దారు' అంటారు ఆమె ఆ మాట అన్నట్లు రాస్తే బావుంటుంది లేదా స్నానం చేసి రా బాబూ అన్నా చాలు' ఓపికగా వివరించింది నీలిమ

ఓ నిముషం పాటు ఆమెను తదేకంగా చూస్తూ వుండిపోయాడు చక్రవర్తి

"మీరు చాలా నిశితంగా పరిశీలిస్తారు "

'అదేం లేదు మిమ్మల్ని విమర్శిద్దాం అని అంతే" అంది నవ్వుతూ

' లేదండీ నిజానికి నాకూ ఆ పదం తెలుసు కాని అక్కడ రాయలేకపోయాను ఈ ప్రాంతం వాడి నయ్యుండీ "

"రాయటం కష్టం విమర్శించటం తేలిక.

'జల్దారు ఎలా వచ్చిందో చెప్పగలరా నవ్వుతూ అడిగాడు

జలజారు ప్రదేశం కదా అందుకే జల్దారు అయ్యుండచ్చు నాకూ సరిగ్గా తెలీదు '

ఇద్దరూ నవ్వుకున్నారు

* * * *

గాఢంగా నిట్టూర్చి మరో సిగరెట్ వెలిగించాడు చక్రవర్తి

అజ్ఞాతంలోకి వెళ్ళిపోయిన మనిషిలా, లక్ష్యాన్ని సాధించటానికి శక్తినంతా కేంద్రీకరించి కృషి చేస్తున్న సాధకుడిలా, పరీక్షలో ప్రథముడనిపించుకోవటానికి పరిశ్రమిస్తున్న విద్యార్థిలా, దృష్టి చెదరకుండా, ఏకాగ్రతతో కూర్చుని వ్రాయసాగాడు చక్రవర్తి

ఆ వ్రాయటాన్ని జీవన్మరణ సమస్యగా తీసుకున్నాడు చక్రవర్తి అందులో విజయం సాధించాలి అదీ అతని పట్టుదల తనను అవమానించిన వాళ్ళందరికీ ఆశ్చర్యం కలిగించాలి అవకాశం వస్తే తనెంత బాగా వ్రాయగలడో నిరూపించాలి తన శక్తి ఋజువు చెయ్యాలి అదీ అతని దీక్ష

దాహం వేసి తెల్లవారు జామున లేచిన కిరీటికి ఇంకా టేబులు ముందు కూర్చుని రాసుకుంటున్న చక్రవర్తి కనిపించాడు

మంచినీళ్ళు వంచుతున్న చప్పుడుకు తల తిప్పి కిరీటిని చూశాడు చక్రవర్తి

' కిరీటీ పిలిచాడు

' సార్ అంటూ దగ్గరికి వచ్చాడు

"సినిమాకు మొత్తం ఎన్ని సీన్లు కావాలంటావు "

"మీకు తెలీందేం వుంది సార్ సింగిల్ లైను ఆర్డరులో మీరే ఎనభై సీన్లు రాశారు గదా

"కాని కొన్ని కొత్త సీన్లు ఫ్లాష్ అవుతున్నాయి కిరీటీ, అవీ రాద్దామని "

రాయండి సార్ సీన్ లెంగ్తుని బట్టి ఎనభైనుంచి నూరు వరకు వుండచ్చు సీన్లు

' సరే పడుకో

వారం రోజుల్లో మొత్తం డైలాగులు పూర్తి చేసి అందరికీ వినిపించాడు చక్రవర్తి అందరికీ నచ్చాయి అవి

'మీకు మంచి ఫ్యూచరుంది చక్రవర్తీ' భుజం తడుతూ అన్నాడు డైరక్టర్ త్రిమూర్తి

పార్థసారథి మొహంలో కూడ బాగా రాశాడన్న సంతృప్తి.

మరో వారం రోజుల్లో మ్యూజిక్ సిట్టింగ్స్ కూడ పూర్తయ్యాయి మొత్తం ఆరు పాటలూ చక్రవర్తే రాశాడు నాలుగు పాటల్ని వెంటనే రికార్డు చేశారు

పత్రికా విలేకరుల సమావేశం ఏర్పాటు చేసి విలేకరులకు రికార్డు చేసిన పాటలు వినిపించాడు పార్థసారథి చక్రవర్తిని విలేకరులకు పరిచయం చేశాడు కొన్ని పత్రికలు చక్రవర్తి ఫోటో, వివరాలూ ప్రచురించాయి

గౌతమ్ ఆర్ట్ క్రియేషన్స్ బ్యానరు మీద పార్థసారథి తీస్తున్న సినిమాకు చక్రవర్తి కథ, మాటలు, పాటలు వ్రాస్తున్నాడన్న విషయం ఇండస్ట్రీ అంతా పాకి పోయింది కొత్త వాడికి అవకాశం ఇచ్చినందుకు కొందరు మెచ్చుకున్నారు పార్థసారథి ఈ సినిమాతో చేతులు కాల్చుకుంటాడని చాలా మంది మనసులో నే దీవించారు

మొత్తానికి రచయితగా చక్రవర్తి పేరు పరిశ్రమ అంతా తెలిసిపోయింది

* * * * * * * * * *

వాహినీలోని తొమ్మిదవ ఫ్లోరులో హీరోయిన్ ఇంటి సెట్ వేశారు హీరోయిన్ ధనవంతుల అమ్మాయి కావటం వల్ల సెట్టు చాలా విశాలంగా, ఆడంబరంగా

**జరిగిన కథ–12:** నీలిమ ఎడబాటువల్ల కలిగిన నిరాశతో తిరుపతి వదలి మద్రాసు చేరుతాడు చక్రవర్తి కొంతకాలంపాటు చక్రవర్తికి మద్రాసులో నిరాశ, అవమానం, మోసం ఎదురవుతాయి ఆత్మహత్య చేసుకోవాలన్నంత నిస్పృహలోకి వెళుతున్న చక్రవర్తికి రవి కలుస్తాడు రవి సాయంతో చక్రవర్తికి నిర్మాత పార్థసారథి దగ్గర మంచి అవకాశం దొరుకుతుంది చక్రవర్తి రచనలు మెచ్చిన పార్థసారథి తన సినిమాకు కథతో పాటు మాటలు, పాటలు రాయడానికి కూడ చక్రవర్తికే అవకాశం ఇస్తాడు

తయారు చేశాడు కళాదర్శకుడు రవి

చక్రవర్తి సలహా మీద ఆ కథకు మంచు తెరలు ' అన్న పేరును ఖాయం చేసి పబ్లిసిటీ ఇచ్చారు

ఆ రోజే షూటింగ్ ప్రారంభం చిత్రసీమలోని ప్రముఖుల నందరినీ ముహూర్తానికి ఆహ్వానించాడు పార్థసారథి

ఫ్లోరంతా కళకళ లాడుతూ వుంది చిన్న నటులు, నటీమణులు, సాంకేతిక నిపుణులు, మేకప్ ఆర్టిస్టులు, గాయకులు, ఎక్స్ట్రా ఆర్టిస్టులు, కాస్ట్యూమ్ డిజైనర్లు, సెట్ ప్రాపర్టీస్ సప్లయి చేసేవాళ్ళు, ఎందరో హాజరయ్యారు ముహూర్తానికి పార్థసారథి పెద్ద ప్రొడ్యూసరు కావటంతో దాదాపు సినీ పరిశ్రమలోని వారంతా వచ్చారు అక్కడికి

లైటింగ్ చూసుకుంటున్నాడు కెమెరామన్ లైట్లు ఆరుతూ వెలుగుతూ వున్నాయి ఇండోరు షూటింగ్ కావటం వల్ల సెట్టుకు మీద కూడ లైట్లు అమర్చారు సెట్టుకు పైన అడ్డంగా కర్రలతో నిచ్చెనల మాదిరిగా కట్టి వాటిపై అమరుస్తారు లైట్లని వాటి ప్రక్కన అంత ఎత్తులోనూ నిలబడతారు లైట్‌బాయ్స్ లైటింగ్ సరి చూసుకుని తృప్తి పడ్డాడు కెమెరామన్

ఒక వైపు చిన్న ఆర్టిస్టులకు మేకప్ జరుగుతోంది మరో వైపు సెట్ ప్రాపర్టీస్ సరిగ్గా వున్నాయో లేదో చూసుకుంటున్నారు అసిస్టెంటు డైరక్టర్లు వాళ్ళ చేతుల్లో డైలాగుల ఫైళ్ళు తీయబోతున్న సీన్లు వాటి వివరాల కాగితాలు

ఆహూతుల కందరికీ కూల్ డ్రింకులు, కాఫీలు అందిస్తున్నారు బాయ్స్





## ఆరోహణ

వచ్చిన అందరినీ సాదరంగా పలకరించి తీసుకు వస్తున్నారు పార్థసారథి, త్రిమూర్తి వారి ప్రక్కనే నిలబడ్డాడు చక్రవర్తి ముఖ్యమైన వాళ్ళందరికీ చక్రవర్తిని పరిచయం చేస్తున్నాడు పార్థసారథి అందరూ అభినందనలు తెలుపుతున్నారు

హడావుడిగా తిరుగుతున్నారు అందరూ అందరిలోనూ ఉత్సాహం. పెళ్ళి సందడితో వున్న ఇల్లులా వుంది ఆ ఫ్లోరు.

ముహూర్తం సరిగ్గా పది నిముషాలు వుందనగా ఫ్లోరు ముందు ఆగింది హీరోయిన్ కీర్తన కారు కారులోంచి అతి వయ్యారంగా దిగి త్రిమూర్తికి, పార్థసారథికి నమస్కరించింది కీర్తన. చిన్న వాళ్ళు పెడుతున్న నమస్కారాలకు తల ఊపుతూ అక్కడ వున్న పరిశ్రమ పెద్దల నందరినీ పలకరించింది కీర్తన. ఎందరో ఆమెను కళ్ళతో తినేసేలా చూస్తున్నారు

మరు నిముషంలో హీరో కారు వచ్చింది దర్పంగా దిగాడు ప్రతాప్

సరిగ్గా ఎనిమిది గంటలకు కీర్తన దేవుని పటాలకు పూజ చేసి హారతి ఇస్తున్నట్లుగా ముహూర్తం షాట్ చిత్రీకరించాడు డైరక్టర్ త్రిమూర్తి అందరికీ ప్రసాదాన్ని పంచి పెట్టాడు పూజారి

ఆ షాట్ కాగానే ఆహూతులలో చాలా మంది డైరక్టర్ దగ్గర, పార్థసారథి దగ్గర శలవు తీసుకుని వెళ్ళిపోయారు ఆ రోజు హీరో వర్కు ఏమీ లేకపోవటంతో ప్రతాప్ కూడ వెళ్ళిపోయాడు మరో షూటింగ్‌కు

తరువాతి షాట్‌కు ఏర్పాట్లు జరుగుతున్నాయి బయట చెట్టు నీడన వేసిన కుర్చీలలో కూర్చున్నారు పార్థసారథి, త్రిమూర్తి, కీర్తన.

ఓ ప్రక్కగా వచ్చి సిగరెట్ వెలిగించాడు చక్రవర్తి

'నమస్తే

కోమలమైన కంఠం వినిపించటంతో తలెత్తాడు చక్రవర్తి.

ఎదురుగా ఎవరో అమ్మాయి నిలబడి వుంది. బొడ్డు క్రిందికి కట్టిన నీలం రంగు చీర. అదే రంగు జాకెట్టు. మేకప్ చేయబడిన ముఖం. పెదాలకు ఎర్రని లిప్‌స్టిక్, ఎత్తు మడమల జోళ్ళు, ఎర్రగా మెరిసిపోతున్న శరీర ఛాయ, విశాలమైన నల్లని కళ్ళు – 'ఏ వేషం వేస్తుందో కాని చాలా అందంగా వుంది' అనుకున్నాడు

చక్రవర్తిగారు మీరే కదా" ప్రశ్నించింది

'ఔను

మీ నవల చదివాను' అంది తీయని కంఠంతో

సంతోషం ఎలా వుంది అడిగాడు చక్రవర్తి

నచ్చింది నచ్చలేదు" అంది కిలకిలా నవ్వుతూ ఎదుటి మనిషిని రెచ్చగొట్టే నవ్వు

అదేం సమాధానం '

"మీ శైలి నచ్చింది కాని చివర్లో వాళ్ళను విడగొట్టటం నచ్చలేదు."

'ఎందుకని' చూద్దాం ఏమంటుందో అని అడిగాడు

'మీలాంటి రచయితలు సమస్యలను ధైర్యంగా పరిష్కరించాలండీ రాజీ దోరణి మంచిది కాదు

అంటే వాళ్ళిద్దరినీ కలపాలంటావు

ఔను

కాని వాస్తవంగా ఆలోచించాలి కదా

ఏమిటి సార్ వాస్తవం ఈ రోజుల్లో కూడ భర్త ఆగడాలన్నీ భార్య భరించాలని రాయటమా ఎదురు ప్రశ్నించింది

ఆమె మాటలు చక్రవర్తిలో ఉత్సాహాన్ని కలిగించాయి చక్కగా మాట్లాడుతోంది అనుకున్నాడు.

అయితే వాళ్ళను కలపాలంటావు" మళ్ళీ అడిగాడు

"ఔను" అంది ముద్దుగా

"మరి అప్పుడు మరో ఇద్దరు బాధ పడతారు కదా

'పడనివ్వండి మరొకరిని బాధపెట్టకుండానే మనుషులు జీవిస్తున్నారా ఈ ప్రపంచంలో స్థిరంగా అంది

"అది స్వార్థం కదూ '

జీవితం సుఖంగా వుండాలనుకోవటం స్వార్థమా. రాజీ పడకూడదు సార్ మహారచయిత చెలం సమాజంతో నే రాజీ పడలేదు

ఆమె బాగా చదువుకున్నదని గ్రహించాడు చక్రవర్తి ఆమె పట్ల గౌరవం పెరిగింది

ఇది మీ మొదటి సినిమా కదా సార్"

ఔను '

గుడ్‌లక్

థాంక్స్' అని ఆమె మెహంలోకి చూసి అడిగాడు–

"మీ పేరు "

"అసలు పేరు మర్చిపోయాను సినిమా పేరు మానస" అంది కళ్ళు ఆర్పుతూ

"చిత్రంగా మాట్లాడతారే

"చిత్రసీమ కదండీ ఇది '

నవ్వకుండా వుండలేక పోయాడు చక్రవర్తి.

"ఓ సారి చూద్దామా "

సోపాలో కూర్చుంది కీర్తన ఆమెకు ఎదురుగా కెమెరాకు వీపు కనిపించేలా నిలబడింది మానస

నటించి చూపించింది కీర్తన

"అలా కాదు కీర్తి నీ ఫ్రెండ్‌ను చూసిన రియాక్షన్ నీ మొహంలో చూపించాలి క్లోజ్ తీస్తానిక్కడ మానస అవుట్ బ్లాక్‌లో వుంటుంది కెమెరా వెనక్కి వచ్చినపుడు బ్లాక్‌లోకి ఎంటర్ అవుతుంది

"అలాగే" అంది

"కిరీటీ మార్క్ చెయ్' చెప్పాడు త్రిమూర్తి

సోఫా దగ్గర నుంచి కెమెరా వరకు కీర్తన నడిచి రావలసిన ప్రదేశాన్ని చాక్‌పీస్‌తో కనిపించీ కనిపించకుండా ఓ గీత గీశాడు 'కిరీటి ఆర్టిస్ట్ కెమెరాకు అవుట్ బ్లాక్ కాకుండా వుండటం కోసం అలా గీస్తారు

కెమెరా వెనక్కు వచ్చి నిలబడ్డాడు కిరీటి

టేక్ చేద్దామా '

ఓ కె అంది కీర్తన ప్రక్కనే మేకప్ బ్రే పట్టుకుని నిలబడి వున్న అసిస్టెంటు కీర్తన దగ్గరకు వచ్చింది టచ్ అప్ చేసుకుంది కీర్తన.

"లైట్స్ ఆన్ ఫ్యాన్స్ ఆఫ్" అరిచాడు అసిస్టెంటు కెమెరామన్. ఒక్కసారిగా




కిరాతార్జునీయము
(శ్రీశైల ప్రాకార శిల్పానుకృతి)
ఫొటో : వెల్లటూరి పూర్ణానందశర్మ

"సినిమాలో ఏ వేషం" అడిగాడు

"కాలేజీలో హీరోయిన్ స్నేహితురాల్ని రెండు డైలాగులు వున్నాయి హీరోయిన్ దయతలిస్తే ' అంది

"ఆమె దయ తలచటం ఏమిటి

"అంతే కదండీ మా బ్రతుకు ఆమె దయ వుంటేనే మాకు డైలాగులు వుంటాయి ఓ క్లోజ్ షాట్ అన్నా తీస్తారు

"ఎందుకలా

'ఎందుకేమిటి సార్ ప్రక్కవాళ్ళు ఎదగ కూడదు అనుకునే పరిశ్రమ ఇది ప్రక్క నటి ఏ మాత్రం అందంగా వున్నా క్లోజ్ షాట్ తీయ నివ్వదు ఆమె ప్రేక్షకులో పరిశ్రమో గుర్తిస్తుందన్న భయం" చాలా తేలిగ్గా చెప్పింది మానస

'షాట్ రెడీ సార్" అసిస్టెంటు డైరక్టరు పిలవటంతో త్రిమూర్తి, కీర్తన లేచి సెట్‌లోకి నడిచారు

"కీర్తి, నువ్వా సోఫాలో కూర్చుని వుంటావు దిగులుగా నీ ఫ్రెండ్ ఇంట్లోకి ఎంటర్ అవుతుంది. నువ్వు సంబరంగా లేచి వేగంగా ఆమె దగ్గరికి వచ్చి 'రఘు కన్పించాడా' అంటావు అదీ షాటు" వివరించాడు త్రిమూర్తి

నవ్వుతూ తలూపింది కీర్తన

అన్ని లైట్లు దేదీప్యమానంగా వెలిగాయి

'స్టార్ట్ త్రిమూర్తి

"రన్నింగ్' కెమెరామన్

"థర్టీ ఫైవన్ టేక్ వన్ అరిచాడు అసిస్టెంటు డైరక్టరు కెమెరా ముందు క్లాప్ బోర్డు పెట్టి

"యాక్షన్ '

ఆనందంగా మొహం పెట్టింది కీర్తన సోఫాలోంచి లేచి కెమెరా వైపు నడిచింది కెమెరా మెల్లగా జూమ్ బ్యాక్ అయి మానస బ్లాక్‌లోకి వచ్చింది

'రఘు కనిపించాడా ఆతృతగా అడిగింది కీర్తన

ఓ కె కట్' అరిచాడు త్రిమూర్తి

టేక్ నోట్ చేసుకున్నాడు కిరీటి లైట్లన్నీ ఆరిపోయాయి

తరువాతి షాటుగా లైటింగ్ ఏమీ మార్చకుండా కీర్తన తండ్రితో మాట్లాడటం తీశారు మరో షాట్‌కు ఏర్పాట్లు జరుగుతున్నాయి

మొదటి రోజు కావటం వల్ల సాయంత్రం వరకూ ఒక్క సీన్ తీయగలిగారు. అంటే దాదాపు ఇరవై షాట్లు సాయంత్రం నాలుగుకే 'ప్యాకప్' చెప్పాడు త్రిమూర్తి

(ఇంకా ఉంది)



ఆ రోజు పేపర్లో మొట్ట మొదటిసారి ఆ వార్త ప్రచురింపబడినప్పటి నుండి సుబ్బారావు సమస్య మొదలయ్యింది

స్కూటర్లు, మోటర్ సైకిళ్ళు, నడిపే వాళ్ళందరూ ఫలానా పద్ధతుల ప్రకారం తయారు చేసిన సేఫ్టీ హెల్మెట్లు ధరించాలని అలా ధరించకపోతే, ధరించనివారి పీక తీసేస్తారని ఆ వార్త సారాంశం ఇలా హెల్మెట్లు ధరించాలి అనే రూల్లో లేదు అసలు సమస్య ఆ హెల్మెట్ కింద వుండవలసిన సుబ్బారావు బుర్రలో వుంది'

సుబ్బారావుకి వున్న బలహీనత ఏమిటంటే హద్దులు మించిన మొహమాటం . ఎవడేది చెప్పినా గొర్రెలాగ తలవూపి ఆచరించెయ్యటం ఈ వార్త పేపర్లో చూడగానే సర్వీసేశ్వ ర్రావ్ (ఆయన అసలుపేరు సర్వేశ్వరరావు కాని అతనన్ని ప్రజాహిత కార్యక్రమాలలోకి జొరబడి పని చేస్తుంటాడని ముద్దుగా సర్వీసేశ్వర్రావ్ అని పిలుస్తారంతా') హెల్మెట్లు హోల్సేల్ పర్చేజ్ కార్యక్రమం చేపట్టాడు అతను అడగ్గానే నూట ఎనభై రూపాయలు యిచ్చేసాడు సుబ్బారావు అందరి వద్ద డబ్బులు కలెక్ట్ చేసిన సర్వీసేశ్వర్రావ్ స్వంత ఖర్చులు మీద కలకత్తా వెళ్ళి, బజార్లన్నీ గాలించి, హెల్మెట్లకి మంచి గిరాకీ వున్న తరుణంలో రెండు వందల హెల్మెట్లు కొని తెచ్చాడు

తనకు నచ్చిన రంగు కాక, మరొకడు మెచ్చి, ప్రతిపాదించిన రంగు హెల్మెట్ తీసుకొన్నాడు సుబ్బారావ్ అది కాస్త యిరుకుగా వున్నాసరే ఆ రోజంతా పెట్టుకు తిరిగేడు సాయంత్రానికి మెడజీవాలు నెప్పిపెట్టి, మెడ యిరుకు పట్టేసింది

మర్నాడు ఎవరో ఆఫీసుకి కొత్త వార్త మోసుకొచ్చారు హైదరాబాద్ పోలీసు కమీషనర్ హెల్మెట్లు పెట్టుకోవలసిన గడువుతేదీ పదిహేను రోజులు పొడిగించినట్లు ప్రకటించారని ఆ వార్త సారాంశం 'హమ్మయ్య!' అనుకొని ఆ రోజు నుంచి హెల్మెట్ మూలన పడేసాడు సుబ్బారావు మూడో రోజు పోలీసులు పట్టుకొన్నారు హెల్మెట్ పెట్టుకోలేదని ఆ రోజు దొరికిన సుమారు రెండు వందల మందిలోనూ, చాలాభాగం ఇలాంటి చట్టాలు అమలుపరచబడే విషయంలో నమ్మకం లేక" హెల్మెట్లు కొనుక్కోనివారో అందరూ తలొక యిరవై రూపాయలు కట్టేసారు సుబ్బారావులాగ హెల్మెట్లు కొనుక్కొని కూడా పెట్టుకోనివారొక పదిమంది వున్నారు సుబ్బారావు గోల పెట్టాడు. హైదరాబాద్ పోలీస్ కమీషనర్ ప్రకటించిన గడువు పొడిగింపు గురించి ప్రస్తావించాడు అది జంట నగరాలకే కాని విశాఖపట్నానికి వర్తించదని కొట్టి పారేసారు పోలీసులు సుబ్బారావు మళ్ళీ హెల్మెట్ వేసుకోవటం మొదలు పెట్టాడు, యిరవై రూపాయల జెల్లతో

మరుసటివారం మరొక కొత్త వార్త వచ్చింది హైదరాబాద్లో ఎవరో పెద్ద మనిషి ఈ రూలు పెట్టినతని కాంపిటెన్సీని ఛాలెంజ్ చేస్తూ కోర్టులో కేసువేసాడని అంచేత ప్రస్తుతం ఈ రూలుకి స్టే వచ్చిందని తెలిసింది మళ్ళీ అందరూ హెల్మెట్లు పెట్టుకోవటం మానేసారు సుబ్బారావు తెగించి ఒక రోజంతా హెల్మెట్ పెట్టుకు తిరిగితే అంతా నవ్వేరు మళ్ళీ సుబ్బారావు పెట్టుకోవటం మానేసాడు అకస్మాత్తుగా మరొక వారంలో చెకింగ్ జరిగి యిరవై వడ్డించేరు సుబ్బారావుకి లబోదిబోమన్నాడు సుబ్బారావు ఆ స్టే వెకేట్ చేసేసారని యిరవై రూపాయల జెల్లతో తెలిసింది మళ్ళీ హెల్మెట్ పెట్టుకోవటం మొదలు పెట్టాడు సుబ్బారావు

ఇది జరిగి పదిరోజులన్నాడు పేపర్లో మరొక వార్త పడింది హైదరాబాద్లో ఒక లాయరు వేసిన కేసులో ఈ రూల్ పాస్చేసిన అదికారికి అటువంటి అధికారం లేదని కోర్టు తీర్పు యిచ్చిందట మళ్ళా అంతా, సుబ్బారావుతో బాటు హెల్మెట్లు పెట్టుకోవటం మానేసారు ఆ మరుసటి వారం చెకింగ్ జరిగి, సుబ్బారావుకి మరొక ఏభై వదిలింది మళ్ళా లబోదిబోలు మామూలే ఈ సారి సరియైన అదికారికమైన ఆజ్ఞలు వచ్చేయన్న సంగతి తెలియడానికి సుబ్బారావుకి మరొక ఏభైఖర్చయింది

ఎవరూ పెట్టుకోకపోయినా హెల్మెట్ పెట్టుకొని వారం రోజులు తిరిగాడు సుబ్బారావు ఆ రోజు పేపర్లో హెల్మెట్లు పెట్టుకోవాలన్న హెచ్చరిక క్రిందనే హెల్మెట్ పెట్టుకోవాలన్న రూల్కి స్టే ఆర్డరిచ్చినట్టు దాని కోర్టు రిఫరెన్సు నెంబరు ఫలానా అని ఎవరయినా, ఆ రిఫరెన్సు కోట్ చెయ్యవచ్చు అని ఆ లాయరుగారి ప్రకటన వుంది

మళ్ళీ హెల్మెట్ పెట్టుకోవటం మానేసాడు సుబ్బారావు అందరూ తనని చూసి నవ్వుతున్నారని

ఇది జరిగిన అయిదో రోజునే చెకింగ్ అయి, సుబ్బారావ్ స్కూటర్ లాక్చేసి, తాళాలు పట్టుకు పోయాడు కానిస్టేబుల్

కానిస్టేబుల్ దగ్గర కోర్టు రిఫరెన్సు చెప్పినా లాభం లేకపోయేసరికి, హెడ్డుగారి దగ్గర కెళ్ళాడు సుబ్బారావు అక్కడ సుబ్బారావు బళ్ళలాంటివి సుమారు రెండు వందలు లాక్ చెయ్యబడివున్నాయి

తప్పదు మేష్టారు ఆ స్టే కేసు వేసిన లాయరుగారికి మాత్రమే సంబంధించినది మీకు 'వర్తించదు "

బాబ్బాబు ఈ ఒక్కసారికీ

'ముప్పై కట్టేస్తే పోయేదానికి ఈ టైము వేస్ట్ ఎందుకు సార్ '

ముప్పై ఏంటిసార్ ఇరవై కదా?

'మీరు వేస్ట్ చేసే మా ప్రతినిమిషానికి ఫైన్ పదేసి పెరుగుతుంది ఒరేయ్ రాములూ! 'ఈయన బండి వేన్ ఎక్కించి స్టేషన్లో పెట్టు రేపు తీసుకొంటారు. నలభైకట్టి '

గప్చిప్!

సుబ్బారావు డబ్బు కట్టేద్దామంటే జేబులో డబ్బులులేవు పదిరూపాయలు రానూ పోనూ మాట్లాడుకొని ఆటోలో యింటికెళ్ళి డబ్బులు తెచ్చాడు

డబ్బు కట్టే చోట చాలా రద్దీగా వుంది

రెండు మూడు వందల 'సి బుక్కులు' 'లైసెన్సులు' "తాళం చెవుల గుత్తులు' రాసులు






పోసివున్నాయి ఇద్దరు మనుషులు హో రాహోరీగా- ఒకరు కేస్ షీటు- ఒకరు ముట్టిన డబ్బుకి రసీదు రాస్తూ న్నప్పటికీ- క్యూ తరగటంలేదు

కాలం గడుస్తున్నకొద్దీ ఆ రద్దీలో తన తాళం చెవులు ఎవడు పట్టుకు పోతాడో అనే బయం పట్టుకొంది సుబ్బారావుకి

చివరికి చచ్చీ చెడి చేయంగల విన్నపాలుగా మూడు గంటల తర్వాత డబ్బుకట్టిన రసీదుతో బయటకొచ్చి, ఆ తాళం చెవుల కోసం బ్లాక్ మార్కెట్ వాడిలాగా గుంపులోకి జొరబడి జుత్తు రేపుకొని, లాల్చీ చింపుకొని, బుగ్గ గీచుకుపోయి, రెండు లారీ దెబ్బలకి బలి అయ్యాక స్వేచ్ఛా వాయువులు పీల్చాడు, సుబ్బారావు

మర్నాడు హెల్మెట్ పెట్టుకొని స్కూటర్ మీద ఆఫీసుకెళ్ళగానే, యిద్దరు ముగ్గురు వింతగా చూసారు సుబ్బారావుని మరొక పావుగంటకి ఒక స్నేహితుడు పలకరించాడు సుబ్బారావుని

"ఈ వేళ పేపరు చూడలేదుగురూ! హెల్మెట్ పెట్టుకోమని నిర్బంధించిన యిద్దరు పోలీసు కానిస్టేబుళ్ళు అరెస్టయ్యారట! నువ్వింకా హెల్మెట్ ఎందుకు పెట్టుకుంటున్నావ్? సుబ్బారావ్ టేబిల్‌మీదకి మెడసాచి అతని మొహంలోకి చూస్తూ అడిగాడు ఆ స్నేహితుడు

సుబ్బారావు మొదట నిస్తేజంగా చూసాడు స్నేహితుడి మొహంలోకి తర్వాత బేలగా చూసాడు తర్వాత కోపంగా చూసాడు తర్వాత ఆశ్చర్యంగా చూసాడు తర్వాత నవ్వుతూ చూసాడు తర్వాత అసహ్యంగా చూసాడు తర్వాత భయంగా చూసాడు తర్వాత ఆశగా చూసాడు తర్వాత నిరాశగా చూసాడు తర్వాత భోరుమని ఏడిచి, ఫైలు చింపేసి, బల్లఎక్కి నాలుగుసార్లు గెంతి, సరిగ్గా సీట్లో కూర్చొని, అలా అలా సీటుకి చేరగిలబడి స్పృహతప్పి పోయాడు

ఈ వికారమంతా చూసిన స్నేహ బృందం గాభరాగా ఆస్పత్రికి మోయసాగారు సుబ్బారావుని

తెలివొచ్చాక 'నేనెక్కడున్నాను?" అని అడగలేదు

నా హెల్మెట్టేది? అని తెలివి వచ్చిన వెంటనే అడిగేడు, సుబ్బారావు

స్నేహితులు గాబరాపడ్డారు

యింటి దగ్గర వుంది"

'తక్షణం తీసుకురండి ఈ క్షణం నుంచి యింటా బయటా, స్కూటరు తీసినా, తీయకున్నా ఒక్క క్షౌరం చేయించుకొనే సమయంలోను, తలకి నీళ్ళు పోసుకొనే సమయంలోనూ తప్ప, నేను అహర్నిశలూ హెల్మెట్ వేసుకొనే తిరుగుతాను ఈ కమ్యూనికేషన్ కన్ఫ్యూజన్‌లో రోజుకో యిరవై పెనాల్టీ మూడేసి గంటల కత్తి యుద్ధాలూ భరించలేను నా కాష్టంమీద కూడా శవాన్ని హెల్మెట్‌తోనే కాల్చాలని నా పిల్లలకి చెప్పండీ.. వెళ్ళండి బాబూ వెళ్ళండి నా హెల్మెట్ తెండి.. అంతవరకూ బ్రతకలేను." అంటూ ధామ్మని పడిపోయి స్పృహతప్పిపోయాడు పాపం సుబ్బారావు □

# ప్రశ్నావళి

– కె. రామలక్ష్మి



**పి. ఎస్. ఆర్. చేబ్రోలు**

★ నేను మీ యింటికి వస్తే మీ యింట్లో లైబ్రరీ చదవడానికి ఎన్ని రోజులు పడుతుం దంటారు?

● తెలియదు ఓ ముప్పయి ఏళ్ళలో నేనూ చదవనివి చాలా వున్నాయి. ఇదేం – అనుబంధ గ్రంధాలయం అనుకుంటున్నారేమిటి?'

**ఎస్. కె. కె. నెల్లూరు**

★ స్త్రీలు అన్నిరంగాలలోను ప్రవేశించి వున్నారు గాని ఎక్కడా బస్సు డ్రయివింగు చేస్తున్నట్టు లేదు వీరు అర్హులు కారా?

● కాకేం? కాని శారీరక శక్తి చాలదేమో – నాకు తెలియదు అయినా స్త్రీలు డ్రయివింగు చేస్తే – ప్రమాదాలు తక్కువగా అవుతాయని నా గట్టి నమ్మకం మా వూళ్ళో నేనో ఆటో రిక్షా తోలే అమ్మాయిని – చూశాను ఆఫీసు వేళలలాగా బండి తోలుతాననీ, దీనివల్ల కాస్త ఆదాయం తక్కువే అయినా – పిల్లల స్కూలు, చదువుకి యిబ్బంది రాదని చెప్పింది

**ఎల్. పి. ఆర్. జె. నగరు (గుజరాత్)**

★ 2000 సం లో ప్రళయం వస్తుందన్నారు ఇంకా 14 సం బాకీ వున్నదా?

● లేదు. రోజుకో ప్రళయంగా -- జరుగుతూ వస్తూంది కదా'

**ఎస్. ఆర్. నేలకొండపల్లి**

★ వివేక హీనులైన వారి పతనం వేయి విధాలుగా వుంటుంది. కామెంట్ ప్లీజ్

● సహజమే కదా'

**బి. వి. ఆర్. హైదరాబాదు**

★ 'కళ' తీర్చుకోడాని కింత పెద్ద సినిమాలు, నవలలు రాయాలా?

● కావాలి కని చాలా కాస్ట్లీ లక్జరీ!

**సి. హెచ్. ఎన్. ఆర్. సత్తెనపల్లి**

★ అనువంశిక అర్చక విధానం రద్దు చేయడం సమంజసమా?

● నాకు తెలియదు గాని భక్తిలేని అర్చకులు పూజలు చేయించడం – దండగ

★ వేమనకు గుడి కట్టించడం అతని సూక్తులను భంగపరచడం కాదా?

● గుడి కట్టించి కూర్చో పెట్టారంటే – అతని మానవ విలువలకిక స్వస్తి అనే అర్థం

★ మీ యింట్లో ఒక రచయితగా, మీకు వారసురాలిగా రాణించగల కుటుంబ సభ్యులెవరైనా వున్నారా?

● సాహిత్యానికి వారసత్వం వర్తించదు స్వయం ప్రతిభ కావాలి ఉంది. లలిత చాలా చక్కని ఆధునిక శైలిలో రాయగలదు.

**ఎస్. ఎస్. బి. జల్లేడుపల్లి**

★ మీకు జవాబులివ్వడం తప్పించి వేరే పని లేదా?

● లేదు'

**పి. ఎమ్. చేబ్రోలు**

★ చచ్చి సాధించే దేమిటి?

● ఏం వుండదని చావడానికి ముందే తెలుసుకోవడం చాలా అవసరం

★ దేవుణ్ని అడ్డం పెట్టుకొని దొంగ వ్యాపారం చేసేవాడిని దేవుడెలా శిక్షిస్తాడు?

● శిక్షించడం లేదు పైగా వారి వ్యాపారాభివృద్ధిని దీవిస్తూ లాభాల్లో భాగం అందుకుంటున్నాడు!

**టి. హెచ్. సి. పొందూరు**

★ నేటి సమాజంలో ఆడవారి పాత్ర ఎంత వరకు?

● పురుషులు కోరిన మేరకు!

**ఎ. ఎస్. ఆర్. ఖర్గపూరు**

★ మీ ధర్మసూత్రం నవలలో మూర్తి మనసు బాగో లేనప్పుడు జింఖానాకి పోతాడు అది ఏ భాష మేడమ్

● జింఖానా క్లబ్ కి పొట్టి మాట – జింఖానా. ఇంగ్లీషే!

**టి. జె. ఆర్. విజయవాడ**

★ నల్లకోటుకు తెల్లకోటుకి తేడా ఏమిటి?

● రంగు!

**యస్. వి. ఆర్. జువారి నగర్**

★ నేటి సమాజంలో సత్యం ధర్మం న్యాయం ఎంత వరకు వుంటుందంటారు?

● మన వాదనలో ఉంటుంది
ఎదుటివాడి వాదనలో వుండదు!

★ ఆడదానికి అన్ని వరాలకు మించిన దేమిటి?

● ఏం లేదు?

**పి. ఎన్. ఆర్. సామర్లకోట**

★ మా అన్న బ్యాంకు ఉద్యోగి దూరంగా వున్నప్పుడు ఉత్తరాల్లో నేనున్నాను మీకు అనేవాడు ఇప్పుడు ఇంట్లో వుంటూ– మీకేం కావాలి అని అడిగాడు. ఎందుకని?

● దీన్నే దూరపు కొండలు నునుపు అనడం బాధ్యత మీద లేనప్పుడు– ఎంతైనా ఆదరణ చూపవచ్చు అవి మీద పడితే– తప్పించుకు పారిపోవాలనిపిస్తుంది, మానవ సహజమైన కోరిక

**రోశయ్య, పాల్వంచ**

★ ఆరుద్రగారు నాస్తికులు మీరేమో గొప్ప ఆస్తికులు సంసారం సాఫీగా వుందాండీ!

● దివ్యంగా వుంది– ఒకరి నమ్మకాలు– ఇంకొకరిపై రుద్దే అలవాటు మా యిద్దరికీలేదు!

★ మీరేమో ఋతు ధర్మానుసారం సీరియల్స్ కథలు రాస్తామంటున్నారు ఆంధ్రదేశం నుంచి వస్తున్న అన్ని రకాల పత్రికలలో ఒక రచయితే సీరియల్స్ అందించ కల్గుతున్నాడు. మీరు రాయలేరా?

● నాకంత శక్తి లేదని ఒప్పుకుంటున్నాను.

ఒక్క సీరియల్ రాస్తూంటే 'ఎన్నాళ్ళు రుబ్బ దల్చావు" అని అడిగేవారు గోరాశాస్త్రి!

**బి. ఎస్. ఆర్. సీతానగరం**

★ నామిత్రుడొకడు వరకట్నాన్ని– అది వరకట్నం కాదు– ఆస్తిలో అమ్మాయికి రావలసిన భాగంలో కొంత మాత్రమే అంటున్నాడు

● అతనొక చదువుకున్న మూర్ఖుడని–, చెప్పుకోవాలి ఆస్తిలో భాగం అమ్మాయికి– పెళ్ళిలో కొంత యివ్వాలా?! □






(గత సంచిక తరువాయి)

సీత పడబోయింది

పడిపోతున్న సీతను, "సారీ మేడమ్" అంటూ లేవనెత్త బోతూ రెండు చేతులూ పట్టుకున్నాడు కళ్ళద్దాలతడు

'సారీ' అన్న ఆ గొంతు పరిచితంగా అనిపించి ఒక్క సారిగా చేతులు విడిపించుకుని పరుగెత్త బోతుంటే వెనక నుండి నోరు నొక్కేశాడు తాష్ కొట్టిన మనిషి

కనురెప్ప పాటులో సీత కళ్ళకు గుడ్డ బిగించారెవరో .

మరు క్షణంలో సీతను కారులోకి తోసేశారు .

ఆ గొంతు ఎక్కడ విన్నదో సీతకు గుర్తొచ్చే సరికి కళ్ళకు గుడ్డ, నోటిలో కుక్కిన గుడ్డలు యీ లోగా కారు స్టార్ట్ అయింది

పెనుగులాడ్డానికి చేతులు రెండూ పట్టి వున్నాయి ఇద్దరు బలవంతులైన మనుషుల మధ్య పెద్దపులి నోట్లో తల పెట్టిన లేడి పిల్లలా గింజుకుంటున్నది

కారు కదిలి కొంచెం దూరం పోగానే చేతులు మణికట్టు దగ్గర మెలిపెడుతూ,

"ఏమే నన్ను నెత్తి మీద కొట్టి తప్పించుకు పోగలనను కున్నావే " చాలా వ్యంగ్యంగా అంటూ చేతులు మెలిదిప్పి గుడ్డతో కట్టేస్తూ అన్నాడు పక్కనున్న వాడు

ఆ గొంతు తను నెత్తి మీద కొట్టిన వాడి గొంతు అంటే వాడు చావలేదు . యీ పక్క వాడు తనకు రైల్లో తటస్థ పడ్డ వాడు

తన పరిస్థితి అర్థమయ్యే సరికి పై ప్రాణాలు పైనే పోయినయి తను మంచికి పోయి ఆ వీధి దాటి వచ్చేసింది . డాక్టరు గారూ వాళ్ళు తనను చూసే అవకాశం వుందో లేదో

రెండో సారి తనంత తానుగా ప్రమాదాన్ని కోరి తెచ్చుకుంది' మంచికి పోయి పెద్దపులి నోట్లో తలపెట్టింది'

సీతకు చెమటలు పోశాయి తను చంపానని అనుకున్న వాడు పక్కన కూర్చుని బండ బూతులు తిడుతున్నాడు అతడి స్పర్శ జుగుప్సాకరంగా వుంది మోచేతులో పక్కల్లో పొడుస్తున్నాడతడు

నా చేతిలో చిక్కి, ఆ బ్యాంకి వాడు మొగుడని చెప్పి పైగా ఆత్మహత్య చేసుకున్నట్టు నాకే మస్కా యివ్వాలనుకున్నావా' యిటుపక్క వాడంటున్నాడు యింత కటువైన గొంతును అంత సౌమ్యంగా ఆ కొట్లో ఎలా మార్చగలిగాడో తనకు తెలియటం లేదు ఆ కళ్ళద్దాల వాడు

తమను వెన్నంటి ఎవరన్నా వస్తున్నారా?

తన వాళ్ళు ఏమయినారు? ఇంకా అక్కడే చూస్తూ వుందుంటారా?

తను వీధి తిరగడం వాళ్ళు చూసుండరా?

మిగతా పోలీసులంతా ఏమయ్యారు?

క్షణక్షణానికీ టెన్షను పెరుగుతోంది సీతకు

* * * * * * * * *

ప్రసాద్, శ్యామసుందర్ గారూ బ్యాంకి వుద్యోగాల గురించి, ప్రసాద్ ప్రమోషను టెస్టుల గురించి మాట్లాడు కుంటున్నారు

టెస్టులన్నీ పాసయ్యాను ప్రమోషను రావలసిందే కానీ ఏదో అంటారు చూడండి యింటర్వ్యూలో ఏదో తమాషా చేస్తారు . ఏదైనా పలుకుబడి . డబ్బూ యీ రోజుల్లో యివి లేని వాళ్ళు యితరత్రా ఏమున్నా లేనట్టే అంటున్న ప్రసాద్ ఆగి పోయి, అవును సీత యింకా బయటికి రాలేదేమిటి ఆ కొట్లో యింకా ఏం చేస్తోందో? వెళ్ళి చూసిరానా ' అంటూ బయలు దేరాడు

నిజమే . ఆ కొట్టు నుండీ బయటకు వచ్చినట్టు లేదు వెళ్దాం పదండి అంటూ యిద్దరు వచ్చారు

అక్కడ కొట్లో కనబడక పొయ్యేసరికి ఖంగారుపడి లోపలికి వెళ్ళి అడిగితే ఆమె గాజులు కొన్నారండీ ఈలోపల ఎవరో నల్లకళ్ళద్దాలతడు వచ్చి చీరలు సెలక్టు చేసి పెట్టమంటే వెళ్ళారండి" అని చెప్పారు

వాళ్ళు చూపించిన కొట్టు దగ్గరకు వెళితే, వాళ్ళు 'మా కొట్లోకి ఎవ్వరూ ఆడ మనిషి రాలేదండి పెళ్ళికని చీరలుకూడా ఎవ్వరూ తీసిపెట్ట లేదే . ఒకాయన మాత్రం ఓ అయిదు నిముషాల పాటు కొట్లో కూర్చుని వెళ్ళాడు అతడు వెళ్ళిన నిముషం కూడా కాక ముందే మా కొట్టు ముందు పెట్టిన కారు బయలు దేరడం మాత్రం విన్పించింది' అని చెప్పారు

వాళ్ళు పోలీసులను అలర్ట్ చేసి కారులో బయలు దేరారు

* * * * * * * * *

జరిగిన కథ–15: ఐదు సంవత్సరాల తర్వాత లక్ష్మి పేరుతో కలిసిన సీతనుంచి ఆమె వివరాలన్నీ రాబడతాడు శ్యామసుందర్ ఐదు సంవత్సరాలలో సీత పడిన బాధల్ని చట్టపరంగా తొలగిద్దామనే ప్రయత్నంలో ప్రసాద్‌ను కలుస్తాడు సీత వెంట గూండాలు పడిన వైనమూ, ప్రసాద్ ఆమెను రక్షించడం, ప్రసాద్‌కు ప్రమాదం జరగకుండా ఉండాలని ఆమె పారిపోవడం, ప్రయాణంలో కలిసిన మిలిటరీ ఆఫీసర్ చదువు చెప్పించటం అన్నీ బైటికి వస్తాయి ఆ ముఠాను వెతికి పట్టుకోవడంకోసం సీతను మళ్ళీ హైదరాబాద్‌లో ఆ వీధులన్నీ తిప్పుతూ శ్యామసుందర్, ప్రసాద్, పోలీసులు రక్షణగా తిరుగుతుంటారు. ఒక వ్యక్తి సీతను బట్టలకొట్లోకి రమ్మని పిలుచుకుపోతాడు

"వెనక కారు ఫాలో అవుతున్నట్లు అనుమానంగా వుంది బాస్" ముందు సీటు నుండి డ్రైవ్ చేస్తున్నతడిది కాబోలు గొంతు

సీతకు కొంచెం ధైర్యం వచ్చింది

రోడ్డు మీద ఏ కారు పోయినా మనల్నే ఫాలో అవుతుందనుకోడం నీ జబ్బు ఏం లేదు స్పీడు పెంచకు అనుమానం వస్తుంది మామూలుగానే పోనియ్యి '

ఈ కారు పక్కగా వాళ్ళ కారు వెళ్ళినా భర్త వాళ్ళు గుర్తుపట్టడం కష్టమని సీతకు తెలుసు రోడ్డును క్రాస్ చేస్తూ ఆకారు చూసింది దానికి పర్దా లేడీస్ ఎక్కితే వున్నట్లు చుట్టూ కర్టెన్స్

పిల్లి నోటికి చిక్కిన ఎలకలా వుంది సీతకు భర్త వాళ్ళు ఎంత వరకూ కనుక్కో గలరో, ఎంత వరకూ రక్షించ గలరో తెలియదు

కొంచెం కదిలినా రెండు వైపులా కూర్చున్న వాళ్ళు కసి తీర్చు కుంటున్నట్టు మోచేత్తో పొడవడం లేదా చేతి దగ్గర మెలి పెట్టడం... యమలోకంలో వున్నట్లుంది సీతకు.....

"బాస్.... కారు మనం ఎన్ని వీధులు తిరిగినా వెంట వస్తున్నట్లు వుంది.... దోవ తప్పించనా లేక అక్కడికే తీసుకు పోనా? "

స్పీడప్ చేసి అక్కడికే పోనీ

సీతకు కారు ఎన్ని మలుపులు తిరుగు తున్నదో తెలియటం లేదు కానీ వొళ్ళు హతలా పుతలం అయ్యేలా వుంది డ్రైవింగ్

సీత ఆ కారు దగ్గరకు వస్తున్నదేమోనని, చెవులు రిక్కబెట్టుకుని వింటున్నది పక్కవాడు తిట్టే బండబూతులు కాస్త తగ్గాయి.... కళ్ళద్దాల వాడు మాట్లాడ వద్దని సైగ చేసినట్టున్నాడు

'బాస్ వున్నట్లుంది ముందు సీటు నుండి విన్పించింది "ఆ బ్యాంకివాడు... ఆ కార్లో వున్నాడు బాస్ ఆ కారు చాలా స్పీడులో వస్తోంది'

సీత దేముడ్ని ప్రార్థిస్తోంది భగవంతుడా యీ ఒక్క సారికీ నా మొర విను వాళ్ళు నన్ను చూసేట్టు చెయ్యి

"సమయం చూసి స్లోడౌన్ చేసి కొట్టెయ్ పక్కవాడి యిన్‌స్ట్రక్షను.

వాళ్ళు తనను దాటి పోకుండా ఏమన్నా చెయ్యాలి

మళ్ళీ ఆ నరకంలోకి ప్రాణాలతో తను వెళ్ళ కూడదు.

పిచ్చి ఆవేశం వచ్చింది సీతకు

బలమంతా వుపయోగించి తలతో పక్కవాడిని కుమ్మడం మొదలెట్టింది....

పక్కవాడు ఒక్క సారి బాధతో జర్క్ యిచ్చాడు

ఎంత పొగరే నీకు? నీకంతకావరం అక్కడికి పోనీ అనుకున్నాను 'చిన్నగానే బూతులు తిడ్తూ, 'దీన్ని ముందుకు నెట్టు బాస్ అంటూనే వెనగ్గా వున్న సీతను ముందుకు నెట్టాడు జుట్టుపట్టి

ఈలోపల కారు జర్క్ యిచ్చింది కారే బోల్తా పడ్తోందనిపించి సంతోషం వేసింది సీతకు ఆ అమ్మాయి తల వెళ్ళి ముందు సీటుకు కొట్టుకుంది కూడా

నువ్వు చెప్పినట్టే చేశాను బాస్ కారు గుల్లయి వుండాలి ఆదెబ్బతో ఆ బాంకి వాడు

ఊపిరి బిగపట్టి వింటోంది సీత తమకారు గుల్లయిందంటే, బ్యాంకి అతడు నుగ్గు నుగ్గు అయ్యుండాలంటే ప్రసాద్ గారు, అతడితో వున్న తన భర్త యిద్దరూ బోల్తా పడివుండాలిగా! వాళ్ళు ఎలా వున్నారో? దెబ్బలు తగిలితే యింకేమన్నా అవుతే . యిక తనను రక్షించే వాళ్ళెవరు?

ఆ నరక కూపం నుండి తనను కాపాడే వాళ్ళెవరు....

ఆ బతుకు కంటే చావు మేలు....



## ఒకటి ఒకటి మూడు

వాళ్ళిద్దరికీ ప్రమాదకరమైన దెబ్బలు తగిలితే?

భగవంతుడా వద్దు వద్దు యీ ఒక్కసారి నా మొర విను వాళ్ళకేమీ కానివ్వకు

నా ప్రాణం తీసుకో

నా ప్రాణం తీసుకో

కారు వాళ్ళున్న చోటికి చేరేలోపల తన ప్రాణం పోవాలి

తన శవం మాత్రమే చేరాలి – అక్కడికి

ఒకానొక డెస్పరేట్ మూడ్‌లో ఎలాగో ముందుకు నెట్టారు గనుక, తల ముందు సీటుకు తగిలి బొప్పి కట్టేవుంది కారు డోరు ఎంత దూరంలో వుందో వూహించుకోగలదు

అందుకే బలమంతా వుపయోగించి ఆఖరి ప్రయత్నంగా తల డోరు హాండిల్‌కు కొట్టుకునేట్టుగా కొట్టుకుంది

ఆ తలుపు తెరుచుకోవాలి నెత్తురు ముద్ద అయినా అందులో నుండి పడిపోవాలి లేదా తల పగిలి తను చచ్చిపోవాలి

అదే తన ఏకైక లక్ష్యంగా పిచ్చిగా గబగబా కొట్టుకున్నది తల

బలంగా రెండు చేతులు వెనక్కి నెట్టడం తెలుసు

ఆ తలుపు తెరుచుకుందో లేదో తెలియదు కానీ రక్తం ధారలు కట్టడం తెలుసు

క్రమంగా తల మొద్దుబారి చీకట్లు ఆవరించుకోడం గుర్తు

అలా ఎంతసేపు అపస్మారక స్థితిలో వుందో తెలియదు

తెలివి వచ్చేసరికి తన చేతిని ఎవరో పట్టుకున్న స్పర్శ తెలుస్తోంది

అదిరి పడి పాము మీద పడితే విసిరి కొట్టినట్టు ఆ చేతిని విసిరి కొట్టి, "వదలండి నా శవమే దక్కుతుంది మీకు నాశవమే' అంటూ పెనుగులాడుతోంది

'సీతా యిటు చూడు నేను నేను సీతా' ఒక చేతిని తన చేతితో పట్టుకుని రెండో చేత్తో కుదుపుతూ అన్నారు శ్యామసుందర్‌గారు

నెమ్మదిగా కళ్ళు తెరిచింది సీత

ఎదురుగా భర్త తన మంచం మీదనే కూర్చుని తన చేతిని చేతిలోకి తీసుకుని చూస్తున్నాడు

నెమ్మదిగా కళ్ళెత్తి కొంచెం పక్కగా చూసింది ఎలా వుంది సీతా?

ప్రసాద్‌గారు మంచానికి అంత దూరంలో నిలబడి ఆత్రుతగా చూస్తున్నారు ఏంతగా ఆశ్చర్యంగా యిక్కడెందుకున్నానా అన్నట్టు కలయ చూస్తుంటే తలుపు దగ్గరగా పోలీసాఫీసరు కన్పించాడు

అయి థింక్ షియీజ్ ఆల్‌రైట్ డాక్టర్ అనేసి,

యిక మేము వెళ్ళొస్తాం' అని చెప్పి వెళ్ళిపోయారు వాళ్ళు నెమ్మదిగా అంతా చూసి,

ఎక్కడున్నాను అన్నది సీత అతి హీన స్వరంతో

"ఇక్కడే హాస్పిటల్లో

'హాస్పిటలా! యిక్కడి కెందుకు వచ్చాం అంటుంటే తల బరువుగా అనిపించి తడుముకోబోతుంటే,

అహఁ ఏం లేదు కట్టు కదపకు నుదుటికి దెబ్బ తగిలితే సూచర్స్ పడ్డాయి. అంతే అంటూ చెయ్యి తీసేశారు డాక్టరుగారు

సీతకు అప్పుడే గుర్తొచ్చింది ఏం జరిగిందో కారులో వాళ్ళ సంభాషణ

'మీకు మీకు దెబ్బలేం తగల్లేదు కదా? ఆత్రుతగా అడిగింది శ్యామసుందర్ గార్ని, ప్రసాద్‌ను కంగారుగా చూస్తూ

మాకు దెబ్బలేమిటి సీతా ఎవరు చెప్పారు?

"వాళ్ళు వాళ్ళు అన్నారుగా ఆ కారు డ్రైవరనుకుంటాను మీ కారుకు డాష్ యిమ్మని వాడు వాడే చెప్పాడు ముందు సీట్లోంచి విన్పించింది మీ కారు నుగ్గునుగ్గు అయిందని ప్రసాద్‌గారికి మీకూ బాగా దెబ్బలు



"ఏ వ్యక్తి అయినా
తన కుటుంబానికి
సంపూర్ణ రక్షణ నివ్వగలిగేది
యుఎల్ఐపి
ద్వారా మాత్రమే"

శ్రీమతి పుష్పాపిళ్ళై-గృహిణి

—ఇతర వివరాలకు ఈ కూపను పోస్టుచేయండి.

Unit Trust of India, Post Bag 5063, Madras – 600 001.
Please send me the free ULIP brochure
Name: ______________________
Address ______________________
______________________
______________________
19

యూనిట్ లింక్డ్ ఇన్సూరెన్సు ప్లాను మీకు
రూ. 3,000 నుండి 40,000 దాకా పెట్టుబడి పెట్టే
అవకాశాన్నీ, ప్రమాదాలనుంచీ భీమా, జీవిత భీమా
రక్షణమూ, కాలపరిమితి ముగిసిన తరువాత 75%
వరకూ బోనస్‌నూ, ఇంకా ఐటి ఆక్టు 80C
ప్రకారము పూర్తి ఆదాయపు పన్ను మినహాయింపును
కలుగజేస్తుంది.

**10 సంవత్సరాల ప్లానుకు వయసు అర్హత**
**50 సంవత్సరాలకు పెంచబడింది.**

రూ. 40,000 టార్గెట్ మొత్తమునకు ఏటా
రూ. 4,000 కట్టటంద్వారా, 10 సంవత్సరాల
తరువాత రూ. 69,000 నుండి రూ. 72 000
వరకు పొందగలరు.
యుఎల్ఐపి మీ కుటుంబానికి రక్షణ కల్పిస్తే,
యుఎల్ఐపి వెనుకనున్న యుటిఐ మీ పెట్టుబడి
మొత్తమునకు రక్షణ కల్పిస్తుంది.
అందుకే సరైన నిర్ణయంతీసుకోండి, ఈ రోజే మీకు
దగ్గరలో ఉన్న ఏ కెనరా బ్యాంకు శాఖ వారినిగాని
లేదా యూనిట్ ట్రస్టు ఏజెంటు లేదా ముఖ్య
ప్రతినిధులను కలవండి.

## యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా

హెచ్ ఓ. బొంబాయి-400 020
(ఒక పబ్లిక్ సెక్టార్ ఆర్థిక సంస్థ)

రీజనల్ ఆఫీసు. రెజినామాన్షన్. 46. 2వ లైను బీచి,
మద్రాసు-600 001 ఫోను 27433, 24146
విజయవాడ ఆఫీసు: 27-11-6బి మేరీస్ట్రీట్, గవర్నరుపేట
విజయవాడ-520 002. ఫోను. 63964

ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్య ప్రతినిధులు:
శ్రీ కె వి. తిలక్, గుంటూరు. ఫోను 24964, 31839 ●
శ్రీ వై. సోమసుందరరావు, తణుకు. ఫోను 2440 ●
శ్రీ పి. నారాయణస్వామి, విశాఖపట్టణం ● శ్రీ ఎస్. వీరరాఘవులు,
గుంటకల్లు ఫోను: 579 ● శ్రీ ఎ.ఆర్. కృష్ణారెడ్డి, కడప.
ఫోను. 2766 ● శ్రీ కె వి. కోటవీరయ్య, తిరుపతి ఫోను 3004
శ్రీ పి. వెంకటరమణ, కాకినాడ. ● శ్రీ ఎ. సత్యనారాయణ, నెల్లూరు

# యుఎల్ఐపి సకలమూ ఉన్న పథకం

Sista's - UTI.640.86 TE A R



# అభినేత్రి భానుప్రియ సమాధానాలు

**ఆర్. జి. రెడ్డి, చిత్తూరు**

మీరు విజయశాంతిలాగ విప్లవాత్మక చిత్రంలో నటించిన మీ ముఖ కవళికలు చూడాలనిపిస్తుంది నటించగలరా?

గలను!

**పి. ప్రదీప్, కరీంనగర్**

కథాబలం గల చిత్రాల్లో మీరు అద్భుతంగా నటిస్తారు కదూ?

కథాబలం లేకపోతే ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు.

**సాలి కృష్ణమోహనరావు, గంటిపాడు**

ప్రతిభావంతుడు, అనాదిగా ఆతడి చిత్రాల గురించి మీ అభిప్రాయం ఏమంటారు?

మంచి చిత్రాలని.

**అల్లు త్రినాథ్, గజపతినగరం**

భానుప్రియగారూ! మీరు అందరు హీరోల సరసన నటించారుగాని, శోభన్‌బాబు సరసన నటించలేదు ఎందుకని?

ఇప్పుడు నటిస్తున్నాను.

**దబ్బీరు అజయ్‌కుమార్, కట్టుబోలు**

సమాజానికి పనికివచ్చేదే ఉత్తమ చిత్రం అంటాను కామెంట్ ప్లీజ్

ఐ అగ్రీ విత్ యూ!

**జి. శ్రవంతిరెడ్డి, నిజామాబాద్**

ఇంత వరకు మీరు పోషించిన వివిధ పాత్రల్లో మీ మనస్తత్వానికి సరితూగే పాత్ర మీకు లభించిందంటారా?

లేదనే అనుకుంటాను.

**ఎం. వెంకటరమణ, హైదరాబాద్.**

రాజకీయాల్లో లాగే మీ హిందీ చిత్రరంగ ప్రవేశం తర్వాత మీ వారసురాలిగా మీ చెల్లెలును తెలుగురంగానికి అందిస్తున్నారా?

అని ఎవరు చెప్పారు మీకు?

**చలసాని స్రవంతి, కొవ్వూరు**

కులానికి, మతానికి తేడా ఏమిటి?

అవన్నీ మనుషులు కల్పించినవి. ఏ తేడాలు వుండకూడదు!

**జి. శాంతి, బరంపురం-2**

ప్రతి ఆడపిల్లా పెళ్ళి చేసుకునే తీరాలా?పెళ్ళికానిదే ఆమె జీవించలేదా? మీ అభిప్రాయం తెలుపుతారా?

పెళ్ళి చేసుకోకుండా జీవిస్తున్న వాళ్ళు బోలెడు మంది వున్నారు.

## ఉత్తమ ప్రశ్న

**ఎ. శ్రీదేవి, పర్చూరు**

స్త్రీకి స్త్రీయే శత్రువు కాకుండా స్త్రీ మనస్సు స్త్రీ అర్థం చేసుకుని ప్రవర్తించినప్పుడు పురుషులకు స్త్రీల పైన చులకన భావం ఉండదని మా అభిప్రాయం మరి మీ అభిప్రాయం ఏమిటక్కా?

నీ అభిప్రాయమే నా అభిప్రాయము!

**నాగపట్ల రాజగోపాల్, తిరుపతి**

జగతికి వెలుగునిచ్చే భానుప్రియా ఎవరో?

ఆ కర్మ సాక్షి!

**మేళం శ్రీకాంత్, రాజాపాలెం**

చిరంజీవిపై మీ అభిప్రాయం?

చాలా మంచి అభిప్రాయం.

**బెస్త చిన్న కేశవులు, సుండిపెంట**

భానుప్రియగారూ! మీరు ముఖ్యంగా అభిమానించే వ్యక్తి ఎవరు?

మా అమ్మ.

మీ ఆశయం ఏమిటి?

—ఉత్తమ నటిగా పేరు తెచ్చుకోవాలని.

**కె. త్రినాధరావు, శ్రీకాకుళం**

మీరు ఇదివరకు నాటకాలలో నటించారా?

లేదు బాబూ! చూసేదాన్ని!

**ప్రసన్నకుమార్, ఏలూరు**

జీవితం జీవించడానికేనా! ఏమైనా సాధించడానికా? సాధించాలనుకున్నప్పుడు ఆత్మవంచన చేసుకుని వ్యక్తిత్వాన్ని చంపుకోవచ్చా?

అది వాళ్ళ వాళ్ళ మనస్తత్వాన్నిబట్టి వుంటుంది.

**డి. కృష్ణకుమారి, రాజాం**

ఎంతో మంది నటీమణులు మనకున్నా- వారికి అవకాశం ఇవ్వకుండా పర భాషలవారిని ఎన్నుకుని ఎందుకు చిత్రాలు తీస్తున్నారు?

అర్హత వున్న వాళ్ళకే అవకాశాలు వస్తాయి!

**పూనాటి రాఘవేంద్రరావు, వేపినాపి గ్రామం**

పెళ్ళినాడు కట్టే తాళిబొట్టులో తాళి ప్రధానమా? బొట్టు ప్రధానమా?

ఆ రెండూ కలిపే తాడు ముఖ్యం.

**ఎన్. ఫణీంద్రబాబు, గణపవరం**

బాలెట్‌లలో గెలుపొందాలంటే ఏమి చెయ్యాలి!

ఉత్తమంగా నటించాలి.

'అనసూయమ్మ గారి అల్లుడు' చిత్రంలో మీ నటన బాగుంది

కూపన్. —థాంక్స్.

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## భానుప్రియ సమాధానాలు

ప్రశ్న : ______________________________

______________________________

______________________________

పంపిన వారి పేరు ______________________________

పూర్తి చిరునామా ______________________________

______________________________

# సినిమా విశేషాలు

—జి వి జి

## ఎ ఎన్. ఆర్., నాగార్జునలతో రాఘవేంద్రరావు దర్శకత్వంలో "అగ్నిపుత్రుడు" 70 ఎం ఎం చిత్రం

"వైదిక కర్మలలో అగ్ని పవిత్రమైనదని పరిశుద్ధమైన దన్న ధార్మిక సిద్ధాంతాన్ని చాటి చెప్పడమే ఈ చిత్ర కథాంశం శిధిలమై పోతున్న మతాన్ని ఉద్ధరించే మహనీయుడుగా అక్కినేనిగారు, మానవత్వాన్ని ఉద్ధరించే యువతరం ప్రతినిధిగా నాగార్జున అటు అలో చనకు – ఇటు ఆవేశానికి సయోధ్యగా నిలిచే పాత్రలో శారద నటిస్తున్నారు ఫిబ్రవరి 1 నుంచి అన్నపూర్ణా స్టూడియోస్‌లో పక్షం రోజుల పాటు షూటింగ్ అమరావతి మారేడుమిల్లి ప్రాంతాలలో కొంత ఔట్‌డోర్ షూటింగ్ ఉంటుంది మేలో పూర్తయి పోతుంది", అన్నారు కె. రాఘవేంద్రరావు.

ఈయన దర్శకత్వంలో శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించే అన్నపూర్ణా స్టూడియోస్ వారి పై 70 ఎం ఎం చిత్రంలో రజని సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్ గొల్లపూడి పి ఎల్ నారాయణ వేలు చలపతిరావు పూర్ణిమ పై విజయ చంద్రిక అరుణ కృష్ణవేణి మరో నవనటి పాల్గొంటున్నారు పరుచూరి సోదరులు కథ మాటలు రాశారు వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం. కె. ఎస్. ప్రకాష్ ఛాయ, ఎ ఎస్ రెడ్డి సంయుక్త దర్శకత్వం రఘు నృత్యాలు హరి– సామ్రాట్ సహకార దర్శకత్వం జి రామారావు – శ్రీనివాస్ ప్రొడక్షన్ భాస్కరరాజు శిల్పం కె వెంకటేశ్వరరావు కూర్పుతో వెంకట్ అక్కినేని నిర్మాత

## 'జీవన సంధ్య"

జనవరి 18 నుండి 31 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది తదుపరి షెడ్యూల్స్ ఫిబ్రవరి 20 నుండి 28 మార్చి 25 నుండి 31 అన్నారు లోగడ సి ఎస్ రావు పి సాంబశివరావు రేలంగి నరసింహారావుల వద్ద శిష్యరికం చేసిన కొండవీటి సత్యం ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో తాడికొండ ప్రతాప్ కె మల్లికార్జునరావు నిర్మిస్తున్న తారాపథ మూవీస్ వారి పై చిత్రంలో కార్తీక్ సాగరిక పూర్ణిమ బాలాజీ జె వి సోమయాజులు వై విజయ చంద్రిక మున్నగు వారు నటిస్తున్నారు దాసం గోపాలకృష్ణ మాటలు, వేటూరి గీతాలు, రాజ్–కోటి సంగీతం, ఆర్. రామారావు ఛాయ, భాస్కరరావు శిల్పం, డి. వి. కుమార్ ప్రొడక్షన్, జి. త్రినాధరావు కూర్పుతో కె. హరిబాబు సహనిర్మాత.



"దొరికితే దొంగలు"లో శోభన్‌బాబు, విజయశాంతి



"మకుటంలేని మహారాజా"లో శ్రీదేవి

## సినిమా

# కృష్ణ, కె. విశ్వనాధ్ కాంబినేషన్‌లో రవికళామందిర్ చిత్రం

కృష్ణను వెలుగులోకి తీసుకొచ్చినది కె విశ్వనాద్ గురువు కీ శే ఆదుర్తి సుబ్బారావు ఆయన పుత్రుడు ఆదుర్తి సాయిభాస్కర్‌తో పాటు ఎం ఎస్ ప్రసాద్ కలిసి నిర్మించే చిత్రానికి మార్చిలో అంకురార్పణ జరుగుతుంది

# కృష్ణంరాజు, కల్యాణ చక్రవర్తి నటించే 'మారణహోమం"

"అవినీతిని ఎదుర్కోడానికి పూనిన పోరాటమే ఈ మారణహోమం ప్రతీకారానికి ప్రతీకగా కృష్ణంరాజు నీతికి ప్రతీకగా కల్యాణ చక్రవర్తి తండ్రీ కొడుకులుగా నటిస్తున్నారు జనవరి 21 నుంచి 31 వరకు మొదటి షెడ్యూల్ పూర్తయింది ఫిబ్రవరి నుంచి ఏప్రిల్ వరకు ఇలాగే ప్రతి నెలా 21 నుంచి నెలాఖరు వరకు జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ ముగుస్తుంది" అన్నారు ఏ కోదండరామిరెడ్డి ఆయన దర్శకత్వంలో బత్తిన సత్యనారాయణ నిర్మిస్తున్న విజయ మహేష్ కంబైన్స్ వారి పై చిత్రంలో రాధిక కుష్బు నాయికలు జగ్గయ్య, రంగనాథ్ సత్యనారాయణ గిరిబాబు కోట శ్రీనివాసరావు, రమణమూర్తి పి ఎల్ నారాయణ రాళ్ళపల్లి చలనాని వై విజయ అన్నపూర్ణ తక్కిన నటవర్గం ఎం వి ఎస్ హరనాధరావు మాటలు చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి రాజశ్రీ గీతాలు రాశారు సుధాకరరెడ్డి ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం, తార నృత్యాలు, రాజు సాహసాలు కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో వజ్జి సుబ్బారావు సమర్పణ

# టి రాజేందర్ దర్శకత్వంలో రమేష్

మార్చి నుంచి నాలుగు షెడ్యూల్స్‌లో జూన్‌లో షూటింగ్ పూర్తవుతుంది" అన్నారు శాఖమూరి రాంబాబు శాఖమూరి సూరిబాబు వీరు రమేష్ హీరోగా సుధాలయా పిక్చర్స్ బానర్‌లో నిర్మించే చిత్రానికి పదినిమిది శాఖలు నిర్వహించగల టి రాజేందర్ తొలిసారిగా దర్శకత్వం వహించడమే కాకుండా కథ స్క్రీన్‌ప్లే సంగీతం ఛాయ కూర్పు నిర్వహిస్తారు పరుచూరి సోదరులు సంభాషణల కర్తలు

## కల్యాణ చక్రవర్తితో 'రౌడీ బాబాయ్'

కళ్ళెదుట జరిగే అక్రమాలను తన బాణీలో ప్రతిఘటించే ఓ యువకుని రౌడీ బాబాయ్ అని ప్రేమతో పిలుచుకుంటారు ఆ ఊరివాళ్ళు కథకు రెండు పార్శ్వాలు ఎంతగానో తోడ్పడతాయి ఫిబ్రవరి 2–15 మార్చి 1–15 రెండు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు సత్యారెడ్డి ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో తాళ్ళూరి కృష్ణసుందరరావు నిర్మించే కృష్ణా సినీ క్రియేషన్స్ వారి పై చిత్రంలో కల్యాణ చక్రవర్తి అశ్విని సత్యనారాయణ అల్లు రామలింగయ్య నాగేష్ రాజేష్ బెనర్జీ బేబీ శాలిని వై విజయ శ్రీలక్ష్మి అనూరాధ గెస్ట్‌గా ఒక ప్రత్యేక పాత్రలో రావుగోపాలరావు నటిస్తున్నారు గణేష్ పాత్రో మాటలు ఆత్రేయ పాటలు రాజ్–కోటి సంగీతం పి లక్ష్మణ్ ఛాయ హార్స్‌మన్ బాబు సాహసాలు ప్రకాష్ – సురేఖ నృత్యాలు రమేష్ సహకార దర్శకత్వం పి రామారావు నిర్వహణతో ఎస్ ఎన్ మునిరాజా సమర్పణ

## కృష్ణ 'అజాతశత్రువు'

మార్చిలో ముదుమలై ఊటీలో జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు విజయనిర్మల ఈమె దర్శకత్వంలో పి పద్మనాభం నిర్మిస్తున్న మల్లిక్ తెలగం మూవీస్ వారి పై చిత్రంలో కృష్ణ రాధ జగ్గయ్య కోట శ్రీనివాసరావు గిరిబాబు త్యాగరాజు వేలు వై జి మహేంద్ర అన్నపూర్ణ నిర్మల అనూరాధ పాత్రధారులు సత్యానంద్ మాటలు వేటూరి పాటలు శంకర్–గణేశ్ సంగీతం లక్ష్మణ్‌గోరే ఛాయ బి చలం శిల్పం శ్రీనివాస్ నృత్యాలు సూపర్ సుబ్బరాయన్ సాహసాలు ఆదుర్తి హరనాథ్ కూర్పు నిర్వహిస్తున్నారు



అమ్మ గారూ! ఎవరో అభిమానంట! మిమ్మల్ని చూడటానికొచ్చాడు!

## కృష్ణతో కె ఎస్ ఆర్ దాస్ దర్శకత్వంలో 'ముద్దాయి'

నా 75 చిత్రాల అనుభవాన్ని రంగరించి పోసి ఈ చిత్రాన్ని రూపొందిస్తున్నాను రెండవ షెడ్యూల్ జనవరి 21 నుండి 31 వరకు జరిగింది అన్నారు కె ఎస్ ఆర్ దాస్ ఈయన దర్శకత్వం వహిస్తున్న శ్రీ బాలాజీ ఆర్ట్ మూవీస్ ముద్దాయి చిత్రంలో కృష్ణ విజయశాంతి రాధ శరత్‌బాబు గిరిబాబు కన్నడ ప్రభాకర్ వేలు ముచ్చెర్ల అరుణ బేబీ అను ఒక క్లిష్టమైన పాత్రలో ఊర్వశి శారద నటిస్తున్నారు పరుచూరి సోదరులు చక్రవర్తి పుష్పాల గోపీకృష్ణ చలం సలీం పి వెంకటేశ్వరరావు రాజా ఎన్ ఆది ఎ ఎస్ బోస్ శ్యాంప్రసాద్ ప్రభాకర్, ఉమాపతిరాజు కె రంగారావు ప్రభృత సాంకేతిక వర్గంతో ప్రత్తి పాటి పుష్పలత వడ్డే పుల్లయ్య నాయుడు సహనిర్మాతలు వడ్డే అంజమ్మ సమర్పణలో నిర్మిస్తున్న వడ్డే బాలాజీరావు మార్చి 31కి షూటింగ్ పూర్తవుతుంది అని తెలిపారు

"భారతంలో అర్జునుడు"లో కుష్బూ

"ప్రేమ సామ్రాట్"లో సుమన్, అనూరాధ







"కార్తీకపౌర్ణమి"లో
శోభన్‌బాబు,
భానుప్రియ

## సినిమా

## దాసరి నారాయణరావు చిత్రాలు

జయసుధతో నితిన్ కపూర్ నిర్మించే చిత్రం "ఆ ఇంటితల్లి ఈ ఇంటి తండ్రి త్వరలో ప్రారంభమవుతాయి డాక్టర్ దాసరి నారాయణరావు నిర్మిస్తూ ప్రదాన పాత్ర నిర్వహించే తారక ప్రభు 10వ చిత్రం రౌడీషన్ చక్రవర్తి రేలంగి నరసింహారావు దర్శకత్వంలో తుది మెరుగులు దిద్దుకుంటోంది 11వ చిత్రం కృష్ణ హీరోగా దాసరి దర్శకత్వంలో మార్చి 1న సెట్స్‌కు వెళ్తుంది ఇందులో సుహాసిని రాధిక షావుకారు జానకి సత్యనారాయణ గుమ్మడి కోట శ్రీనివాసరావు తారాగణం మార్చిలోనే నవతారాగణంతో 12వ చిత్రం ఎన్ కౌంటర్ మొదలవుతుంది ఏప్రిల్‌లో సెట్స్‌కు వెళ్ళే 13వ చిత్రం చింతామణి"లో శ్రీదేవి నాయిక దాసరి సుబ్బిశెట్టి పాత్రధారి దాసరి పుట్టిన రోజున మే 4న ప్రారంభమై ఎ ఎన్ ఆర్ జన్మదినాన విడుదలయ్యే అన్నపూర్ణా స్టూడియోస్ చిత్రంలో ఎ ఎన్ ఆర్ నాగార్జున నాయకులు

వడ్డే రమేష్ నిర్మించే "విశ్వనాథ నాయకుడు ఉగాది పర్వదినాన కతినేని నాయుడు చిత్రం "బ్రహ్మనాయుడు ఫిబ్రవరిలో విడుదలవుతాయి ☐

# అభిమాన తారలపై అభిప్రాయం

సామాన్యంగా నేను ఏ ఆర్టిస్ట్ మీద ప్రత్యేక అభిమానం చూపించలేను. కానీ.... 'అంతులేని కథ' చూసినంతర్వాత జయప్రదను అభిమానించాను. ముఖ్యంగా కథ సామాజిక స్పృహ కల్గిఉండటం అందుకు కారణం అనుకుంటాను. చిన్న చిన్న విమర్శలకు లోనైనా చాలామంది ప్రేక్షకులను ఆకట్టుకుంది. కథ కూడా ఎంతో ఉదాత్తంగా మలచ బడింది.




అలాంటి సినిమాలు ఇంకా రావాలని, అలాంటి సామాజిక స్పృహ ఉన్న కథలను ఎన్నుకుని అవసరమైతే అలాంటి సినిమాల్లో నటించడానికి పారితోషికం తక్కువగా తీసుకుని ప్రొడ్యూసర్లను ప్రోత్సహించాలని, అలాంటి కథలు వ్రాసే తనకు తోచిన విధంగా ఆర్థిక సహాయం చేస్తానని జయప్రద ప్రకటించి ప్రోత్సహించమని – తద్వారా ఇప్పుడు ఎలాంటి ఉద్దేశ్యం లేని సినిమాలు కేవలం వ్యాపారదృష్టితో రొమాన్సు, సెక్సు, థ్రిల్లింగ్, ఫైట్సు, భయానక దృశ్యాలు, రేప్‌సీన్‌లు ఉంటున్న సినీ ఫీల్మును ప్రక్షాళనం చెయ్యాలని జయప్రద అభిమానిగా నేను సలహా ఇస్తున్నాను.

–ఆర్. ప్రణయప్రకాశ్,
గుడిపాటిగడ్డ, నంద్యాల

* * *

చిరుదరహాసిని సుహాసిని గారు నా అభిమాన తార. ఈమె నటించే చిత్రాలు ఎక్కువగా చూస్తుంటాను. ఈమె ఉత్తమనటి అవార్డు అందుకుటున్నప్పుడు




ఎంత సంతోషంగా ఫీలయ్యానో నాకే తెలియదు.... సుహాసిని గారు ముఖంలో చూపే నవ్వు సుపర్బ్. అలాగే స్టెప్స్ కూడా సింపుల్‌గా చక్కగా వేస్తారు. ఎంతమంది హీరోయిన్స్ (క్రొత్తగా) వచ్చినా మా సుహాసిని గారి లా తక్కువ రోజులలో అంత ఉన్నత మైన అవార్డు తీసుకోరు అనిపిస్తుంది. ఈ మధ్య సుహాసిని గారు విలువలేని పాత్రలు ధరిస్తున్నారు. సెక్స్‌కు ప్రాధాన్యత నిచ్చే డ్రెస్సులు ధరిస్తున్నారు. అవి ఏం బాగోటంలేదు.... స్రవంతి– స్వాతి – మహరాజు – శ్రావణసంధ్య... లాంటి సినిమాలు సంవత్సరానికి నాలుగు చేసినా పర్వాలేదు. ఎందుకంటే అభిమానులలో మంచి గుర్తింపు ... ఆదరణ ఉంటుంది.....

–పి. శశిభూషణ్‌రావు,
కోటబొమ్మాళి (శ్రీకాకుళం)

* * *

సూపర్ హీరోయిన్ విజయశాంతి నా అభిమాన నటి. "కిలాడి కృష్ణుడు" చిత్రం ద్వారా పరిచయమై దినదిన ప్రవర్ధమాన తారగా వెలుగొందుతూ నేటి చలన చిత్ర రంగములో సాటిలేని మేటినటిగా నిలచి పోయినారు. "పెళ్ళి చూపులు" సినిమా చూసినప్పటి నుండి ఆమె అభిమానిని అయ్యాను. పేరులోనే 'విజయ' శబ్దం ఉంచుకొన్ననటి. ఎటువంటి పాత్రలో నయినా జీవించగల సామర్థ్యం ఆమెలో ఉంది. గ్లామర్ + టాలెంట్ ఆమెసొత్తు. "అగ్నిపర్వతం", "ముద్దుల కృష్ణయ్య", "శ్రావణసంధ్య", "వందేమాతరం" మొదలగు చిత్రాలలో ఆమె నటన ఎంతో బాగుంది. తెలుగు చిత్ర రంగంలో కనీవినీ ఎరుగని సంచలనం సృష్టించిన "ప్రతిఘటన" చిత్రంలోని ఝాన్సీ పాత్ర ద్వారా ఆమె చూపిన హావ




భావాలు ప్రతీ ఒక్కరి చేత శభాష్ అనిపించేలా ఉన్నవి. కథాబలం లేని చిత్రాలు, నటనకు అవకాశం లేని పాత్రలు ఆమె అంగీకరించకుండా అభిమానుల గుండెలలో పది కాలాల పాటు – చిరస్థాయిగా నిలిచిపోయే చిత్రాలలో నటించాలని ఆమె అభిమానిగా నా కోరిక. కళాతపస్వి కె. విశ్వనాథ్ చిత్రంలో ఒక నర్తకి పాత్రలో ఆమెను చూడాలని నా అభిలాష. జాతీయ స్థాయిలో కూడ ఉత్తమ నటి కావాలని ఆశిస్తున్నాను.

–జి. వి. ఆర్. కృష్ణారావు,
చోడవరం (విశాఖ)

* * *

మహోన్నత సినీ వినీలాకాశంలో మెరిసిన మన ఆరు కోట్ల ఆంధ్రుల అభిమాన నటుడు చిరంజీవి 'ప్రాణం ఖరీదు' చిత్రం ద్వారా పరిచయం కాబడి, 'శుభలేఖ' చిత్రంతో గుర్తింది పొంది, 'ఖైదీ' చిత్రంతో అందరి ప్రశంసలందుకొని ఎన్నో రికార్డులు తనవిగా చేసుకొన్న డేరింగ్ డేషింగ్ డైనమిక్ హీరో మన చిరంజీవి. అతని అపూర్వ నటనకు 'విజేత' చిత్రం ఒక చక్కని నిదర్శనము. అతను నటించిన ఛాలెంజ్, చంటబ్బాయ్, అడవి దొంగ, కొండవీటి రాజా, రక్తసింధూరము అపూర్వ విజయం సాధించాయి. చిరంజీవి ఒకే తరహా పాత్రలు చేయకుండా పౌరాణిక జానపద చిత్రాల్లో 'విజేత' శుభలేఖలాంటి కుటుంబ కథా చిత్రాలలో నటించాలి.

ఒక అభిమానిగా నా సలహా- చిరంజీవి ఇమేజ్‌ని మరింత పెంచే పాత్రలను ఎన్నిక చేసుకొని, నా అభిమాని నటి అయిన సుమధుర దరహాస సుహాసినితో ఎక్కువ కుటుంబ కథా చిత్రాలలో




నటించవలినని విన్నపము.

-జి. వెంకట సుబ్బయ్య,
కొండమాచుపల్లి (కడప)

* * *

సినీ రంగ ప్రవేశంతోనే అద్భుత నటనా కౌశలంతో నేడు తారాస్థాయికి చేరుకున్న నయనాభినయ నటి 'భానుప్రియ' అభిమానిని నేను. ఆమె మొట్ట మొదట నటించిన 'సితార' చిత్రానికి అవార్డు రావడం ఎంతో గర్వకారణం. ఆమె ఏ పాత్రలో నటించినా, ఆ పాత్ర లో జీవిస్తారు. ఉదాహరణకు, 'సితార', 'అన్వేషణ', 'కాష్మోరా', 'ఆలాపన', 'అనాదిగా ఆడది', 'మంచి మనసులు' వంటి చిత్రాలలో విభిన్నమైన పాత్రలను అద్భుతంగా పోషించారు. నృత్య సన్ని వేశాలలో 'స్టెప్స్' వేసే తీరు, నటనలో చురుకుదనం, తన వాడి చూపులతో భావాలను తెలపటంలో ఆమెకు ఆమే సాటి. హిందీ చిత్రాలలో కూడా అవకాశాలు రావడం. ఆమె ప్రతిభకు నిదర్శనం. శ్రీదేవి, జయప్రద వలె




భానుప్రియ హిందీ చిత్ర రంగానికి పరిమితం కాకూడదని మనవి.

ఒక అభిమానిగా నేను ఆమెకు, వ్యాపారాత్మక చిత్రాలలో నటించడం తగ్గించి, మంచి కథాబలం, మరియు సాంఘిక, కళాత్మక విలువలున్న చిత్రాలలో నటించమని సలహా ఇస్తున్నాను. ఆమె మున్ముందు సినీ రంగంలో మరెన్నో ఉన్నత శిఖరాలను అధిరోహించాలని ఆకాంక్షిస్తున్నాను.

-యస్. బాలాజీరావ్, శివాజీనగర్,
సికింద్రాబాద్. □




# దొంగ

మే నెల...

మండు వేసవికాలం – నిప్పులు చెరిగే ఎండ – విపరీతమయిన వడగాడ్పు. జనం రోడ్డుమీద మరీ పల్చగా ఉన్నారు. రాజమండ్రిలో ఈ సంవత్సరం విజయవాడలో కన్నా ఎండలు మండిపోతున్నాయి.

ఎలాగోలా రైల్వేస్టేషన్ దగ్గర్లో ఓ హోటల్లో భోజనం అయిందన్పించి బయటపడ్డాను బాబా జర్దావేసి, ఓ సిజర్స్ దమ్ము లాగాక కాస్త హాయి అన్పించింది నీడకోసం ఓ బడ్డీ కొట్టు ప్రక్కన జేరాను దేవీ చౌక్ దగ్గరకు పోవడాన్కి సిటీబస్ కోసం ఎదురుచూడ్డం మొదలుపెట్టాను అయిదు పది పదిహేను నిముషాలు వృధా అయిపోతున్నాయి సిటీబస్ దర్శన భాగ్యం కావడం లేదు అసహనంగా వాచీకేసి చూసుకున్నాను రెండుంబావు

"టైమెంత మాష్టారూ?

తలెత్తి చూసాను నలుపు – తెలుపు కాకుండా. పొడుగు, పొట్టి కాకుండా, లావు సన్నం కాకుండా కుదుమట్టంగా ఉన్నాడా వ్యక్తి. సుమారు యాభై ఏళ్ళుంటాయి. అయినా కాస్త బలంగానే ఉన్నాడు చేతిలో బేగ్. పంచె – చొక్కా, వేషం భాష పక్కా కోనసీమ బ్రాహ్మణుడులా ఉన్నాడు బేగ్ కేసి చూసాను. 'వీర్రాజు', స్కూలు టీచరు' అనుంది

"రెండుంబావండీ" అన్నాను మర్యాదగా

అతను నా ప్రక్కన నీడగా లేకపోవడం వలన అనుకుంటా ముందుకువెళ్ళి ఎదురుగా ఉన్న సైకిల్ షాపు ఒరగా నిలబడ్డాడు

నేను మళ్ళీ ఓసారి సిటీబస్ వస్తోందేమోనని అత్యాశగా చూసి, చేతిలో పేపరు విప్పాను హత్యలు – మానభంగాలుతో మొదలయి, ఆరోపణలు – ఖండనలుతో సాగి, మనవాళ్ళు ఓడిన క్రీడల విశేషాలతో పూర్తయింది

యధాలాపంగా ఎదురుగా చూసాను ఆ వీర్రాజు మాష్టారు సైకిల్‌షాపు వాడితో మాట్లాడుతున్నాడను కుంటా ఆయన షేప్ చూస్తే కాస్త సీరియస్‌గానే ఉన్నట్టన్పించింది ఆ సైకిల్‌షాపువాడు కూడా సీరియస్ అవుతున్నాడు అరే వీర్రాజు మాష్టారి చెయ్యి పట్టుకున్నాడు ఆయన వదిలించుకోడాన్కి ప్రయత్నిస్తున్నాడు వాడు ప్రక్క సందులోకి లాక్కెళ్ళుతున్నాడు. ఆయన వదిలించుకొని రోడ్డుమీద కొచ్చాడు నాకంతా అయోమయంగా ఉంది రోడ్డు దాటి ముందుకు వద్దామనుకునే టప్పటిక్కి, రోడ్డుమీద ట్రాఫిక్ ఎక్కువ అవడంతో మరో మూడు, నాల్గు నిముషాల దాకా రోడ్డు క్రాస్ చెయ్యలేక పోయాను అప్పటిక్కి జనం బాగా ప్రోగుపడ్డారు.

"వాడు శుద్ధ దొంగండి. పైకి అలా కన్పిస్తాడు. క్రిందటి సోమవారం దానవాయిపేటలో మా షాపులో సైకిల్ కావాలని తీసుకెళ్ళి మళ్ళీ కన్పడలేదు" సైకిల్ షాపు వాడు ఎవర్కో చెప్తున్నాడు.

"నాల్గు తగిలించేవయ్యా! చూస్తావేం?" ఎవరిదో సలహా.

"ఇటువంటి వాళ్ళను కాలో చెయ్యో తీసెయ్యాలి."

నమ్మలేకపోయాను. పెద్దమనిషి, మర్యాదస్తుడులా కన్పిస్తున్న అతగాడు దొంగా? నమ్మశక్యంగాలేదు. ఏదో ఎక్కడో పొరబాటు జరిగింది. ఇందులో ఏదో మోసం ఉందన్పించింది. జనాన్ని త్రోసుకు ముందుకు వెళ్ళడాన్కి ప్రయత్నించాను. నావల్ల కాలేదు ఈసారి దగ్గర్లోనే కాస్త ఎత్తుగా ఉన్న అరుగు ఎక్కాను ఈసారి బాగా కన్పిస్తోంది – విన్పిస్తోంది

సైకిల్‌షాపు వాడు వీర్రాజు కాలరు వదల్లేదు వీర్రాజు చేతిలో బేగ్ చంకలోకి మారింది బాగా గట్టిగా పట్టుకున్నాడు.

"నేనేం దొంగనుకాను స్కూలు టీచర్ని. అనుమానం ఉంటే పోలీస్ స్టేషన్‌కు నడవండి " వీర్రాజు ఆయాసపడుతూ సాధ్యమయినంత గట్టిగా అనడాన్కి ప్రయత్నిస్తున్నాడు

"ప్రతీ దొంగ వెధవకు ఇదో అలవాటు. అక్కడ వాళ్ళూ – వీళ్ళూ అంతా లాలూచీ."

ఇంత వయిసొచ్చి ఇదేం వెధవ పనయ్యా? సిగ్గులేదూ?

అచుట్టు ప్రక్కల ఉన్న నల్గురయిదుగురు ఆ సైకిల్‌షాపువాడి తాలూకు అనుకుంటా అప్పటిక్కి – వీర్రాజు జుట్టు చెరిగి – చొక్కా చిరిగి – మొహం కమిలిపోయి – ఆయాస పడుతున్నాడు మాట తడబడుతోంది పులి ముందు నిలబడ్డ మేకపిల్లలా దీనంగా – సహాయం కోసం చూస్తున్నట్టున్నాయా చూపులు కాబూలీవాలా ముందు ఋణగ్రస్తుడిలా ఉన్నాడు నాకు చచ్చేంత జాలేసింది కానీ, నేనొక్కడ్ని ఏం చెయ్యగల్ను ఆజనం ముందు. జూలియస్సీజర్ డ్రామాలో 'మాబ్'లా ఉన్నారా జనం. ఆగమంటే ఆ వీర్రాజుతో బాటు నన్ను కూడా చావగొట్టేలా ఉన్నారు. 'వీడు – వాడు లాలూచీ రా అని నన్నూ కూడా బాదేయగల్రు కానీ, అతగాడి పరిస్థితి చూస్తుంటే జాలేస్తోంది ఈత రానివాడు మునిగిపోయేవాడ్ని చూసి పొందే బాధ – నిస్సహాయత నన్నావరించాయి అతగాడ్కి స్థానబలం లేకకదా! బళ్ళో పిల్లల ముందు పులిలా ఉండే మాష్టారు పాపం పిల్లిలా అయిపోయాడు ఈరోజు లేచిన వేళావిశేషం అట్లాంటిది ఎవరి మొహం చూశాడో ఏం శకునం వచ్చిందో? ఇతగాడు ఇల్లుజేరడం ఆలస్యం అయితే భార్య బిడ్డలు ఎంత ఆందోళన పడుతూంటారో. పాపం! ఎంత అవమానం డెలికేట్ మెంటాలిటీ అయితే ఈ అవమానం భరించలేక ఏ ఆత్మహత్యో చేసుకోవచ్చు కూడా ఇందులో ఏదో కుట్ర ఉంది ఆ సైకిల్ షాపువాడు – వాడి ముఠా ఏదో కుట్ర పన్నుంటాడు ఎందుకై ఉంటుంది?... బహుశ... ఆ బ్యాగ్‌లో ఉన్న




క్యాష్ కోసం ఆ

ఆ ఆలోచన రాగానే నాదృష్టి ఆ బ్యాగ్‌మీద పడింది వీర్రాజు ఆ బ్యాగ్ మరీ గట్టిగా చంకలో బిగించి పట్టుకున్నాడు.

"ముందా బ్యాగ్ లాక్కోండి అసలు వాడు దాంట్లో ఏం దాచాడో?' ఎవరో సలహా పడేశారు బహుశ. వాడు కూడా ఆ సైకిల్‌షాపు వాడిఫ్రెండ్ అయ్యుంటాడు

కరెక్ట్ ఇటువంటి సమయాల్లో నా బుర్ర పాదరసంలా పన్జేస్తుంది నా ఊహ రైటన్నమాట అంటే. వాళ్ళు ఆ బ్యాగ్ కోసమే, దాంట్లో డబ్బు ఉందని తెల్సే. ఈ విధంగా సైకిల్ దొంగగా చిత్రీకరించి తెలివిగా నాటకమాడుతున్నారన్నమాట.

ఎంత దారుణం? పట్టపగలు నడిబజార్లో మరీ ఇంత ఘోరమా? రాజమండ్రి బొత్తిగా రౌడీలకు, గూండాలకు నిలయమయి పోయింది మనిషికి సెక్యూరిటీ లేకుండా పోయింది

'అర్ధరాత్రి ఆడది ఒంటరిగా తిరగ్గలిగిననాడే ' అన్నాడు మహాత్ముడు.

'పట్టపగలు మగాడు పదిమంది మధ్య తిరగలేని' రోజు లొచ్చాయి. బొత్తిగా నరమాంస భక్షకుల్లా తయారయ్యారు జనం.

ఇంతలో 'టప టప' శబ్దంతో ఈ లోకంలోకి వచ్చిపడ్డాను దారిన పోయే దానయ్య ఎవరో వీర్రాజును ఓ నాల్గు దెబ్బలు వడ్డించి, తన ప్రతాపం చూపించి పోయాడు. ఇప్పుడెవరైనా అతన్ని కొట్టొచ్చు, తన్నొచ్చు, తిట్టొచ్చు. వాళ్ళకు ఈ మధ్య వ్యవహారంతో సంబంధం ఉండక్కర్లేదు. వెర్రాడి పెళ్లాం వాడందర్కి వదినట.

'వెధవని అలైటు స్తంభాన్కి కట్టేసి, బట్ట లూడదీయండి,' చచ్చినట్లు నిజం ఒప్పు కుంటాడు," మరో అద్భుతమైన సలహా.

అది మానవత్వాన్కి – మనిషి సంస్కారానికి పరాకాష్ట

ఆ సలహా అందర్కి ఆమోదం – ఆనందం అయినట్లుంది.

'ఔను – ఔను" అన్నారంతా ముక్త కంఠంతో కోరస్‌గా

అప్పట్కే వీర్రాజు బట్టలు చిరిగి అర్ధ నగ్నంగా ఉన్నాడు. పెదవి చిట్లి రక్తం కారుతోంది. నిలబడలేక పోతున్నాడు. నిలద్రొక్కుకోడాన్కి ప్రయత్నిస్తున్నాడు. అతగాడి ఏకగ్రత అంతా ఆ బ్యాగ్ మీదే ఉంది దాన్ని మాత్రం వదలడం లేదు ఎవరో మహానుభావుడు డెక్కనార త్రాడు పట్టుకొచ్చాడు మరుక్షణంలో వీర్రాజు శిలువ వేయబడ్డ క్రీస్తులా స్థంభాన్కి కట్టివేయబడ్డాడు ఆ ఆటవిక చర్యకు ఆనందిస్తున్న శాడిస్టులను చూస్తూంటే జుగుప్స కల్గుతోంది నేనెక్క డున్నాను?... రాజమండ్రిలో నేనా?... అనుమానం వేసింది.

ఏదో చెయ్యాలి ఏం చెయ్యాలి?... ఏదైనాచేసి ఈ దారుణాన్ని ఆపాలి. ఒకవేళ అతడు దొంగైతే.. ఆ ఊహ నాకు బాధగా ఉంది దొంగైతే పోలీసులు .. కోర్టు . విచారణ అన్నీ ఉన్నాయిగా వాళ్ళే చూసుకుంటారు చట్టాన్ని ఎవర్కి వాళ్ళు చేతుల్లోకి తీసుకుంటే ఇక చట్టాలు, ఈ వ్యవస్థ ఎందుకు? ఘనం ఎక్కడ్కి పోతున్నామో నాకేం అర్థం కావడంలేదు. జనం కేరింతలు కొడుతున్నారు.

క్రింద కాళ్ళు – పైన తల – స్థంభాన్ని అనుకున్న వీపు ఎండవేడికి కాలిపోతుండగా నిస్సహాయంగా అతడు చూస్తూండిపోయాడు అంతమంది జనంలో మానవత్వం ఉన్నవాళ్ళు ఒక్కళ్ళు.. ఒక్కళ్ళు లేరా? ఒక్కళ్ళు కూడా ఆపుచేయడాన్కి ప్రయత్నించరేం? మరి, తనున్నాడు కదా? తనెందుకు ప్రయత్నించటం లేదు? ఒక్క ఉదుటున జనంలోకి ఉర్కి, గబగబా అతగాడ్ని బంధించిన త్రాళ్ళు విప్పి, నీడలోకి తీసుకెళ్లి ఓ గ్లాసెడు మంచినీళ్ళు ఇచ్చి" ఏమయ్యా! మీరు మనుష్యులు కాదూ! మీలో మానవత్వం లేదూ!

మీ అన్నకో, నాన్నకో, మీకో ఈలాగే జరిగితే మీరు ఊరుకుంటారా?" అని అరవాలనుకున్నాను. కానీ .. కాళ్ళు నిలబడిన చోటునుంచి కదలవేం? గొంతుకు పెగిలి రాదేం! నాకేమయింది? నేనెందుకు ఆడదానిలా అయిపోయాను! కళ్ళెదుట ఘోరం జరిగిపోతుంటే అన్యాయాన్ని అరికట్టలేని దద్దమ్మలా ఎలా ఉండిపోగలుగుతున్నాను. నాకే అవమానకరంగా ఉంది.

వెంటనే... ఓ ఆలోచన మెరుపులా మెరిసింది. ఒక్క ఉదుటన ఎదురుగా ఉన్న అయ్యారు హోటల్లోకి ఉరికాను. ఓ రూపాయి వాడి మొహాన పారేసి –" హలో.. పోలీస్‌స్టేషన్! ఇక్కడ రైల్వేస్టేషన్ ఎదురుగా ఘోరం జరిగిపోతూంది. ఓ మనిషిని సజీవ దహనం చేస్తున్నారు. మీరు వెంటనే వచ్చి రక్షించాలి. నేను ఉడిపి హోటల్‌నుంచి మాట్లాడు తున్నాను" అని రిసీవరు పెట్టేశాను. నేను మాట్లాడుతున్నది నాకే అర్థం కాలేదు. మధ్య నాకెందుకో టెన్షన్‌గా ఉంది. మళ్ళీ వచ్చి ఇంతకు ముందు నిలబడ్డచోటే నిలబడ్డాను. మరో అయిదు నిముషాల్లో పోలీస్ జీపు రానే వచ్చింది. అప్పటిదాకా వీరుల్లా నిలబడ్డ జనం చల్లగా జారుకున్నారు. వీర్రాజును విడిపించి, వీర్రాజును, సైకిల్ షాపువాడ్ని, అతగాడి మిత్రుల్ని సపరివారంగా స్టేషన్‌కు లాక్కుపోయారు.

ఇప్పుడు నాకెందుకో తృప్తిగా ఉంది. హాయిగా గాలి పీల్చుకున్నాను 'బెటర్ లేట్ దెన్ నెవ్వర్' అన్నారు కాస్త ఆలస్యంగా అయినా ఓ మంచి పని చేసినందుకు ఆనందంగా ఉంది. మరి కాస్త ఆలస్యం అయిఉంటే వీర్రాజు ప్రాణాలు అనంత వాయువుల్లో లీనమయి ఉండేవి.

ఒకసారి టైం చూసుకున్నాను. సుమారు మూడు కావొస్తోంది.. ఇంకా ఎండ తీవ్రంగానే ఉంది. వేడి గాల్పులు వీస్తున్నాయి. ఇక దేవీచౌక్‌కు పోదల్చుకో లేదు. ఇన్నీసుపేటలో మా లాయర్ని కలుసుకుని రాత్రి పదిగంటల ట్రయిన్‌లో విజయవాడ పోవడాన్కి నిర్ణయించుకున్నాను.

సాయంకాలం ఏడుగంటల దాకా అక్కడ అక్కడా పని చూసుకొని ఊర్వశి బార్‌లో పడ్డాను. బయట లాన్స్‌లో టేబుల్స్, చైర్స్ – మంచి డిమ్ లైటింగ్ – సన్నని ఇంగ్లీషు మ్యూజిక్ – బాగాఅమర్చారు

ఓ మూల ఖాళీగా ఉన్న టేబుల్ దగ్గర కూర్చున్నాను. ఓ రెండు బీరు, ఓ ప్లేట్ గ్రీన్‌పీస్‌కు ఆర్డరిచ్చాను. సమ్మర్‌లో బీరు తప్పితే మరేం తీసుకోను

ఇంతలో మరో వ్యక్తి వచ్చి నా ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు మొహం అంతగా కనపడలేదు. బేరర్ బీర్ సర్వ్ చేసాడు ఓపెన్‌చేసి గ్లాస్‌లో పోస్తుండగా అతగాడు ఆర్డరిచ్చాడు.

"ఓ క్వార్టర్ మెక్‌డోవెల్ విస్కీ ప్లేట్ - బోన్‌లెస్ చికెన్ కూడ ' ఆ కంఠం విన్నట్టుగా ఉంది.

అతడు సిగరెట్టుకోసం వెలిగించిన అగ్గిపుల్ల కాంతిలో చూసాను

ఒక్కసారిగా నివ్వెరపోయాను వీర్రాజు

నేను ఉద్వేగం పట్టలేకపోయాను

"నువ్వు వీర్రాజువుకదూ!" అన్నాను బహుశ. నేను చూసిన అతగాడి పరిస్థితి ఏకవచన సంబోధనకు పురికొల్పి ఉంటుంది

అతగాడు నవ్వాడు కాదు లక్ష్మీపతి అన్నాడు.

'షటప్' అబద్ధం చెప్పకు" ఈసారి నాకు కోపం వచ్చింది. నేను ఊహించింది తలక్రిందు లౌతోందా?

కోనసీమ బ్రాహ్మణుడు, స్కూలు టీచరు అనుకున్నతను - విస్కీ, చికెన్, సిగరెట్ కాక ఇప్పుడు పేరు మార్పిడి కూడానా అవన్నిటి మీదా నాకే హక్కు ఉన్నట్టు నాకు కోపంగా ఉంది

అతను నిర్వికారంగా నవ్వాడు

'మీకు నా కృతజ్ఞతలు" అన్నాడు

"ఎందుకు?" అన్నాను చిరాగ్గా

'నన్ను రక్షించినందుకు"

"అందుకు ఇపుడు బాధపడుతున్నాను"

"పోలీసులు ఎవరో ఫోన్ చేసారని చెప్పారు నా గురించి మీరు పడిన హైరాన - మీరు అటు ఇటు తిరగడం నేను చూసాను మీరు రక్షించకపోతే వాళ్ళు నన్ను ప్రాణాలు తీసుండేవారు."

నేనేం మాట్లాడ లేదు చాలా అప్‌సెట్ అయ్యాను

# దొంగ

- సాధారణంగా నా ఊహ తప్పు కాదు ఈసారి

విస్కీ అతను గ్లాస్‌లో పోసుకున్నాడు సోడా కలుపకుండా 'రా' త్రాగుతున్నాడు అతనెవరో నేనెవరో. నేనెందుకు మనస్సు పాడుచేసుకోవాలి చూద్దాం - ఇంకా అతనేం చెప్తాడో

"మీరు నా ప్రాణదాత కాబట్టి మీకు నిజం చెప్తున్నాను నేను దొంగను కాదు - వృత్తి రీత్యా నేనో చిరుద్యోగిని కానీ, దొంగతనం చేసాను అదీ-మూడుసార్లు. మరెప్పుడు చెయ్యను ఇంకా అవసరం కూడా రాదు. మొదటిసారిగా చావుబ్రతుకుల మద్య ఉన్న నా భార్య మందుల కోసం ఓ వారం క్రితం సైకిల్ దొంగతనం చేసాను కానీ, నా భార్య చనిపోయింది '

అతను ఆగి మరో క్వార్టర్‌కు ఆర్డరిచ్చాడు అయిపోయిన సిగరెట్ యాష్‌ట్రేలో నొక్కి మరో సిగరెట్టు ముట్టించాడు ఆ కాంతిలో చూసాను అతని కళ్ళు వర్షిస్తున్నాయి

"""రెండోసారిగా ఈరోజు రెండు దొంగతనాలు చేసాను ఒకటి. వీర్రాజు అనే స్కూలు టీచరు పొలం అమ్ముకొని రిజిస్ట్రారు ఆఫీసునుంచి డబ్బు తీసుకెళ్తుంటే సిటీబస్‌లో కాజేసా అదీ పదివేలు-కానీ దాని అవసరం లేకపోయింది 'పెళ్ళి కాని తల్లి' కావడం ఇష్టంలేని నా కూతురి శవం ఈ సాయంత్రం గోదావరిలో దొరికింది " అతను ఆగాడు ఆయాస పడుతున్నాడు [illegible] మాటతో మొహం కన్నీళ్లతో తడిసిపోయాయి నా కింకా త్రాగబుద్ధి కాలేదు

ఎక్స్‌క్యూజ్మీ అంటూ నా రెండో బీరు సీసా లాక్కుని అతనే గడగడ తాగేశాడు

అతను మూడోసారి దొంగతనం ఎప్పుడు చేసాడో చెప్పలేదు బేరర్‌ను పిలిచి ఇద్దం [illegible] కలిపి తీసుకురా' అన్నాడు నేను వారించబోయాను దొంగ సొమ్ముతో త్రాగడం నాకిష్టంలేదు

ఎవరిచ్చినా మీ సొమ్మే ననుకోండి అన్నాడతను నవ్వుతూ బేరర్ బిల్లు తెగానే వీర్రాజు [illegible] వంద యిచ్చి

[illegible]

[illegible]

క్షమించండి' [illegible]

దొంగతనం [illegible]

నాకు వినాలని లేదు [illegible]

సాధ్యమైనంత త్వరగా [illegible]

వెళ్ళిపోవాలనుంది నాకు

మీకు మరోసారి [illegible]

బాధపెడ్తే మన్నించండి [illegible]

చెయ్యలేదు అంటూ [illegible]

వడివడిగా నడిచి [illegible]

లైట్సులోంచి [illegible] వచ్చి

చూసాను ఒక్కసారి [illegible] అది నాపర్సు □



మడిమొగుడు
వ్యంగ్య చిత్రావళి: బాలి
అర్జెంట్ ఆఫీసు కాయితాలు చూస్తున్నప్పుడు దగ్గరికి రాకు! బూతులు రాసేస్తాను!
పళితే పడ్డానుగాని నువ్వు నన్ను తాకమాక! తాకితే నా నిషా దిగిపోద్ది ఎర్రి మొకవా!
ఏం ఆయన్ని నువ్వు తాకటానికి వీల్లేదు! ఆయనకి ఎయిడ్స్ వ్యాధి వుందేమోనని అనుమానంగా వుంది!
ఇక్కడి నీటి ఎద్దడికి మడితడి కావాలనుకుంటే మనకి కుదర్దు! నదివున్న వూరికి ట్రాన్స్‌ఫర్ చేయించుకోండి!

# పాఠకుల శీర్షిక

# గర్భస్థ శిశువు చెప్పిన కథలు

## మాకు ఆ శక్తి కావాలి

మాంచెస్టరు యూనివర్సిటీ దాటేక ఒక మైలు దూరం పయనిస్తే కంటికి కనపడే ఆ అధునాతనమైన భవనమే ఇంగ్లండులో పేరుగాంచిన ఒక పెద్ద మెటర్నిటీ హాస్పిటలు. ఇన్‌ఫెర్టిలిటీ, టెస్టుట్యూబు బేబీస్ అనే అంశాలలో ప్రత్యేకంగా పరిశోధనలు జరిపే ఈ హాస్పిటలు పేరు సెంట్ మేరీస్. ఈ మాంచెస్టర్ సెంట్‌మేరీస్ హాస్పిటలుకి అనేక దేశాల నుండి ఎందరెందరో పిల్లలులేని స్త్రీలు ప్రత్యేకమైన పరీక్షలకు, తమకు పిల్లలు పుట్టక పోడానికి కారణాలు తెల్సుకోడానికే కాకుండా సంతానోత్పత్తిని కల్గించే మందుల కోసం, పిల్లలు ఇంక వద్దు అనుకునేవారు గర్భస్రావం కోసం రావడం పరిపాటి. అంతే కాకుండా భారతీయులున్న ప్రాంతానికి చాలా దగ్గరలో వున్న ఈ హాస్పిటల్‌కి ప్రత్యేకంగా మన భారతీయ వనితలు విచ్చేయడం, పురుడు పోసుకోడం ఆహ్లాదకరమైన విషయమే.

ప్రతి రోజు, ప్రతి క్షణం చాలా బిజీగా వుండే ఆ హాస్పిటలులో ఆ నాటి సంఘటనకి ఓ ప్రత్యేకత వుందన్పిస్తోంది. ఆంగ్ల వనితలు, భారతీయ స్త్రీలు, చైనావారు, పాకిస్తాన్ ఆడవారు, ఇలాగ ఇతర దేశాలకు చెందిన వారెందరో వున్నారక్కడ. కొందరు గర్భిణీ స్త్రీలు, కొందరు పరీక్షలకై వచ్చినవారు, కొందరు చికిత్స కొచ్చినవారు, మరి కొందరు ఎబార్షన్ కోసం వచ్చినవారు– ఇలా వేరు వేరు వర్గాలకు చెందిన వారంతా ఒక్కొక్కరే తమపేరు పిలిచిన వెంటనే తమని పరీక్షించబోయే డాక్టరు దగ్గర కెళుతున్నారు.

ప్రతి ఎబార్షన్ వెనుక ఓ గాథ వుంటుంది. కొందరు ఆడపిల్లలకి భయపడి ఆ పనికి పూనుకొంటే మరి కొందరు మరి కొన్ని కారణాల వలన అదే దారిపడతారు.

సోఫాలో ఒక నలభై సం. గల ఒక ఆంగ్ల స్త్రీ ఆమెతో పాటు పాలరాయి



బొమ్మలా మెరిసిపోతున్న అందమైన 16 సం. వయసుగల ఓ బాలిక. బహుశా తల్లీ కూతుళ్ళై వుంటారు. స్కూల్లో చదువు కొంటున్న ఆ అమ్మాయికి కంప్యూటరు సైన్సులో ఒక పెద్ద యూనివర్సిటీ డిగ్రీని సంపాదించాలనేది జీవిత ధ్యేయమైతే ఒక పెద్ద అడ్డంకు వచ్చింది. సెక్సు ఫ్రీ అయిన ఈ ఇంగ్లండు దేశంలో ఇలాంటి ఇబ్బందులు టీనేజ్ ఆడపిల్లలకి ఎదురవ్వడం ఏమీ ఆశ్చర్యాన్ని కల్గించే విషయంకాదు. అది ఇబ్బందనుకొని తొలగించుకోవాలనుకున్నా లేక ఇబ్బందేమిలేదు, బిడ్డని కనాలనుకొన్నా, వారికి పెళ్ళి ప్రసక్తి లేకుండా కావల్సిన అవసరాలను తీర్చడానికి ఎన్నో సౌకర్యాలు కల్గించబడుతుంటాయి. అయితే ఈ నీలికళ్ల బాలిక ఎబార్షన్‌నే మార్గంగా ఎంచుకొంది. ఆమెకి కొద్ది దూరంలో కూర్చున్న ఇద్దరు ప్రాణస్నేహితురాండ్ర మాటల సారాంశంలో తేరి ఆమెకున్న మరో జత పసికందుల నిర్మూలనా ప్రయత్నాలు, ఇలాగ వివిధ కారణాల వెనుక ఆహుతి అయ్యే గర్భస్థ శిశువులుండగా, వీరందరికీ మరి కొద్ది దూరంలో పెద్ద సోఫాలో కూర్చున్నారు. మరో ఇద్దరు స్త్రీలు. సన్నంగా, నాజూగ్గా, యవ్వనంతో ఆకర్షణీయంగా వున్న వీర్ని చూస్తుంటే వారు గర్భిణీ స్త్రీలవలె లేరు. పిల్లలని కనలేని అసహాయుల్లాగ వున్నారు. కనుమరుగయ్యే ప్రతి గర్భిణీ స్త్రీని చూస్తూ వారంతా వరప్రసాదాన్ని పొందిన స్త్రీలని అదృష్టవంతులని ఏకగ్రీవంగా భావిస్తున్నారు. వారియెడల వారు చూపుతున్న మర్యాదే అందుకు నిదర్శనం.

పెక్కుమంది మనుష్యులతో నిండివున్న ఆ వాతావరణంలో చిన్న కలకలం, మొదలై, నెమ్మదిగా తారాస్థాయి చేరుకొంటోంది. అదంతా ఇంకా పుట్టని ఆ ప్రాణుల ఆక్రోశాలే. కేవలం కంటికి కన్పడే వారిని, చూడటమే కాని, కానరాని ప్రాణుల ఆక్రోశాలని వినగలిగే శక్తి అక్కడ వున్న వారిలో ఎవరికీ లేదని నిర్ధారణ చేసుకొన్న, ఆ గర్భస్థ శిశువులు ఇంక లాభం లేదనుకొని ఆఖరుసారిగా సర్వాంతర్యామితో డైరెక్టుగా మొర పెట్టుకొంటున్నారు. ఒక్కసారి మనం ఆ పలుకులని వినగల ప్రయత్నం చేస్తే వారి ఆక్రందనల సారాంశం ఇదే! అం తీలగా వినవస్తున్నాయి "ఓ దేవదేవా! సర్వోపద్రవాలను అరికట్టగల నీవు, మాకు ఆశక్తి నియ్యవయ్యా... గర్భం ధరించలేని, స్త్రీల గర్భంలోకి రెక్కలొచ్చి, ఎగిరిపోగల శక్తి, బిడ్డలకై పరితపించి, అమ్మా అని పిలిపించుకోవాలనే తపన పడుతున్న వారికడుపున పుట్టగల శక్తి మాకు కావాలి స్వామి. ప్రాణం పోసుకున్నా పూర్తిగా పెరగనివ్వక హతమార్చే, వారి అఘాయిత్యాల నుండి పారి పోగల శక్తి కావాలని" గోలపెడుతున్న వారు దేముడు వరమిచ్చినా పూజారి ఒప్పలేదన్నట్టున్న ఆ ఎబార్షన్ల ఉప్పెన ప్రవాహంతో కొట్టుకు పోతున్నారు.

నిజమే! మనిషి బాహ్యంగా చనిపోయినపుడు, పుట్టిన పసికందులు మరణిస్తే బహు విలపించేవారు, పుట్టని శిశువులని నిర్దాక్షిణ్యంగా 'వద్దనుకున్నపుడల్లా' హతమార్చడం కూడా శిశు హత్యతో సమానం అనుకోరేమిటి?!

శ్రీమతి రుద్రావఝల
సత్యవతీరావు, మిడిల్‌టన్,
మాంచెస్టర్, ఇంగ్లాండు

★ ★ ★

## అమ్మా నన్ను చంపొద్దు

ఏమండీ ఈ రోజు నేను డాక్టరు దగ్గరకెళ్ళి యస్. డి. టి. చేయించుకున్నానండీ ఆడపిల్ల అని అన్నారు డాక్టరు? అంటూ భర్తతో చెప్పింది శిరీష, "మరింకేం త్వరలోనే మన ఇంటికో పాపాయి రాబోతుందన్నమాట" అని సంతోషంగా అంటున్న భర్తను చూస్తూ "నాకు ఆడపిల్ల పుట్టడం ఇష్టం లేదండీ. రేపే వెళ్ళి అబార్షన్ చేయించుకుంటాను" అనేసి లోపలికెళ్ళి పోయింది శిరీష ప్రసాద్‌కు తెలుసు భార్య ఏదైనా పట్టుపట్టిందంటే అది చేసి తీరుతుందని అందుకే మౌనంగా వుండిపోయాడు. శిరీష టీ. వీ చూస్తూ ఏదో ఆలోచిస్తూ కూర్చుని వుంది. ఇంతలో టీ. వీ స్క్రీన్‌మీద ఓ చిన్న ఆకారం కనిపించి "అమ్మా" అని పిలిచింది" "ఎవరు" అని శిరీష అడగ్గానే "నేనేనమ్మా నీలో ప్రాణం పోసుకుంటున్న నీ కూతుర్నమ్మా! ఎందుకమ్మా నన్ను లోకంలోకి రాక ముందే నీ ప్రేమ



పొందడానికి అనర్హురాలిగా భావించి చంపెయ్యాలనుకుంటున్నావు అమ్మా స్త్రీకి మాతృత్వమనేది ఓ వరమటకదూ! మరి సంతానం ఏదైనా ఒక్కటే అనుకోకుండా ఆడ, మగ తేడా లెంచుతున్నావెందుకు? అమ్మా మీ అమ్మా నాన్న కూడ ఇలాగే కూతురు వద్దను కుని వుంటే నీవు ఈ రోజు ఇలా వుండేదానివేకాదమ్మా! మీ అన్నలిద్దర్నీ చదివించాలని నిన్ను కూడ కాలేజి చదువులు చదివిస్తే ఖర్చు పెరుగుతుందని స్కూల్ ఫైనల్‌వరకే ఆపేశారు నీవు మా నాన్నను ప్రేమించి పెళ్లి చేసుకుని మీ అమ్మా నాన్నలను కట్నం బాధనుంచి తప్పిస్తే మా కడుపున చెడబుట్టావని నానా

పవిత్రస్త్రీ జన్మను నిర్మూలించాలనుకున్నావా ఏదేమైనా తల్లిప్రేమను పొందలేని జన్మవ్యర్థమేనని భావించి నీ నిర్ణయానికే తలవంచుతున్నానమ్మా నీ ఇష్ట ప్రకారమే కానియ్యమ్మా అంటూ అదృశ్యమైంది మాటలు రానిదానిలా నిశ్శబ్దంగా ఇంతవరకు వింటున్న శిరీష ఉలిక్కిపడి లేదు నేను అబార్షన్ చేయించుకోను నీకు మనస్ఫూర్తిగా జన్మనిస్తానమ్మా అంటూ ఏడుస్తున్న కూతుర్ని ఆమెబాధ నర్థం చేసుకున్నదానిలాగా శిరీష తల్లి కూతుర్ని తన గుండెల్లో దాచుకుంది

జి. అభిలా బేగమ్,
అనంతపురం

* * *



దుర్భాషలాడి మాకు కూతురేలేదనుకుంటామని నిన్ను ఇంట్లోంచి బయటకు గెంటేసారే అలాంటి వాళ్లను మీ అన్నయ్యలిద్దరు ఉద్యోగస్తులయ్యి తమ తమ సంసారాలతో ఎవరి దారిన వాళ్లు వెళ్లిపోతే వృద్ధాప్యంలో కుమిలిపోతున్న మీ అమ్మా నాన్నలను నేనున్నానంటూ వెళ్లి నీ యింటికి తీసుకొచ్చి సేవలు చేస్తున్నావే మరి వాళ్లు, నీకు జన్మనిచ్చిన తల్లితండ్రులనే కదా! నీవు ఓ స్త్రీమూర్తివై ఉండి ఆడపుట్టుకను అసహ్యంచుకుంటున్నావా కూతురు కొడుకుకన్నా ఏ విషయంలో తక్కువో చెప్పమ్మా అందుకు నీవే ఉదాహరణకదూ ఆడపిల్లల్ని కూడ మగపిల్లలతో సమానంగా చదివిస్తే ఉద్యోగాలుచేసి తల్లితండ్రుల్ని పోషించగలరు మన దేశమాత కూడ స్త్రీమూర్తే కదమ్మా! ఆ పుడమి తల్లి కడుపున ఎందరో వీర నారీమణులు ఉద్భవించి దేశానికి ఎంతో సేవచేసి తమ చివరి రక్తబిందువును కూడ దేశంకోసం ధారపోసారు కదమ్మా! అలాంటి

# 'పురుషులందు పుణ్య పురుషులు ఏరయా?'

'బెట్' అన్నాడు రాజా కుడిచేతి బొటనవేలు థమ్సప్ స్టయిల్లో చూపుతూ. 'ఒకె డన్' మిత్రబృందం కోరస్‌గా పలికింది.

మర్నాడు కాలేజిలో వాళ్లని ఎలాగ ఏప్రిల్ ఫూల్స్ చెయ్యాలా అని అరగంట నుండి తర్జన భర్జనలు పడుతున్నారు జానీ చేసిన ప్రపోజల్ వెరయిటీగావుంది మాటా మాటా పెరిగి పందాలవరకు దారితీసింది



'అంటే రేపు ఏప్రిల్ ఫస్టురోజున నేను గుండు చేయించుకుని కాలేజీకి అటెండవ్వాలి. మా 'బాబూరావు' అంటే మా నాన్న పోయాడని అందర్నీ నమ్మించాలి. అంతే కదా. బెట్ ఎంత?' అన్నాడు రాజా సిగరెట్ పొగని జానీ ముఖంలోకి వూదుతూ.

'జస్ట్ వన్ థౌజండ్ రూపీస్' అన్నాడు వెరయిటీకోసం ఎంత సొమ్మయినా ఖర్చుపెట్టే జానీ.

'రేపు చూడు మన యాక్షన్ ఎలా వుంటుందో. దెబ్బకి కాలేజీ మొత్తం ఎలా ఏప్రిల్ ఫూల్సవుతారో' అన్నాడు రాజా. అతని మనస్సులో వెయ్యి రూపాయలు ఈస్ట్‌మన్ కలర్‌లో కనబడుతున్నాయి. ఆ డబ్బుతో నాలుగు రోజులపాటు వళ్లు తెలీకుండా తాగెయ్యాలి అనుకున్నాడు రాజా

'నేనింతవరకూ చెప్పింది కథ కాదమ్మా కథలా వున్న యదార్థం పుత్రుడు పున్నామ నరకాన్ని దాటిస్తాడనుకునే వారికి బ్రతుకులో నే నరకాన్ని చూపించే రాజాలాంటి వారున్నారంటే ఆశ్చర్యపోనవసరం లేదమ్మా. 'పురుషులందు పుణ్యపురుషులు వేరయా' అని



ఒకనాడంటే 'పురుషులందు పుణ్య పురుషులు ఏరయా' అని వెదుక్కోవలసిన ఈ కాలంలో కూడా మగబిడ్డ కావాలన్న వ్యామోహంతో నన్ను హత్య చెయ్యొద్దమ్మా నాకు ప్రాణబిక్ష పెట్టమ్మా నువ్వు అబార్షన్ చేయించుకోవద్దమ్మా ఆడదానివయి యుండి కూడా సాటి ఆడదానిమీద ఆ మాత్రం దయలేదామ్మా.' దీనంగా వినబడుతున్న ఆ పలుకులకు కదిలిపోయింది సౌమ్య

ఆ మాటలు తన గర్భస్థ శిశువు మాటలుగా గ్రహించిన సౌమ్య పెదవులు అప్రయత్నంగా కదిలాయి

'లేదమ్మా నిన్ను బ్రతికించుకుంటాను మీ నాన్నగార్ని ఏదో విధంగా వప్పించి నిన్ను బ్రతికించుకుంటానమ్మా' దృఢంగా పలికింది సౌమ్య గొంతు

జి. శ్రీమన్నారాయణ,
గాంధీనగర్, విజయవాడ □

కూపన్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్యాసం రాసిన వారి పేరు : ____________________

________________________________________

పూర్తి చిరునామా ____________________

పిన్ కోడ్ · ____________________

# చరిత్ర

## వి.వి.న.మూర్తి

బదిలీ అయింది

దాదాపు ఏడుపుతో యింటికి చేరాడు రామచంద్రుడు కుర్చీలో కూలబడి పోయాడు. విషయం విన్న జానకి ప్రాణాలు పైనే పోయాయి

ఆ రోజు లగాయితూ వాళ్ళ యింటికి బంధువులూ, స్నేహితులూ తీర్థ ప్రజలా వస్తున్నారు పోతున్నారు

'ఎక్కడికి? కొచ్చిన్?

యింకేముందర్రా! అంతా అయిపోయినట్టే! దేశంగాని దేశం! భాష గాని భాష! ఆ తిళ్ళూ మీరు తినలేరు ఆ మనుషుల్తో మీరు తూగలేరు!

మీకింతటి కష్టం వచ్చిందర్రా! –'

ఈ ధోరణిలో అడిగిన వాళ్ళూ అడగనివాళ్ళూ వచ్చి ఊదరగొట్టేస్తున్నారు

జానకి గుడ్లప్పగించి వింటోంది! గుడ్ల నీళ్ళు గుక్కుకుంటోంది! టీలు కాస్తోంది! వచ్చిన వాళ్ళకి పోస్తోంది!

మీ అయన్ని మా యింటికి పంపించవే! మా వియ్యంకుడి పెత్తాత మనవడొకతను కొచ్చిన్లో ఉన్నాడుట అడ్రసు యిచ్చారు వెతికి యిస్తాను ఆ మనిషికి ఉత్తరం రాస్తే నా బంధో అంటూ సాయమవుతాడు–' అన్నాడు జానకి మేనమామ

రామచంద్రుడు కేంద్ర ప్రభుత్వోద్యోగి ఆఫీసర్. మూడో తరగతిలో దిగువ స్థాయి వాళ్ళకు సాధారణంగా బదిలీలు ఉండవు. ప్రధాన కార్యాలయంలో ఓ గురుద్యోగికి ఓ చిరుద్యోగి కంటిలో నలక అయాడు. ఆ చిరుద్యోగి తిక్క కుదరాలంటే అతన్ని కదిలించాలని భావించాడు ఆ కదలికను ధర్మబద్ధం చేయటానికి వరసవారీ బదిలీలు దేశప్రగతికి అత్యవసరం అన్నాడు. సంబంధింత మంత్రిత్వ శాఖలన్నీ అవును సుమా అన్నాయి ఆ విధంగా రామచంద్రుడిని విసిరేసారు

అతను తన ఆఫీసరు దగ్గరకుపోయి – "అయ్యా! మీరు చెప్పిన గీతలిల్లా గీసాను రాతలిల్లా రాసాను నోరెత్తి మాట్లాడని వాడిని పన్నెత్తి పలకరించటం రానివాడిని. వంచిన బుర్ర ఎత్తని వాడిని వినయమే భూషణంగా గల వాడిని నన్నిటుల సేయతగునా? –' అన్నాడు.

నిజమే నాయనా! మీ బోంట్ల వినయం మాకు ఉపాహారమే! అయితే మనమంతా పైవారికి కీలుబొమ్మలం! రికమెండింగ్ అథారిటీలు వేరు! అడ్మినిస్ట్రేటింగ్ అథారిటీలు వేరు! మళ్లీ నువ్వు వృద్ధుడి వయాక యీ విశాఖ వయివు వద్దువు గానిలే! యీలోగా ఏ అథారిటీకయినా నీ ఏడుపు వినపడిందా – సరే నీ అదృష్టం పలుకుతుంది! –'

ఈ ధోరణిలో అయన తన నిస్సహాయత వెల్లడించాడు

కొచ్చిన్ ఆఫీసు చాలా చిన్నది ఆ ఆఫీసులో ఉద్యోగులు ఎవరూ రామచంద్రుడికి గాని అతని సహోద్యోగులకి గాని తెలియదు

"ముందుగా వెళ్ళి అక్కడ జాయినవు! సెలవు పెట్టిరా! ఈలోగా యిల్లూ, పిల్లల స్కూలు సీట్లూ సెటిల్ చేసుకురా! తర్వాత వచ్చి సంసారాన్ని మోసుకుపో! –" అన్నారు మిత్రులు

రామచంద్రుడు ఆ సలహా పట్టుకుని యింటికి చేరాడు

భార్య తన మేనమామ చెప్పిన కబురు చెవిని వేసింది మర్నాడు పొద్దుటే ఆ పెద్దమనిషి యింటికి పరుగెత్తాడు

చూసావు రామచంద్రం! నువ్వెత్తి తిక్క ముండావాడివి! నీ పెళ్ళిలో నువ్వు చేసిన యాగీ ఉంది చూసావూ – అది నే మరిచిపోలేను" అంటూ ఎత్తిపొడిచాడు

రామచంద్రుడు ప్రతిదీ ఇన్‌టోటో ఒప్పేసుకున్నాడు దేన్నీ డినై చేయలేదు

"కానీ – నీ పెళ్ళాం బహుదొడ్డది! ఆ పిల్ల మొహం చూసి నీకీ సాయం చేస్తున్నాను –' రాఘవరావని – మనవాడు! అంటే మన కులం! మన భాష! మనదేశం! చూడూ – మనం పైవాళ్ళతో వ్యవహరించేటపుడు – ఎంత కాదనుకున్నా – యివ్వేనయ్యా నిన్ను పైకి లాగేవి– ' మా వియ్యంకుడికి రాస్తే అయన తనూ ఉత్తరం రాస్తున్నానని రాసాడు! యిదిగో! అతని అడ్రస్ కూడా రాసాడు! నేనూ ఓ ఉత్తరం రాసాను! నువ్వు నీకే సాయం కావాలో రాయి! –'

అన్నాడు – స్తోత్రాలకు పొంగే ఉబ్బులింగడిలా!

అపళంగా రామచంద్రుడు యింటికి పోయి ఓ పూటంతా కష్టపడి ఓ ఉత్తరం తయారు చేసాడు

ముందస్తుగా ఆ రాఘవరావూ తానూ ఏ క్రమయిన బంధువులవుతారో లెక్కలు మొదలు పెట్టాడు దాన్లో జానకీ సహకరించింది ఆ విధంగా సంబోధిస్తూ ఉత్తరం మొదలించాడు ఆ తర్వాత తామెంత 'క్లోజో' ఎస్టాబ్లిష్ చేసాడు నీవే తప్ప యితఃపరం బెరుగ – అన్న ధోరణిలో చనువు ప్రదర్శించాడు

"నా సమస్యలు మూడు (1) యిల్లు (2) పిల్లల చదువులు (3) స్టేషన్‌లో నన్ను రిసీవ్ చేసుకోటం – మీకు వీలయితే స్టేషన్‌కి రాగలరు నన్ను గుర్తుపట్టటాన్కి వీలుగా నా ఫోటో ఒకటి జత పరుస్తున్నాను –' అంటూ ముగించాడు.

రామచంద్రుడు తిరుగు జవాబు కోసం ఎదురు చూడటం మొదలు పెట్టాడు.

దానికి జవాబు వచ్చింది.

"మీకు యిల్లు కుదిరింది స్టేషనుకు రాగలను – మూడు వేలు కనీసం యింటికి అడ్వాన్సు తెచ్చుకోవాలి–"

రామచంద్రుడు కనిపించిన వాళ్ళందరితోనూ చెప్పసాగాడు

'చూసారాండీ! మనం మనమే! మనవాళ్ళు మనవాళ్ళే! మన భాష – మనదేనండి మాస్టారూ! మనలో మనకి ఎన్ని ఉన్నా – పైచోటికి వెళ్ళే మనవాళ్ళంతా ఒక్కటేనండి! అయినా అందులో తప్పేముందండి! – ఉండాలండి! ఆ మాత్రం కట్టు ఉండాల్సిందే!. ."

★ ★ ★

ఉదయం పది గంటల ప్రాంతంలో కొచ్చిన్లో దిగాడు రామచంద్రుడు

రాఘవరావు సులువుగానే రామచంద్రుణ్ణి గుర్తుపట్టాడు

అతన్ని ఓ హోటల్లో దింపాడు రాఘవరావు టిఫిన్లూ స్నానమూ పూర్తయాక యిద్దరూ బయల్దేరారు

'మీ యింటి ఓనర్! 'ఉన్ని కృష్ణన్!''

ఉన్నికృష్ణన్ పొట్టిగా బందోబస్తుగా ఉన్నాడు కళ్ళు ఎర్రగా ఉన్నాయి. అతను మాజీ సైనికుడు

'తుపాకుల గురించి కబుర్లు చెబుతాడు! కంగారు పడకండి! వంటవాడిగా పని చేసాడు. మేకలు కోసుకు బతికాడు. చూసారు కదా! అలాంటాడు యింత యిల్లు కట్టాడు! దీన్ని బట్టే వీణ్ణి అంచనా వేయొచ్చు – అన్నాడు తెలుగులో రాఘవరావు

ఉన్ని ఏదో అన్నాడు రాఘవరావు మలయాళంలో జవాబిచ్చాడు దాంతో రామచంద్రుణ్ణి చూసి బిగ్గరగా నవ్వటం మొదలుపెట్టాడు మనిషిని చూసే సగమయిపోయాడు రామచంద్రుడు రాఘవరావు మాటల్తో నోరు పొడారిపోతే ఉన్ని నవ్వుతో కరచరణాలు ఆడటం మానేసాయి.

ఉన్నికి ముక్కల యింగ్లీషు మాత్రమే వచ్చు

నలభై ఏళ్ళ బట్టీ తెలుగు నేలలో పెరిగి తెలుగు గాలి పీల్చి తెలుగు తిండి తింటూన్న రామచంద్రుడికీ యింగ్లీషు అంతంత మాత్రమే వచ్చు

వాళ్ళిద్దరూ మలయాళంలో మాట్లాడేస్తూ ఉంటే రామచంద్రుడు నోరప్పగించి చూస్తూ ఉండిపోయాడు

ఇంతలో ఓ అమ్మాయి కాఫీల ట్రే తో వచ్చింది

టేక్ టేక్ అన్నాడు ఉన్ని

ట్రేలో కప్పు తీసుకుంటూ – 'నామ్ కహాఁ?' అన్నాడు రామచంద్రుడు టీ అందిస్తూన్న పాపకి గాని, ఉన్నికృష్ణన్‌కి గాని ఏమీ అర్థం కాలేదు

రామచంద్రుడు సిగ్గుపడుతూ – నేమ్ షీ వాట్?'

ఉన్ని బిగ్గరగా నవ్వి – 'డాటర్ . డాటర్. మీనూ'

'షీ గుడ్ అచ్చా. బహుత్ నైస్ '

ఇంటి యజమానిని సంతృప్తి పరచటమే సుఖ జీవితానికి ప్రథమ సోపానమనీ – అది టెనెంట్ తాలూకు పవిత్ర కర్తవ్యమనీ – విశాఖపట్నంలో పదిహేడేళ్ళ అద్దెకొంపల అనుభవంలో అతను నేర్చాడు

సీ హవుస్" అంటూ తీసుకెళ్ళాడు ఉన్నికృష్ణన్

వెనకాల నడుస్తూ - "మీరేం మాటాడకండి! మీకు తెలీదు! అమ్మో! యీ మలయాళీలు మాయల మరాటీలు-"

బుద్ధిగా బుర్ర ఊపాడు రామచంద్రుడు. యిల్లు చిన్నది. వసతులన్నీ ఉన్నాయి. ప్రస్తుతం ఖాళీగా లేదు.

"వెన్ వేకెంట్?"

"-ష్! మీరు మాటాడొద్దన్నానా?" రాఘవరావు గసిరాడు నవ్వుతూ.

"వెన్ యూ కమ్?" అన్నాడు ఉన్ని.

యిల్లు కుదిరిందని రాఘవరావు రాయగానే రామచంద్రుడు రిజర్వేషన్ కుటుంబానికంతటికీ చేయించేసాడు. ఆ డేటూ ట్రైనూ చెప్పాడు.

"- మీరు స్టేషనుకు వస్తారు గదా" అన్నాడు రామచంద్రుడు.

"భలేవారే! ఎందుకు రాను?" నవ్వుతూ అన్నాడు రాఘవరావు.

ఆ తర్వాత మరికొంతసేపు అతనూ ఉన్నీ మలయాళంలో ఏదో అనుకున్నారు. రాఘవరావు రామచంద్రుడిని పక్కకు తీసుకెళ్ళి మూడు వేలు యిమ్మన్నాడు. ఆ సొమ్ముతో ఉన్ని దగ్గరకు వెళ్ళి మాట్లాడి వచ్చాడు.

తర్వాత హోటలుకు వచ్చే దాకా ఉన్నిని తిడుతూనే ఉన్నాడు రాఘవరావు. "పరమ కర్కోటకుడు! వీడనేగాదండి! యీ మలయాళీలంతా యిదే వరస! యిల్లు ఖాళీ చేయకుండానే సగం అద్దె బయానా యివ్వాలిట మన వేపు ఎక్కడా చూడలేదు గదండీ -"

తనని యింటికి రమ్మంటాడని అనుకున్నాడు రామచంద్రుడు. ఆఖరుకి అతని యింటి అడ్రస్ అడిగాడు.

"-నే వచ్చి తీసుకెళ్తానుగదండి! యీ వూళ్ళో మీరెక్కడ పట్టు పడతారూ -" అన్నాడు రాఘవరావు.

యిద్దరూ హోటల్లో స్థిమితపడ్డాక -

"అన్నట్టు - మళ్ళీ మర్చిపోతానండీ! అద్దె మూడూ యాభై! అడ్వాన్సు మూడు వేలు యిచ్చాను! మీరొచ్చే దాకా అద్దె రెండొందలు! బ్రోకరుకి మూడు వందలు! అయిదు వందలూ నా జేబులోంచి పెట్టాను! మనలో మనకి ఆ మాత్రం అవకపోతే ఎలాగండీ?"



రామచంద్రుడి మనసంతా అతని పట్ల కృతజ్ఞతతో అర్ద్రమయిపోయింది అతని రెండు చేతులూ పట్టుకుని –

"మీలాంటి మంచి మిత్రుడ్ని పొందినందుకు ఎంతో ఆనందంగా ఉంది సార్! ముక్కూ మొహం తెలీని నేను ఓ [illegible] ముక్క రాసినందుకు యింత సహాయం చేసారు – అన్నాడు

మిగిలిన డబ్బు యిచ్చేసాడు రామచంద్రుడు

"మిమ్మల్ని మా యింటికే తీసుకెళ్ళాలి ఆవిడకి వంట్లో బాగులేదు చాలా బాధపడుతున్నాను

సాయంకాలం వరకూ అతనితో గడిపాడు రాఘవరావు

మందు అలవాటు లేదన్నాడు రామచంద్రుడు అతన్ని తీసుకోమన్నాడు రెండు బీరకాయలతో కాలక్షేపం చేసాడు రాఘవరావు స్టేషన్లో కలుసుకుందామని చెప్పుకుని విడిపోయారు

మర్నాడు రామచంద్రుడు జాయినింగ్ రిపోర్టు యిచ్చాడు

సెలవు దొరికింది తిరుగు ప్రయాణమయాడు

జానకీ రామచంద్రుడు అంత డబ్బు పోయాల్సి వచ్చినందుకు నడుములు విరగ్గొట్టినట్టయి పోయారు అంత డబ్బు పోసినా అంత సాయం దొరికినందుకు ఎంతో ఆనందించారు

"అదే తెలీని వాళ్ళయితే యింకెంత పోయాల్సి వచ్చేదో నర్రా! మనాడు మధ్య నుండి మిమ్మల్ని గట్టెక్కించాడు' తెలీని దేశం! తెలీని లోకం! ఏమయి పోదురో!" అన్నాడు రాఘవరావుని పరిచయం చేసిన మేనమామ

"అంతే మామయ్యా' అంది జానకి.

ప్రయాణం రోజు రానే వచ్చింది సామాన్లు బ్రేక్‌వాన్లో ఎక్కాయి భార్యాపిల్లలో రామచంద్రుడు రైలు ఎక్కాడు

మద్రాసులో రైలు మారారు

గంటన్నర పైగా లేటుగా నడుస్తోందని కబురు తెచ్చాడు రామచంద్రుడు

పొరబాటున అంది జానకి – అంత లేటయితే ఆయన వస్తారో రారో!

"నీకు లోకం ఏం తెలుసునూ! యిలాంటి పరాయి చోట్ల ఓ భాష వాళ్ళు ఓ దేశం వాళ్ళు ఎంత కలిసికట్టుగా ఉంటారో! ఒకళ్ళకి ఒకళ్ళు ఎంత అవుతారో! అయినా – నాకు బుద్ధి లేదులే! ఆడాళ్ళతో అన్నీ చెప్పగూడదు! తోక తొక్కిన తాచులా లేచాడు

ఆ ధోరణిలో విరుచుకు పడిపోతున్న రామచంద్రుడిని చూసి జానకి బిత్తరపోయింది కంపార్టుమెంట్లో ఎవరూ తెలుగువాళ్ళు ఉండర్లే – అని సర్దుకుంది అయితే అతను అంతలా ఎందుకు కోప్పడుతున్నాడో ఆవిడకి బొత్తిగా అర్థం కాలేదు

మరో అరగంట వరకూ మరో తెలివి తక్కువ ముక్క అనలేదు జానకి. రామచంద్రుడు శాంతించాక అంది

"అవునండీ! నాకు తెలీకడుగుతానూ – ఆయన ఓ వేళ రాలేదనుకోండి – మీరు ఆ యిల్లు గుర్తు



ఇటీవల హైదరాబాదు, త్యాగరాయ గానసభలో వంశీ ఆర్ట్సు థియేటర్స్ ఆధ్వర్యంలో కూచిపూడి నాట్య ప్రదర్శన యిచ్చిన "నాట్యమయూరి", "రాజ నర్తకి", "నృత్యకళారత్న" మద్దాలి అపర్ణ శివతాండవ దృశ్యం.

## బదిలీ

పట్టగలరా?"

వెంటనే నాలిక కరుచుకుంది

ఈ మారు రామచంద్రుడు నిప్పు తొక్కిన కోతిలా ఎగిరాడు

"అనుమానాలు ముందు పుట్టి ఆడాళ్ళు తరవాత పుట్టారుట! ఛీఛీ! ఛిఛ్ఛీ! వెనకటికెవరో శుభం పలకరా మంకెన్నా అంటే పెళ్ళికూతురు ముండ ఎక్కడ చచ్చిందని అడిగాడ్ట –

ఆ అరుపులకి జానకి యీ మారు గాభరా పడలేదు ఈ పిచ్చి మానవునికి ఆ యిల్లు గుర్తు పట్టగలనన్న నమ్మకం లేకనే యిలా ఎగుర్తున్నాడని ఆవిడ పట్టేసింది

"చాలించండి నిర్వాకం! మీకన్నా నేను లక్షరెట్లు నయం! యీ తిప్పలన్నీ పడే బదులు – చక్కగా మీ ఆఫీసులోనే ఎవరినో ఒకరిని సెలవు చేసుకొని యిల్లూగిల్లా చూసుకోవచ్చు గదా! కర్మ! కర్మ" అంది తనూ గొంతు పెంచి

వెంటనే తగ్గిపోయాడు రామచంద్రుడు –

'నేనేం చేయను జానకీ! నువ్వేగదా మీ మావయ్య దగ్గరకు పంపావూ –" అన్నాడు గాభరాగా

బయల్దేరేలోగా మూడు ఉత్తరాలు రాసాడు రాఘవరావుకి! ఒక్కదానికీ జవాబు లేదు! ఏమయినా ఒంట్లో బాగులేదో! సెలవులో ఉన్నాడో! ఎలాగయినా స్టేషనుకి వస్తాడులే – అని సరిపెట్టుకున్నాడు.

జానకి అనుమానాలన్నీ రామచంద్రుణ్ణి దొలుస్తున్నాయి అవి జానకి నోటంట వినేసరికి అగ్గిబరాటా అయిపోయాడు కార్నర్ సీట్ల కోసం పిల్లలు కలియబడి పోతూంటే వాళ్ళ మీద కలియబడి ఉతికేసాడు ట్రైన్లో ప్రయాణీకులు గాభరా పడిపోయి వాళ్ళకి కార్నర్ సీట్లు యిచ్చేసారు

కొచ్చిన్‌కి రెండున్నర గంటల లేటుగా చేరింది రైలు

పిల్లలతో సామాన్లతో ప్లాట్‌ఫారమ్ మీద దిగాడు రామచంద్రుడు ప్రయాణీకులంతా వెళ్ళి పోతున్నారు కూలీలు మూగేసి మలయాళంలో అడిగేస్తున్నారు రామచంద్రుడికి పిచ్చి ఎక్కుతున్నట్టే ఉంది

ఉన్న ఒక్క రోజులోనూ నేర్చిన 'లేంద' లేందా' అంటున్నాడు

ప్లాట్‌ఫారమ్ ఖాళీ అయిపోతోంది! రామచంద్రుడి చేతి వేళ్ళ గోళ్ళన్నీ ఖాళీ అయిపోయాయి

వాడిన మొహాలతో పిల్లలు పెట్టెల మీద కూర్చున్నారు ఆఖరు కుర్రాడు 'ఆకలి' ఆకలి' అంటూ అమ్మ కొంగు పట్టుకుని ఏడుస్తున్నాడు రెండు తన్నులు తిన్నా వారి ఆకలి తీరలేదు

జానకి నోరు విప్పి తనకు తోచిన సలహా ఏదో చెప్పాలనుకుంటోంది భర్త వాలకం చూసి ఆవిడకి ధైర్యం కలగటం లేదు

యింతలో 'హా హ్హా హ్హా' అన్న నవ్వు' రామచంద్రుడి భుజం మీద ఎవరిదో చెయ్యి పడింది చటుక్కున వెనక్కి తిరిగాడు

ఉన్ని! అతని వెనక మీనాక్షి!

అతను ఏదో మాట్లాడేస్తున్నాడు ఒక్క ముక్క కూడా అర్థం కావటం లేదు

రాఘవరావ్ యువర్ ఫ్రెండ్? అంటున్నాడు ఉన్నికృష్ణన్

"నాటకమ్ బుర్ర ఆడిస్తూ అన్నాడు రామచంద్రుడు

కూలీలను కుదిర్చాడు ఉన్నికృష్ణన్ బ్రేక్‌వాన్లో సామాను రాలేదనీ తర్వాత బండిలో వస్తుందనీ చెప్పారు స్టేషన్లో! రామచంద్రుడు కంగారు పడ్డాడు ఉన్నికృష్ణన్ ఏదో చెపుతున్నాడు

అందరూ యిల్లు చేరారు

భార్యాపిల్లలు యిద్దరూ తమ వాటాలోకి ప్రవేశించారు స్నానాల గదిలో రెండు బాల్చీలతో నీళ్ళున్నాయి వంట గదిలో మంచి నీళ్ళున్నాయి

మీనాక్షి పిల్లలతో మాట కలిపింది తనతో తీసుకు వెళ్ళింది భార్యాభర్తలు స్నానాలు చేసారు

భోజనాలకు పిలిచింది ఉన్ని భార్య

ఆ రుచులు ఎలాగున్నా అందులో అభిమానం రుచి వాళ్ళ కడుపు నింపేసింది ఒకరి భావం ఒకరికి అందదు

ఆ తర్వాత నలుగురూ హాలులో కూర్చున్నారు.

'యూ మీల్స్ ఇన్ హోమ్ – మై హోమ్! –" అంటున్నాడు ఉన్ని

పెట్టిన తిండికి డబ్బులు యిమ్మంటున్నాడు కాబోలు అనుకున్నాడు రామచంద్రుడు డబ్బులు తీసి యివ్వబోయాడు

నో! నో" అంటూ ఉన్ని వారించాడు మీనాక్షిని పిలిచి ఏదో చెప్పాడు ఆమె గబగబా బయటకు వెళ్ళింది

'హ హ్హ హ్హ' అంటూ నవ్వుతున్నాడు ఉన్ని ఏదో అంటూ.

రామచంద్రుడు తమ వాటాలోకి నడిచాడు. పక్క పరిచింది జానకి అప్పటికే పిల్లలు పడుకున్నారు.

భార్యాభర్తలిద్దరూ మౌనంగా భారంగా ఎవరి ఆలోచనల్లో వాళ్ళు చతికిలబడ్డారు యింతలో తలుపు మీద చప్పుడు!

రామచంద్రుడు వెళ్ళాడు ఉన్నికృష్ణన్ ఓ టైపు చేసిన స్టాంపు కాగితాన్ని అతని చేతిలో ఉంచి – "అడ్వాన్స్ – అగ్రిమెంట్" అన్నాడు.

అతను వెళ్ళాక తలుపు వేసి వచ్చాడు.

కూడబలుక్కుంటూ చదివాడు రామచంద్రుడు.

"ఏంటి జానకీ యిది –?" గాభరాగా అన్నాడు.

"ఏం జరిగిందండీ–"

"మూడు వేలు యిస్తే రెండు వేలే అని రాసాడేంటి మునిలాయనా–?"

'పాపం' మంచాళ్ళు లాగే ఉన్నారండి' మనం

## బదిలీ

అడక్కుండానే రసీదు యిచ్చాడు! ఓ వేళ మర్చిపోయాడో ఏంటో!"

"నా బొంద మర్చిపోటం! వెళ్ళి అడిగేస్తాను–"

"బావుంది తెలివి! మన గొడవ వాళ్ళకి అర్థం కాదు! వాళ్ళ గోల మనకి తెలీదు. మీ తెలివితేటలే అంతంత మాత్రం. మధ్యలో ఉన్న రాఘవరావు గారి చేతే అడిగించటం సబబు!–"

"అంతేనంటావా!" అన్నాడు రామచంద్రుడు

"యింతకీ ఆయన ఎందుకు రాలేదో!" అంది ఆలోచనగా.

"ఏమయినా వంట్లో బావులేదేమో జానకీ! పరాయి దేశంలో మనవాళ్ళు మనకి అవకుండా పోరు. మనం ఆ మాత్రం అర్థం చేసుకోపోతే ఎలా?"

జానకి ఏదో అనబోయి యీలోగా మళ్ళీ తలుపు మీద చప్పుడు!

మీనాక్షి నిలబడి ఉంది ఆమె వెనకాల ఓ కొత్త ముఖం. దాదాపు ఉన్ని వయసే ఉంటుంది

"నా పేరు కుట్టి ఉన్ని మా చెల్లెలి హజ్బెండ్‌గా వుంది " అన్నాడు కుట్టి

ఆయన మాట్లాడేది తెలుగుగా గుర్తుపట్టిన రామచంద్రుడికి అంతులేని ఆనందం కలిగింది

ఉన్ని, కుట్టి, రామచంద్రుడూ కూర్చున్నారు

కుట్టి చాలా కాలం క్రితం హైదరాబాద్‌లో కొన్నాళ్ళున్నాట్ట తెలుగులో బాగానే మాట్లాడగలడు. ఆ తెలుగు క్రమంగా రామచంద్రుడికి అర్థమవుతోంది

ముగ్గురూ సంభాషణలోకి దిగారు.

మొత్తం సామాను వచ్చే దాకా భోజనాలు తమ యింట్లోనే చెయ్యమన్నాడు ఉన్ని దానికి డబ్బులు యివ్వబోయాడని చెప్పి – "మీ దేశంలో అలా డబ్బులు వసూలు చేస్తారా?" అని అడిగాడు ఉన్ని

లేదని జవాబిచ్చి సిగ్గుపడి పోయాడు రామచంద్రుడు

క్రమంగా సాన్నిహిత్యం పెరుగుతోందనిపించగానే అడ్వాన్సులో తేడా గురించి చెప్పేసాడు రామచంద్రుడు

ఉన్ని గాభరాగా "చచ్చు! నాకు మూడు వేలు యివ్వ లేదు! రెండు వేలే యిచ్చాడు! నా పిల్లల మీద ఒట్టు!"

అది తెలుగులో కుట్టి వివరిస్తుంటే రామచంద్రుడికి నమ్మబుద్ధి కాలేదు అయినా నమ్మినట్టు నటించబోయాడు

కానీ – ఉన్ని దాన్ని గమనించేసాడు

"ఆ రాఘవరావు – అద్దె ఎక్కువ యిప్పిస్తానని నా దగ్గర కూడా రెండు వందలు తీసుకున్నాడు –" అన్నాడు

రామచంద్రుడు ఆశ్చర్యపోయాడు, మనసులో యింకా అనుమానాలున్నా – రాఘవరావు తనకి టోకరా ఇచ్చాడా అన్న అనుమానం వచ్చింది

# ధర్మపథం




# దైవం-ప్రయత్నం

ఏదైనా పని జరగాలంటే దానికి తగిన ప్రయత్నం అవసరం. ప్రయత్నం లేనిదే పని జరగదు. సింహం నిద్రలో ఉండగా ఇతర జంతువులు దాని నోట్లో తమంత వచ్చి పడవని దీనికి ఉదాహరణగా పెద్దలు చెప్తున్నారు. అలస స్వభావులైన వారు తాము సంకల్పించుకొన్న పనికి తగిన ప్రయత్నం చెయ్యకుండా "మన ప్రయత్నంలో ఏమున్నది? అంతా దైవాధీనం అదృష్టముంటే అదే జరుగుతుంది. లేకపోతే జరగదు." అని చెప్పడం పరిపాటి అయింది విచక్షణులు దైవాన్ని నమ్ముకుని ప్రయత్నాన్ని మానవద్దంటారు. ప్రయత్నించడం పురుషుని విధి. ఒక వేళ ప్రయత్నం వల్ల ఫలం ఉండకపోవచ్చును. అప్పుడు దైవానుకూల్యం లేదనీ, తమ ప్రయత్నంలో లోపం లేదనీ, కొంచెం మనస్సుకు తృప్తి అయినా కలుగుతుంది. దీని వల్ల దైవమంటే అదృష్టమనే అర్థం చేసుకుంటున్నట్లు గ్రహించవచ్చును.

శరీరం నశించినా ఆత్మ నశించదు మానవుని మరణానంతరం ఆత్మ వేరొక శరీరంలో ప్రవేశిస్తుంది. అంటే పునర్జన్మ ఉంటుందన్న మాట. ఆత్మ ఏ శరీరంలో ప్రవేశించేదీ గత జన్మలో చేసుకున్న కర్మను బట్టి ఉంటుంది. మంచి కర్మలు ఆచరించి వుంటే ఉత్తమ జన్మ కలుగుతుంది. చెడ్డ పనులు చేస్తే దానికి తగినట్లే అధమ జన్మ కలుగుతుంది. ఆయా పనులకు తగిన ఫలం గడచిన జన్మలో అనుభవించక పోయినా మరు జన్మలో అనుభవించక తప్పదు. కొందరు శ్రీమంతులయి, కొందరు దరిద్రులయి ఉండడానికీ, కొందరు ఆరోగ్యవంతులయి, కొందరు ఎప్పుడూ ఏదో రోగంతో బాధ పడుతూ ఉండడానికీ వారు వారు చేసుకున్న కర్మలే కారణమని గ్రహించాలి. "దైవబలం ఉంటేనే పని జరుగుతుంది. లేకపోతే జరగదు." అనే వారు, ఆ దైవమనేది పూర్వజన్మలో చేసుకున్న కర్మ అనే తెలుసుకోవాలి. "పూర్వజన్మ కృతం కర్మ దైవ మిత్యభిధీయతే" అని పెద్దల సుభాషితం.

అందువల్ల రాబోయే జన్మ ఉత్తమమైనదై ఉండడానికి, ఈ జన్మలో మంచిపనులు చెయ్యడం అవసరం. దాని వల్ల యీ జన్మలో కూడా నలుగురిలో నూ మంచి పేరు తెచ్చుకోవచ్చు. అందరూ మంచి పేరునే కోరుకొంటారు గదా! దానికయి మనం మేలైన – నలుగురూ హర్షించే పనులు చెయ్యడానికి ప్రయత్నించాలి. ఆ ప్రయత్నానికి దైవ బలం కూడా లభించగలదని విశ్వసించాలి.

–బులుసు వేంకట రమణయ్య

ఉన్ని లేచి లోపలికి వెళ్ళి డబ్బు తీసుకు వచ్చి అతని ముందు ఉంచి –

"మీకు నా మాటల మీద నమ్మకం లేకపోతే యీ డబ్బు తీసుకోండి–"

అతనే భాషలో మాట్లాడకపోయినా రామచంద్రుడికి అర్థం అయిపోయింది. అతని మనసులో రకరకాల భావాలు ఒక్క మారుగా చొరబడ్డాయి.

"అయామ్ సారీ! సారీ" అంటూ అతని చేతులు పుచ్చుకున్నాడు. డబ్బులు అతని చేతిలోనే ఉంచాడు.

రామచంద్రుడు మనసంతా భరించరాని అసహ్యం! జుగుప్స! ఉద్రేకం ఆపుకోలేక అన్నాడు కుట్టీతో!

"మా తెలుగు వాళ్ళంతా యింతేనండి! వొట్టి లుచ్చాలు! మాకు మేమే గోతులు తవ్వుతాం! ఛీఛీ!"

కుట్టీ నవ్వుతూంటే హేళన తొంగి చూస్తోంది.

"వాట్ వాట్" అన్నాడు ఉన్ని.

నవ్వుతూ చెప్పాడు కుట్టీ ఉన్ని రామచంద్రుడి భుజం మీద చెయ్యి వేసాడు! కళ్ళలోకి చూసాడు అవి మానవుడి నేత్రాలు! అవి ఏ భాషకూ అందని భావాలను అతి సులువుగా వ్యక్తపరిచే నేత్రాలు! మానవ నేత్రాలు!

అతను అన్నది ఏమిటో రామచంద్రుడికి వినపడుతోంది. ఆ అనుభూతి అందుతోంది. ఉన్ని మాటలు వింటూ ఉన్న 'కుట్టీ నవ్వు హేళనా ఆగిపోయాయి.

విషయాన్ని వివరించాడు కుట్టీ

"మిత్రమా! అతన్ని తెలుగువాడని తిట్టుకోకు! యిక్కడ తెలుగూ మలయాళమూ హిందీ తమిళమూ అని లేవు! ఉన్నదల్లా మనుషులు! ఉన్న భేదమల్లా మంచితనమూ – చెడ్డతనమూ అంతే!"

మన భాష, మన కులం, మన మతం, మనదేశం లాంటి భావాల నుంచి బదిలీ కావటం ప్రారంభించాడు రామచంద్రుడు.

లోపల కాసెట్‌లోంచి ముఖేష్ గొంతు వినవస్తోంది

"బస్ వోహీ అపరాధ్ మై హర్‌బార్
కరతా హూఁ!
ఆదమీ హూఁ!
ఆదమీ సే ప్యార్ కరతా హూఁ!" □



# దూరదర్శనం

లత

**6–2–87** శుక్రవారంనాటి కార్యక్రమం స్వరమాధురితో ప్రారంభమయింది అందులో సితార వాద్యం చాలా బాగుంది కుమారి శోబానాయుడి కూచిపూడి నృత్యం అదృష్టవంతులం నృత్యం బాగుంది దశావతార నృత్యం చాలా రక్తికట్టింది భక్త ధృవ – చిన్న పిల్లల నాటిక – అందరూ పిల్లలే నటించారు ఎలా ఉందంటారా? . బాగా లేదని వ్రాయటానికి కొంచం బాధగానే ఉంది – నేనూ కందా మోహన్ కల్పకం నాటకాలు వేసేవాళ్ళం రేడియోలో – తరువాత ఆనాటికని పెళ్ళిచేసి చూడు సినిమాలో చూపించారు. ఇంత అన్యాయంగా డైలాగులు చెప్పలేదు న్యాపతి దంపతులు మాకు డైలాగులు ఎలా చెప్పాలో నేర్పారు అందులో రేడియోలో నవరసాలూ డైలాగుల్లోనే పలకాలి ఇంద్రధనుస్సు – నాటికలో ఈవారం కథ ఆత్మాభిమానం – రచన యర్రంశెట్టి శాయి గుమాస్తా భార్య కలెక్టరు భార్య దగ్గరకు రికమండేషనుకోసం వెళ్ళి అవమానం పాలయి తన భర్త కంట్రాక్టరు అని చెపుతుంది హైద్రాబాద్ అయిపోయి బొంబేలో చిత్రహార్ ప్రారంభమయింది తెలుగుకన్నా హిందీ కార్యక్రమాలే బాగున్నట్లున్నాయి ఏక్ కహానీ – పంచ లైట్ – రచయిత రేకు. టైటిల్సు మహా తొందరగా తీస్తారు అదో బాధ పంచాయితీ చదవటానికి చాలా గోల – పంచలైట్‌ట అంటే పెట్రోమాక్స్ లైట్ ఇందులో ఒక పంచాయితీకి పది రూపాయల జుల్మానా ఉంది ఏం చేస్తాం చెప్పండి. ఆ లైటుకి కొబ్బరికాయలు కొట్టి పూజచేస్తారు చివరికి పంచాయితీలో పది రూపాయలు జుల్మానా వేసినవాడు ఆ లైటుని వెలిగిస్తాడు రేకుని బోలెడుమంది పొగిడారు కాని ఈ బీహారీ రచయిత వ్రాసిన కథ ఓ మాదిరిగా ఉంది బీహారు వెనకపడినట్లు ఉంది – ఈ కథని బట్టి రేకు పెద్ద రచయిత అనిపించటం లేదు క్షమించాలి

7–2–87 శనివారం డ్రింకింగ్‌మీద అమెరికా డాక్యుమెంటరీ ఇచ్చారు కాని అది సర్వులకూ అవసరం అనిపించింది త్రాగుడు రాక్షసివల్ల చాలా కుటుంబాలు నశించి పోతున్నాయి అందుకని షెడ్యూలులో లేకపోయినా వ్రాశాను గాంధీజీ జీవిత మార్గంలో కొన్ని ఘట్టాలు బొమ్మలరూపంలో చూపించారు – ఆయనని రైల్లోనుంచి తొయ్యటం వగైరాలన్నమాట

పెద్దకొడుకు సహజంగా డబ్బులేక పోవటంవల్ల ఆమెని పెళ్ళి చేసుకోడు స్త్రీలోలుడయిన నాగభూషణం ఇందులో కామరాజు వాళ్ళిద్దరికీ పుట్టినవాడు శంకర్ – అతని ప్రేమికురాలు భటానీలగౌరి ఇందులో నాగయ్య అలనాటి శిబి దధీచుల తాతలాటివాడు. ఆస్తి లోకువూ, ఇల్లు తమ్ముడి కొడుకులకీ – ఇచ్చి – తమ్ముడి కూతురుతో శోభన్‌బాబు, కాంచనల పాకకి చేరతాడు. ఉపకథ నాగయ్య భాగ్యవంతుడిగా ఉండగా, అతని తమ్ముడి కూతురు – నాగభూషణం రెండవభార్యకి పుట్టిన మోహన్‌ని ప్రేమిస్తుంది – నాగభూషణంకి ఎన్నేళ్ళు వచ్చినా స్త్రీలౌల్యంపోదు. ఆయన భార్య అన్నపూర్ణ అనబడే వరలక్ష్మి – మొదట పెళ్ళి చేసుకోకుండా లారీ పక్కన బిడ్డకని పోతుంది. శోభన్‌బాబు తల్లి – అయినా అతను హీరో కనక – నాగయ్య పెంచాడు కనక కొన్ని నీతి పనులుచేస్తాడు. – తరువాత కన్నతండ్రిని గదిలోపెట్టి ఆకలితో మాడ్చి – కాగితాలు తినటానికి పనికిరావంటాడు ఆరోజుల్లో ఆడవాళ్ళు ఏడిస్తే డబ్బు లొచ్చేవనుకుంటాను సంగీతం బాగుంది ఆదినారాయణరావుగారుగా మరి జంట నగరాల నీటి సమస్య ఒక డాక్యుమెంటరీ చూపించారు బాగుంది పచ్చి నిజాలు కనక సిద్ధార్థ – సినిమా సిమ్మి, శశీ ఇందులో నటీనటులు సినిమా మంచిది లెట్ ము పిలతో పెద్ద యాతన నిద్రవస్తూ ఉంటుంది గతంలో దీన్ని చూశాను సిమ్మి హొడుగాటి శరీరం అలంకరణా అజంతా శిల్పాన్ని పోలి ఉన్నాయి

8–2–87 ఆదివారం అప్నా ఔర్ పప్నా – చివరకి ఎలాగయితేనేం షికారీని పట్టుకున్నారు – అడవీ – దాని అందాలూ ఆ జంతువులూ మళ్ళీ మనని చెట్లు ఎక్కువ ఉన్న పూర్వ భారతదేశంలోకి తీసుకుపోతాయి రామాయణం – రచన సమర్పణ రామానంద సాగర్ ప్రొడ్యూసరూ ఆయనే

ఏమి ఏమి రామకథ ఇది? వశిష్ఠుడు యోగవాశిష్ఠంతో విద్యాభ్యాసం ప్రారంభిస్తాడు అరవయి నాలుగు విద్యల్లో నిష్ణాతులైన శ్రీరామ సోదరులు అయోధ్యకొచ్చి ఉభ్యంగన స్నానం చేస్తారు శ్రీ రామ శివభక్త గురుకులంలోనే చూపించారు సూర్య స్తోత్రం వినిపించారు – సుందరాకారుడైన రాముడిని చూసి తల్లులూ తండ్రే కాక పౌరులందరూ ఆనందిస్తారు – విశ్వామిత్రయాగాన్ని మారీచ సుబాహులు పాడుచేస్తారు అంతమటుకు అయింది కథ

జిందగీ – జిందగీ. డైరెక్షన్ బేడీ. ఇందులో ఉపకథ ఏమిటంటే ఒకనవాబు కుటుంబంలో కోడలు ఆడపిల్లని కనటంవల్లా వారి ఖాన్‌దాన్ వీరికంటే తక్కువవటంవల్లా రెండో పెళ్ళి తలపెడతారు. అది విన్న ఆత్మాభిమానం కలకోడలు డైవోర్సు ఇస్తానంటుంది. మామగారు చింపేస్తాడు కాగితాల్ని... ఆఖరికి పిల్లతో సహా వదిలివెళ్ళిపోతుంది. దయగల భర్త పిల్లని తెచ్చిఇస్తాడు. నా ఊహ ప్రకారం ఆ పిల్ల డాక్టరవాలి. వేచి చూద్దాం.

మన్ పసంద్. లాగానే ఉంది సినిమా – ఆధారం బెర్నార్డు రచన మైఫెయిర్ లేడీ లాగుంది. దేవానంద్ – టీనా మునీమ్ – గిరీష్ కర్నాడ్‌లు నటించారు. సినిమా చాలా బాగుంది. దేవానంద్ వృద్ధుడైపోయినాడు. □

కూచిపూడి ఆర్ట్ అకాడమీ, రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖ సంయుక్త ఆధ్వర్యంలో తూర్పుగోదావరి జిల్లా కాకినాడ సూర్య కళా మందిరంలో తమ బృందంతో చండాలిక నృత్య నాటిక ప్రదర్శించిన కుమారి శోభనాయుడుకు మొమెంటో అంద జేస్తున్న గోదావరి ఎరువులు, రసాయనాల సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ ఎం. గోపాలకృష్ణ, జిల్లా కలక్టరు శ్రీ ఎం. వి. పి. సి. శాస్త్రి గార్లని చిత్రంలో చూడవచ్చు.



# హైదరాబాదు నోట్‌బుక్

## భయం వేస్తోందా భారతీ! ఆవిష్కరణ :

ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం అసిస్టెంట్ స్టేషన్ డైరెక్టర్ డాక్టర్ ఆర్ పద్మనాభరావు 20 ఏటనే శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఎం ఎ పరీక్షలో సర్వ ప్రథములుగా ఉత్తీర్ణులై స్వర్ణపతకం పొంది, వెంటనే కందుకూరు ప్రభుత్వ కళాశాలలో తెలుగు అధ్యాపకులుగా చేరారు అష్టావధానాలు చేసి ఆంధ్రప్రదేశ్ అంతా తిరిగారు ఇరవైకి పైగా సాహిత్య గ్రంథాలు, వివిధ పత్రికలలో వ్యాసాలు ప్రచురించారు కందుకూరి రుద్ర కవిపై పరిశోధన చేసి పి హెచ్ డి పొందారు 1975 నుంచి 82 వరకు ఆకాశవాణి కడప, విజయవాద కేంద్రాలలో తెలుగు ప్రసంగాల ప్రొడ్యూసర్‌గా పని చేశారు 1982లో యూనియన్ పబ్లిక్ సర్వీసెస్ కమీషన్ ద్వారా అసిస్టెంట్ స్టేషన్ డైరెక్టర్‌గా నియుక్తులై ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో పని చేస్తున్నారు త్వరలో ఆకాశవాణి ఢిల్లీ స్టాఫ్ కళాశాల అసిస్టెంట్ డైరెక్టర్ పదవీ బాధ్యతలు స్వీకరించనున్నారు శ్రీ పద్మనాభరావు సాహిత్య వ్యాసంగంతో పాటు జర్నలిజం, పబ్లిక్ రిలేషన్స్‌లోను డిప్లొమా పొందారు పబ్లిక్ రిలేషన్స్‌లో సర్వ ప్రథములుగా ఉత్తీర్ణులై కులపతి మున్షీ పతకం, రజతపతకం పొందారు వివిధ సాహిత్య, సాంస్కృతిక సంఘాలలో బాధ్యతాయుత పదవులు నిర్వహించారు ఇంతయినా వయస్సు నాలుగు పదులు మొన్నటి జనవరి 29కి దాటింది. 1947 జనవరి 29న నెల్లూరులో జన్మించారు. సంవత్సరానికొక రచన ప్రచురించాలనే నియమంతో వున్న శ్రీ పద్మనాభరావు కొత్త సంవత్సరంలో ప్రచురించిన భయం వేస్తోందా భారతీ! కవితా సంపుటి ఆవిష్కరణ జనవరి 28 సాయంకాలం శ్రీ త్యాగరాయ గాన సభలో ఆయన సాహితీ రజతోత్సవం సందర్భంగా వంశీ ఆర్ట్ థియేటర్ ఆధ్వర్యాన జరిగింది తెలుగు విశ్వ విద్యాలయం ఉపాధ్యక్షులు డాక్టర్ తూమాటి దొణప్ప ఈ సాహితీ రజతోత్సవ సభకు అధ్యక్షత వహించి శ్రీ పద్మనాభరావు ఆకాశవాణికి తల లోని నాల్కగా వుంటూ, అజాత శత్రువై మంచితనం పెంచి పదిమందికి పంచడం పద్ధతిగా పెట్టుకొన్న వాడని సంస్కార బలంతో కవితలో సార్థకత సాధించారని ప్రశంసించారు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం డైరెక్టర్ డాక్టర్ వి వి ఎల్ నరసింహారావు 'భయం వేస్తోందా భారతీ!' ఆవిష్కరిస్తూ శ్రీ పద్మనాభ రావు ప్రాచీన కవిత చక్కగా నడిపి వచనకవితనూ చేపట్టారని, దానిని భావలయ, భావరతులతో చక్కగా చెవికి ఇంపుగా నడిపారని అన్నారు కొంచెం ఆలస్యంగా వచ్చిన డాక్టర్ సి నారాయణ రెడ్డి తమ ప్రసంగంలో తాము వేళాపాలనాలోలులయినా, అనివార్యంగా ఆలసించవలసి వచ్చిందని, శ్రీ పద్మనాభరావు అక్షర రమ్యత పాటించేవారని, ఆకాశ వాణీ విహారి మాత్రమే కాక తాళపత్ర కాంతార సంచారి అని అన్నారు ముఖ్య అతిథిగా వచ్చిన మహారాష్ట్ర మాజీ గవర్నర్ శ్రీ కోన ప్రభాకరరావు శ్రీ పద్మనాభరావును సన్మానం చేయగా, సన్మాన పత్రాన్ని డాక్టర్ దొణప్ప అందజేశారు పిదప వివిధ సంస్థలు శ్రీ పద్మనాభరావును పుష్పమాలాలంకృతులను చేశాయి శ్రీ కోన ప్రభాకరరావు ప్రసంగిస్తూ శ్రీ పద్మనాభరావు ఇంకా చిన్న వయస్సు వారు గనుక మేథ పండించి సాహిత్య ప్లాటినం ఉత్సవం చేసుకోవాలని, ఇంకా 18 ఏళ్ళ సర్వీస్ ఉంది గనుక ఆకాశవాణి డైరెక్టర్ జనరల్ కావాలని ఆశీర్వదించారు. తెలుగు ప్రముఖుల జీవిత



డా॥ పద్మనాభరావు

చరిత్రలను రచించాలని కోరారు శాశ్వతం వున్నప్పుడే సాహిత్యం, విజ్ఞానం రాణిస్తాయని శ్రీ శ్రీ శ్రీ పుష్పగిరిస్వాములవారు ఆశీర్వదించారు డాక్టర్ పద్మనాభరావు ఉచిత రీతిని సమాధానం చెప్పిన మీదట శ్రీ సారంగధరరావు ధన్యవాదాలతో రజతోత్సవం సమాప్తమైంది సభాప్రారంభానికి ముందు విజయబాల కల్చరల్ అసోసి యేషన్ (విజయనగర కాలనీ) వారు లలిత సంగీత విభావరి నిర్వహించిన పిదప వంశీ ఆర్ట్ థియేటర్స్ ప్రధాన కార్య దర్శి శ్రీ వంశీరామరాజు స్వాగత వచనాలతో ఉత్సవం ప్రారంభమయింది

## శ్రీ పోతుకూచి సాంబశివరావుకు మరి రెండు బిరుదులు:

గడచిన మూడున్నర దశాబ్దాలుగా తెలుగు సాహిత్య సాంస్కృతిక ప్రజాహితరంగాలలో నవనవోత్సాహ చైతన్యాలతో కృషి చేస్తున్న శ్రీ పోతుకూచి సాంబశివరావును దాదాపు 35 సంస్థల ఆధ్వర్యంలో జనవరి 27న త్యాగరాజ గాన సభలో యువజన మిత్ర, విశ్వాంధ్ర సంధాత బిరుదులతో సన్మానించారు మాజీమంత్రి, సన్మాన సంఘం అధ్యక్షుడు డాక్టర్ సి హెచ్ దేవానందరావు ఈ బిరుద ప్రదానం చేశారు విశ్వసాహితి రజతోత్సవ సందర్భంగా జరిగిన ఈ సన్మాన సభకు సభాసమ్రాట్ శ్రీ కె వి భాస్కరరావు అధ్యక్షత వహించారు శ్రీ ఎన్. జవాహర్ రచించిన 'పోతుకూచి సాహిత్య దర్శనం అనే గ్రంథాన్ని రాష్ట్ర పోలీసు గృహనిర్మాణ సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ పి జగన్మోహనరావు (ఐ పి ఎస్) ఆవిష్కరించారు ఇండస్ట్రియల్ ట్రిబ్యునల్ జడ్జ్ శ్రీ జె వేణుగోపాలరావు సన్మాన సంఘం పక్షాన శ్రీ పోతుకూచి సాంబశివరావును సన్మానించారు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కో ఆర్డినేటర్ శ్రీ ఎ చక్రపాణి, డాక్టర్ బోయి భీమన్న, మాతృశ్రీ సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ ఎం వి సుబ్బారావు మున్నగు వారు శ్రీ పోతుకూచి బహుముఖ ప్రతిభను, సేవను ప్రశంసించారు ప్రారంభంలో శ్రీ నటరాజ రామకృష్ణ శిష్యురాలు కుమారి జి ఎల్ పద్మ త్రిపుర సంహారం, దశావతారాలు మున్నగు నృత్యాలు ప్రదర్శించి ప్రేక్షకులను ఆనందింప జేశారు

## కందుకూరి రుద్రకవి రచనలపై ప్రసంగం:

కందుకూరి రుద్రకవి రచనలు, వ్రాత ప్రతుల పరిశీలన – అనే అంశంపై ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం అసిస్టెంట్ డైరెక్టర్ డాక్టర్ ఆర్ పద్మనాభరావు జనవరి 30వ తేదీన ప్రాచ్యలిఖిత గ్రంథాలయం సమావేశ మందిరంలో ప్రసంగించారు గ్రంథాలయం పండితులు శ్రీ కె సత్యనారాయణ స్వాగత వచనాలు, శ్రీ కె వి రామశాస్త్రి ప్రార్థన తర్వాత గ్రంథాలయం డైరెక్టర్ డాక్టర్ వి వి ఎల్ నరసింహారావు గ్రంథాలయం ఉద్దేశాలను వివరిస్తూ, రెండేళ్ళుగా ప్రత్యేక విషయమై ఉపన్యాసాలు ఏర్పాటు చేస్తున్నామని. ఈ సారి డాక్టర్ పద్మనాభరావు ప్రసంగం ఏర్పాటు చేశామని , భాషా సారస్వత రంగాలలో అనేక శిష్యులను తీర్చిన డాక్టర్ తూమాటి దొణప్ప ఈ సభకు అధ్యక్షత వహించడం విశేషమని అన్నారు తెలుగు దేశం ప్రభుత్వం పెట్టిన అమృత పాయసాన్నం తెలుగు విశ్వవిద్యాలయం దాని ఉపాధ్యక్షులు డాక్టర్ దొణప్ప గారిది వెన్నవంటి మాట, వెన్నెల లాంటి మనసు ఆయన సజ్జన వరిష్ఠుడు, సంవిద్గరిష్ఠుడు – అనీ అన్నారు రుద్రకవి మాల్యాద్రి వైభవం మున్నగు గ్రంథాలు వ్రాసినా సుగ్రీవ విజయం, జనార్ధనాష్టకం నిరంకుశోపాఖ్యానం ప్రముఖమైనవని, నిరంకుశోపాఖ్యానం 1901 లో కాకినాడ సరస్వతీ పత్రికలో తిరుపతి వేంకట కవుల పరిష్కరణతో ప్రచురిత మైందని, తర్వాత వావిళ్ళ వారు, స్వర్ణ సుబ్రహ్మణ్యకవి విపులపీఠికలతో ప్రచురించారని వివరించారు అధ్యక్షత వహించిన డాక్టర్ దొణప్ప ప్రసంగిస్తూ, సంస్కృతికి అక్షర రూప నిక్షేపాలు తాళపత్ర గ్రంథాలు దక్షిణ భారతంలో తాళపత్రాల



ఇటీవల ఖరగ్‌పూర్‌లో ప్రవాసాంధ్ర నవ్య కళా పరిషత్తు వారు ఏర్పాటు చేసిన ముగ్గుల పోటీల్లో పాల్గొని ముగ్గులు పెడుతున్న వనితలు. మొదటి బహుమతి పొందిన శ్రీమతి శిందె సుజాతని కూడా చిత్రంలో చూడవచ్చు

# ఉత్తరాలు

( 4 వ పేజీ తరువాయి)

## సీరియల్స్

ఒకటి ఒకటీ మూడు సీరియల్ చాలా రసవత్తరముగా నడుస్తున్నది.

–పి కల్యాణి, కారంచేడు

## వ్యాసాలు

"పినాకినీ తీరాన రమణీయక్షేత్రము పుష్పగిరి' గురించిన వ్యాసం చదివాను వ్యాసంలోని అంశాలు మధురాతి మధురం. శిల్పసంపద, పుష్పగిరి ఆలయం చిత్రాలు నాకు నచ్చినాయి

–కె శేషగిరి, నల్గొండ

★ ★ ★

రాధ ముఖచిత్రంగల ఆంధ్రసచిత్ర వారపత్రికలో "శ్రీరామ కృష్ణ వివేకానందులు", "పినాకినీ తీరాన రమణీయ క్షేత్రం పుష్పగిరి", "మాయమైన శిద్ధవటం కాయలు", వ్యాసాలు ద్వారా మాకు తెలియనివి కొన్ని తెలిసినవి.

–కాజ హనిత, ఏలూరు

## ధర్మపథం

"ధర్మపథం" శీర్షికలో నిజమైన బంధువులను గురించి వంచకులైన బంధువులను గురించి బులుసు వెంకటరమణయ్య గారు చక్కగా వివరించి చెప్పినారు– ధర్మపథం శీర్షికలోని ప్రతి వాక్యము ఆణిముత్యం–

–ఎస్ రామచంద్రమూర్తి,
రామగిరి, నల్లగొండ

## కథలు

ప్రతీకారం, టాక్స్ లెస్ ఇన్‌కం' కథలు బాగున్నాయి రచయిత(త్రు)లకు మా అభినందనలు

–సి. హెచ్. మోహన్‌చంద్రరావు,
ఖర్గపూర్

★ ★ ★

'ప్రతీకారం", "గురుర్బ్రహ్మ', "వెరీ అర్జెంట్" కథలు చాలా బాగున్నాయి

–గరిగ నరసయ్య, రామకృష్ణపూర్

★ ★ ★

'టాక్స్ లెస్ ఇన్‌కం"! కథ చాలాబాగున్నది. చదివినంతసేపూ కడుపుబ్బ నవ్వించింది మొత్తం మీద వెరైటీగా వుందీకథ రచయితగారికి అభినందనలు.

–కె. వి యస్ ఆర్ నాయుడు, నెల్లూరు

## శీర్షికలు

30 జనవరి, 5 ఫిబ్రవరి –87 సంచిక ముఖ చిత్రము నటి రాధ చాల బాగుంది. కొద్ది కాలముగా మీరు ప్రచురించుచున్న కొత్త శీర్షికలు పాఠకులను, ముఖ్యముగా నన్ను సంతోషము కల్గించుచున్నవి రచయిత్రి జవాబులు, చిన్నారి బాలల దీన గాథలు, బానుప్రియ సమాధానాలు, గర్భస్థ శిశువు చెప్పిన కథలు, మొ. శీర్షికల ద్వారా పాఠకులకు మంచి అవకాశము కల్పించు చున్నారు

–చీమకుర్తి నాగేశ్వరరావు, సత్తెనపల్లి □

# హైదరాబాద్ నోట్‌బుక్

వాడుక ఎక్కువ వాటిని బట్టే మన అక్షరాలు గుండ్రంగా తయారయ్యాయి. ఉత్తర భారతంలో భూర్జ పత్రం ఎక్కువగా వ్రాతసాధనం. చైనాలో వెదుళ్ల మీద పైనుంచి కిందికి వ్రాస్తారు బర్మాలో మన సంప్రదాయ వ్యాప్తి వల్ల తాటాకులు వ్రాత సాధనాలయాయి పూర్వం ఏడిగా లేఖకులు ఉండేవారు తాటి చెట్టు ప్రాముఖ్యాన్ని బట్టే శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు తాటి చెట్టును ఆంధ్ర కల్పవృక్షమన్నారు అచ్చుకాని విలువైన గ్రంథాలను ముద్రింప జేయాలని తెలుగు విశ్వవిద్యాలయం సంకల్పించింది బుదుతకల్ అంటే పోర్చుగీసువారు ఈ విషయం తెలియనందున బుడుతూల్ పట్టు మంచం అన్న పదానికి చిన్న కాలుగల అని అర్థం చెప్పారు. ఇలాటి వాటిని పరిష్కరించాలి– అని అన్నారు పిదప శ్రీ పద్మనాభరావు నిరంకుశోపాఖ్యాన లిఖిత ప్రతుల సేకరణ విషయంలో తమ అనుభవాలు వివరించారు రుద్రకవి వంశం వారు నెల్లూరు జిల్లా చింతల పూడిలో వున్నారని, వారికి నేడు సాహిత్య పరిచయం ఏమీలేదని తెలిపారు కందుకూరులో నేడూ జనార్ధనాలయం, సోమేశ్వరాలయం వున్నాయని, నిరంకుశోపాఖ్యానం ఏ పురాణ కథా కాక, కేవల సాంఘిక కథగల తొలి సాంఘిక ప్రబంధమని, ధూర్త నాయకుడైన నిరంకుశుని చివరకు సంస్కరించి సజ్జనుని చేయడం రుద్రకవి గొప్పదనమని అన్నారు.

**ఉపశ్రుతి:–**

రవీంద్రభారతిలో ఏదో సభ– ముగిసింది నేను వెళ్ళుతున్నాను. ఏమిటి వెళ్ళిపోతున్నారు. . రాజు నృత్యం చూడరా? ఆమెవద్దా మీకు– అనడిగారు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు పక్కనే ఉన్న అధికార భాషా కమిషన్ అధ్యక్షులు డాక్టర్ కె. వీరభద్రరావుగారు ఆయన చూస్తారు తయారయి వస్తారు– అని ఛలోక్తి విసిరారు. పక్కన వున్న వారంతా నవ్వారు నాకు ఈ తయారు కావడం ఏమిటో అర్థం కాలేదు. మీరు చెప్పండి ఏమిటో?

–తిరుమల రామచంద్ర

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667

# దేశాన్ని పట్టించుకోని ప్రభుత్వం

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

ఒకవైపు పాకిస్తాన్ తన అణుబాంబును విజయవంతంగా ప్రకటిస్తుండగా, మరో వైపు మన అణు శాస్త్రజ్ఞులు, ఎక్కువగా తెలిసి ఉండవలసిన వారు, తమ రాజీనామాలను ప్రకటిస్తున్నారు ఇక రాజీవ్ ప్రభుత్వ మైతే, దేశపు అత్యున్నత శాస్త్రవేత్తల మధ్య అవాంఛనీయమైన ఘర్షణ తనకేమీ పట్టనట్టు ప్రవర్తిస్తున్నది ఢిల్లీలో ప్రభుత్వం అనేది ఒకటి ఉన్నదా అని, దేశపు అణుశక్తి ప్రయోజనాలను పరిరక్షించడం బాధ్యతగా గల మంత్రి మనకున్నారా అని, నిజంగా మన అణుశక్తి సంస్థలు తమ కర్తవ్యాన్ని నెరవేరుస్తున్నాయా అని సందేహించ వలసి వస్తున్నది

సాంకేతికంగా చూస్తే, అణుశక్తి వ్యవహారాల బాధ్యత ప్రధాన మంత్రిది అంటే ఎవరూ బాధ్యత వహించడం లేదని అర్థం ఎందుకంటే ప్రదానమంత్రి శిఖరాగ్ర సమావేశాల కోసం ఒక సమావేశం నుంచి మరో సమావేశానికి ఆకాశంలో విహరిస్తున్నారు మొన్న ఆఫ్రికా నిధి శిఖరాగ్ర సమావేశం కోసం మనం 5 కోట్ల రూపాయల పైగా ఖర్చు పెట్టాం మన మీద వాళ్ళు ఇష్టారాజ్యంగా స్వారీ చేస్తున్నారని మనం గుర్తించే లోగా మన సమయమూ , శక్తి ఎంత వెచ్చించనున్నామో ఆ భగవంతుడికే తెలియాలి ఈ లోగా దేశంలో వ్యవహారాలు చూసేందుకు ప్రదాన మంత్రికి తీరిక లేదు ఈ అంతరంగిక వ్యవహారాలకు అణుశక్తి భవిష్యత్తుకూ సంబంధం ఉన్నా సరే, అందువల్ల ఒక జాతిగా మన భవిష్యత్తుకు సంబంధం ఉన్నాసరే

ఇటువంటి క్లిష్ట సమయంలో తమ సంగతిని మించి బైటికి చూడలేని శాస్త్ర వేత్తల పట్ల నాకు ఘనమైన అభిప్రాయం లేదు దాదాపు ఒక సంవత్సరం క్రితం పాకిస్తాన్‌కు అప్పటికే ఒక బాంబు ఉన్నదని- అది అంత ఆధునికమైనది కాక పోయినా మొత్తానికి బాంబేనని నేను ఈ శీర్షిక క్రిందనే వ్రాశాను పాకిస్తాన్ సంపాదించుకున్న బాంబు స్వయంగా మన పోఖ్రాన్ వ్యవహారం లాంటిదే ఆ బాంబు ఒక సంవత్సరం లోపే శ్రీమతి ఇందిరాగాంధీని నియంతగా మార్చి వేసింది పురుషులనూ -- స్త్రీలనూ - ఇట్లా రాక్షసులుగా మార్చేసే విచిత్ర మైన శక్తి అణుబాంబులకు ఉన్నది జియా కూడా దానికి అతీతుడేమీ కాదు మనకు చాలా కాలం క్రితం తెలిసిన విషయాన్నే (పాకిస్తాన్ దగ్గర బాంబు ఉన్నదని) అమెరికన్ పత్రికలు ఇప్పుడు నిర్ధారించాయి పాకిస్తాన్‌కు కేవలం బాంబు తయారు చేయగల శక్తి మాత్రమే కాక , పూర్తిగా అభివృద్ధి చెందిన న్యూక్లియర్ బాంబు ఉన్నదనీ, అది వేసినప్పుడు బీభత్సాన్ని సృష్టించగలదనీ, అవి ఒకటి కన్నా ఎక్కువగా కూడా ఉండవచ్చుననీ ఆ పత్రికలు వ్రాశాయి ఈ మధ్యనే ఇస్లామాబాద్ బాంబు నిర్మాత డా ఎ. క్యు-ఖాన్ ఒక ఇంటర్వ్యూ ఇచ్చారు దానిలో కొన్ని భాగాలు భారత దేశంలోని పత్రికలలో కూడా అచ్చయ్యాయి తన బాంబు తయారు చేసే కృషి ఎలా సాగిందన్న దానిని మాత్రమే గాక, అంతకన్నా ఆందోళన కరంగా ఆయన ప్రస్తుతం తన దేశం అణ్వాయుధ నిర్మాణంలో పూర్తిగా స్వయం సమృద్ధంగా ఉన్నదని అన్నారు

మరి మన అణుశక్తి శాస్త్ర వేత్తలు ఏం చేస్తున్నారు? ఏ కార్యాలయంలో ఎవరు కూచోబోతున్నారనే విషయంపైనా, వారికి ఎంత మంచి ఆకర్షణీయమైన హోదా ఉంటుందనే విషయం పైనా తగవు లాడుకుంటున్నారు డాక్టర్ ఖాన్ ఎప్పుడూ ఏ విషయం గురించీ పేచీ పెట్టుకోలేదు విదేశాలలో చదువు ముగించుకొని తిరిగి వచ్చి జాతీయ కర్తవ్యానికి తనను తాను పూర్తిగా అంకితం చేసుకోదలచు కున్నప్పటికి ఆయన అనామకుడు- అవి ఆయన మాటలే - జాతీయ కర్తవ్యమంటే బాంబు తయారు చేసి తన దేశాన్ని భారతదేశంతో సమానం చేయడం మనకు వాళ్ళకంటే మంచి శాస్త్ర వేత్తలు ఉండవచ్చు గాని పాకిస్తాన్‌లో జాతీయ కర్తవ్యానికి ఖాన్ అంకితమైనట్టుగా మన దగ్గర అంకితమయ్యే వాళ్ళు ఒక్కరు కూడా లేరు పైగా మనకు మంచి శాస్త్ర వేత్తలున్నారనేది కూడా ఇప్పుడింకెంత మాత్రమూ నిజం కాదు ఎందుకంటే మన అణుశక్తి శాస్త్ర వేత్తలలో ఒక్కరైనా నోబెల్ బహుమతి గ్రహీతలు లేరు కాని పాకిస్తాన్‌లో ఒకరున్నారు

మన అత్యున్నత శాస్త్రవేత్తలూ, ఇంజనీర్లూ అటువంటి పద్ధతిలో ఎందుకు ప్రవర్తిస్తారో నని నేను తరచుగా ఆశ్చర్యపడుతూ ఉంటాను గత వారం విదేశాలలో ఉన్న భారతీయులనబడే వాళ్ళు ఢిల్లీలో ఒక పెద్ద సమావేశం జరిపారు అది చాలా మామూలు గానే ప్రభుత్వం తమ కోసం అన్ని రకాల పనులూ చేయవలసి ఉన్నదనే హెచ్చరిక లాంటి దానితో ముగిసింది ఈ విదేశాలలోని భారతీయులు తమను ప్రత్యేక తరగతికి చెందిన భారతీయులుగా పరిగణించాలని కోరుతున్నారు దేశ ఆర్థిక వ్యవస్థను విచ్ఛిన్నం చేసే టటువంటి రాయితీలనూ సౌకర్యాలనూ పొందడం తమ హక్కు అయినట్లుగా డిమాండ్ చేస్తున్నారు భూమిని, స్థిరాస్తులను కొనడంలో తమకు ప్రత్యేక సౌకర్యాలుండాలని



వాళ్ళు కోరుతున్నారు అంతర్జాతీయ ధరలతో బంగారాన్ని ఇక్కడికి తెచ్చి, నల్ల బజారు ధరలలో ఇక్కడ అమ్మ దలచు కుంటున్నారు తన దగ్గర వనరుల కొరత వల్ల – ప్రభుత్వం వాళ్ళను ఇక్కడికి ఆహ్వానించింది గనుక వాళ్ళ కోర్కెలను ఆమోదిస్తే, మనకు ఇప్పుడున్న ఎక్కువ హక్కుల వర్గాలు చాలనట్టు మరొక కొత్త హక్కుల వర్గం తయారవుతుంది ప్రతి భారతీయుడూ తమను ఇతర భారతీయుల కన్న ప్రత్యేకంగా పరిగణించాలని వారు కోరుకుంటున్నట్టున్నారు– ప్రవాస భారతీయులు తమంతట తామే ఒక శక్తిగా, బాగా సంపన్నంగానూ, అధికార యుతంగానూ ఉన్నారని నేను అనుకుంటాను కాని అది వాళ్ళకు సరిపోదు ఇతర భారతీయులతో తమను కలపడం తమకు అవమాన మన్నట్టుగా వాళ్ళు తమను ఒక ప్రత్యేక వర్గంగా చూడాలని కోరుకుంటారు

ప్రవాస భారతీయులు భారతీయులైనా కావాలి, కాకుండా నైనా ఉండాలి వాళ్ళు భారతీయులే అయితే వాళ్ళు మిగతా భారతీయుల లాగనే పరిగణించ బడాలి అలా పరిగణించ బడుతున్నందుకు వాళ్ళు గర్వించాలి వాళ్ళు భారతీయులు కాకపోతే మిగతా విదేశీయులలాగే పరిగణించ బడాలి వాళ్ళు ఇక్కడికి వచ్చేందుకు గాను ప్రభుత్వం కొన్ని సౌకర్యాలు ఇవ్వజూపడాన్ని నేను అర్థం చేసుకోగలను కాని వాళ్ళు ప్రత్యేక సౌకర్యాలు కోరడం, తాము ఎంత ముఖ్యమైన వారో, తమ ప్రమేయం ఎంత తప్పని సరో చాటింపు వేసుకోవటం కన్నా స్వార్థం మరొకటి ఉండదు

భారతీయులందరూ సమానమే కాని కొందరు మిగతా వారికన్నా ఎక్కువ సమానమైనట్టు కనబడుతున్నది మన మిత్రుడు అమితాబ్ బచ్చన్ ఈ మధ్యనే ఒక సరిహద్దు భద్రతా దళం విమానంలో అండమాన్ దీవులకు బయల్దేరి, దౌత్య పత్రాలేమీ లేకుండా బర్మాలో దిగారు బర్మా అధికారులు ఆయన తమ దేశం లోకి ప్రవేశించడానికి అనుమతించకుండా బైటికి పంపించినప్పుడు ఆయన ఆగ్రహావేశాలలో పడి విదేశాంగ శాఖ కార్యదర్శి 'పని పడతా నన్నారు– అది ఆయనన్న మాటే బచ్చన్ విహార యాత్రలో ప్రతి విషయం అపసవ్యంగానే ఉంది ఆయనకు సరిహద్దు భద్రతాదళం వారి విమానం వాడుకునే హక్కు లేదు ఆయన రాజీవ్ గాంధీకి మంచి మిత్రుడయినా సరే ఆయన ఆ విమానాన్ని బర్మా తీసుకు వెళ్ళేందుకు ఎవరు అనుమతించారు? తమను చాలా ముఖ్యమైన వ్యక్తిగా పరిగణించ లేదని బర్మాలో అధికారులనూ, ఢిల్లీలో మన అధికారులనూ తిట్టే హక్కు ఆయనకి లేదు ఎందుకంటే ఆయన ముఖ్యమైన వ్యక్తి కాదు గనుక మరి, ఎవరి అదికారంతో రాజీవ్ గాంధీ తన మిత్రులనూ, బంధువులనూ నౌకాదళానికి చెందిన నౌకలో అండమాన్ దీవులకు యాత్రకు తీసుకు వెళ్ళారు? ఆ పది రోజుల కుటుంబ విహార యాత్ర ఖర్చును ఎవరు భరించాలి? మన అణుశక్తి శాస్త్రవేత్తల గురించి, వారి చికాకు కల్గించే ప్రవర్తన గురించీ ఉన్న సమస్యల మాదిరే ఈ ప్రశ్నలని కూడా పార్లమెంట్‌లో అడగాలి

చాలా సంవత్సరాల క్రితం, నేను లండన్‌లో విద్యార్థిగా ఉన్నప్పుడు అక్కడ ఒక లేబర్ పార్టీ మంత్రికి ఎన్నికల ప్రచారంలో సాయపడ్డాను ఆయన తమ అధికారికమైన కారులో తమ నియోజక వర్గం లోని ఏదో ఒక కార్యక్రమానికి హాజరై అక్కడ ఆ డ్రైవర్‌నూ, కారునూ వదిలేసి తన స్వంత కారును – ఎప్పటిదో పాత కారది – ఎన్నికల ప్రచారానికి వాడేవాడు. ఆయన భార్య ఆ కారు నడిపేది. మేం ఆ వెనుక రోడ్డు మీద నిలబడ్డ వాళ్ళకి కరపత్రాలు పంచుతూ ఉండే వాళ్ళం. ఆయన క్లెమెంట్ అట్లీ ఆయన అప్పుడు ఇంగ్లండ్‌కు ప్రధాన మంత్రి. రాజీవ్ గాంధీ ఇంట్లో వారు ఎవరైనా ఆ పేరు విని ఉన్నారా? □